









# మీపాపాయి సంక్షేమమే మాముఖ్యఆశయం

ప్రపంచవ్యాప్తంగా డాక్టర్లంతా తల్లి పాలను పసిపాపలకు కావలసిన పోషక పదార్థాలతో పాటు,రోగ నిరోధక శక్తిని పరిపూర్ణంగా యిచ్చే పౌష్టిక ఆహారంగా అంగీకరించారు.

తల్లి పాలు సమృద్ధిగా లేనప్పుడు పాపాయికి 'విజయ స్ప్రే' వంటి 'శిశు ఆహారం' ఇవ్వడం మంచిది. సెంట్రల్ ఫుడ్ టెక్నాలాజికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియావారి ఫార్ములాను అనుసరించి విజయస్ప్రేను స్వచ్ఛమైన పాలు, విటమిన్లువంటి పోషక పదార్థాలతో కలిపి రూపొందించారు. లోపల చక్కగా సీలు వేసి, ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్‌స్టిట్యూషన్ మరియు కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ & ఇండస్ట్రియల్ రీసెర్చి ఆఫ్ ఇండియావారి అనుమతి పొంది మీ వద్దకు వస్తోంది. మీ పాపాయికి కావలసిన అన్ని పోషక పదార్థాలతో శాస్త్రీయంగా అత్యంత శ్రద్ధతో ఉత్పత్తి చేయబడుచున్న అమూల్య ఆహారం.

## విజయస్ప్రే

తల్లిపాలు పసిపిల్లలకు అత్యుత్తమమైనవి.

శిశు సంక్షేమం కోరి విడుదల చేసినవారు ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య లిమిటెడ్
విజయ స్ప్రే తయారు చేయువారు

FDS APDDCFL 3883 Tel

దేశ విఖ్యాతిగాంచిన విమల్ చీరల్లో సరిక్రొత్త శ్రేణికై
విచ్చేయండి నేడే మంగళ్ దీప్ కి.




# మంగళ్‌దీప్

కోఠీ, హైదరాబాద్, ఫోన్ : 45786

ఆంధ్ర ప్రదేశ్‌లో అన్నిటికన్నా పెద్దదైన విమల్ షోరూం

## డా॥ జయ్‌దుబాషి దుర్వ్యాఖ్యానాలు

15–4–83 వ తేదీ ఆంధ్రసచిత్రవార పత్రికలో "న్యూఢిల్లీ లేఖ"లో డా॥ దుబాషి గారు మార్క్సిజం గురించి రాసినవి చదివి చాలా ఆశ్చర్యం కల్గింది.

"ఆర్థికశాస్త్రమనేది ఒక శాస్త్రం కాదు, రాజకీయాలు కూడా ఒక శాస్త్రంకాదు. కీన్స్ కాని, మార్క్స్ గాని శాస్త్రవేత్తలు కారు. ఆర్థిక సూత్రాలు లేవు, రాజకీయ సూత్రాలు లేవు– సూత్రాలనేవి నిర్జీవ పదార్థాలకే — మానవుడి జీవితమంతా ఎగుడు, దిగుడు తప్పదు. కొన్ని వృద్ధి చెందుతాయి. తర్వాత క్షీణిస్తాయి. చివరికి మాయమైపోతాయి" అంటూ ఆయన రాసుకొన్నారు. అసలు ఈ జీవితమే ఒక మిథ్య అని కూడా ... డా॥ దుబాషిగారు రాసుకొన్నా, మనకేం ఆక్షేపణ లేదు. అవన్నీ వారి స్వంత అభిప్రాయాలు. కాని మార్క్స్ చెప్పినవన్నీ ఆయన చెప్పినట్లు రాసి, దాని ఫలితాలను విశ్లేషించి, ఆ ఫలితాలను గూర్చి తన ఆవేదన వ్యక్తపర్చి, అందుచేత మార్క్సిజం పనికిరాదని, మార్క్స్‌ను భ్రష్టు పట్టించ పూనుకోవడం చూస్తేమటుకు డా॥ దుబాషిగారి చిత్తశుద్ధిని శంకించాల్సి వస్తోంది. "చరిత్ర మార్క్స్ చెప్పిందంతా తప్పు అని ఋజువు పర్చిందా, లేదా" అంటూ ఆయనొక ప్రశ్నవేశారు. "ఆయన జరుగుతాయని అన్నవేవీ జరుగలేదు." అని సమాధానం చెప్పారు. దానికి ఆయనిచ్చిన ఉదాహరణలు మటుకు దుబాషిగారి వక్రీకరణలను పట్టియిస్తున్నాయి. ఆయన కనీసం కమ్యూనిస్టు ప్రణాళిక చదివే ఓపిక చేసుకొన్నా, ఇంత అస్తవ్యస్తంగా ఆయన రాసేవారు కారు.

1. రాజ్యం నశించడం గురించి :– పెట్టుబడిదారీ విధానం నశించి, సోషలిజం ఏర్పడి, అది కమ్యూనిజంగా పరివర్తన చెందాకనే, 'రాజ్యం' నశిస్తుందని మార్క్సిజం చెబుతుంది. ప్రవర్తిత సోషలిజం అనే దశలో వున్న సోవియట్‌లో రాజ్యం నశించాలంటే అక్కడ 'కమ్యూనిజం' రావాలన్నమాట– దీనికి లెనిన్ సూత్రీకరణ మరొకటి ఉన్నది. "ప్రపంచంలో, అధికభాగం సోషలిస్టు ఆర్థిక సంబంధాలు ఏర్పడితే తప్ప, ఏ ఒక్క దేశంలోనూ విడిగా కమ్యూనిజం ఏర్పడదు అనేదే ఆ సూత్రం– ఇక రాజ్యం నాశనం సంగతి కమ్యూనిజం వచ్చాకనే : ఈ విషయాలు మార్క్సిజం తెల్సిన ప్రతి ఒక్కరికీ తెలిసినా–మార్క్సిజాన్ని వ్యాఖ్యానించ పూనుకొన్న డా॥ దుబాషికి తెలియకపోవడం విచారకరం.

2. కార్మికులు సమాజానికి దూరమవ్వడం :– అసలు ఈ భావన మార్క్సిజానికే విరుద్ధం — ఇది ఎందులో వుందో మాకు అర్థం కావటం లేదు. కార్మికులు సమాజంలో ముఖ్య



భాగం అవుతారనేదే మార్క్సిజం చెప్పేది– మరి డా॥ దుబాషి కార్మికులు సమాజానికి దూరమవుతారని మార్క్స్ చెప్పాడని వ్రాయడం అర్థరహితం. బహుశా వర్గపోరాటం అంటే కార్మికులు సమాజానికి దూరమవడం అని డా॥ దుబాషి అర్థం చేసుకొని వుంటారు !

3. వర్గరహిత సమాజం :– ఇంకా దూరంలోనే వుంది అన్నారు దుబాషి. దూరంలో వుండే ఆదర్శాలను వాస్తవంలోకి, దగ్గరలోకి తేవాలని కమ్యూనిస్టులు చేసే విప్లవపోరాటాల గూర్చి ఆయన అధ్యయనం చేస్తే వర్గరహిత సమాజం ప్రస్తుతం ఎందుకు రాలేదో, ఎప్పటికి వస్తుందో అర్థమై వుండేది. ఇంకా ఆచరణలోకి రాలేదుకాబట్టి, అది పనికిమాలినది అనడం అంటే "1930లో భారత స్వాతంత్ర్యకాంక్ష" కూడా పనికిమాలినది అనడంలాంటిదే !

4. రష్యా నిరంకుశ రాజ్యం :– అవును, ప్రజాస్వామ్య (పెట్టుబడిదారీ) నికి పుట్టినిల్లు అని డంబాలు పలికే బ్రిటన్, అమెరికాల్లాంటి దేశాల్లో ప్రజాస్వామ్యంపట్ల వారి ప్రజలకి ఎంత విశ్వాసముందో పోలింగ్ పెర్సెంట్‌బట్టే చెప్పవచ్చు. అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో 40% కంటే తక్కువ ప్రజలుమాత్రం పోలింగ్‌లో పాల్గొన్నారు. అదే సోవియట్ ఎన్నికల్లో 98 – 99 శాతం ప్రజలు ఎన్నికల్లో పాల్గొంటున్నారు. బాయ్‌నెట్ మొనతో ఎంత నిరంకుశుడైన ఎంతోకాలం పాలించలేడనేది చారిత్రక సత్యం — నానాటికి మహత్తర సాంస్కృతిక విలువలు సంతరించుకొంటున్న సోవియట్ నాగరికత అక్కడి ప్రజాస్వామ్య వ్యవస్థను మనకు విశదం చేస్తుంది. 'ఇనుపతెర' 'నిరంకుశత్వం' ఇలాంటి మాటలు సోవియట్ ప్రజలని అవమానపర్చడం. వారి పోరాట సాంప్రదాయాల్ని మంటగలపడం అవుతుంది.

5, ఫైడల్ కాస్ట్రోపై హత్యాప్రయత్నం గురించి :– ఆయన అంగరక్షకులు లేకుండా ఎక్కడికయినా వెళ్ళగలిగితే మార్క్స్ స్వర్గాన్ని భూమ్మీద చూసినట్టే — అంటూ తోటి మార్క్సిస్టులే ఆయన్ని హత్య చేయాలని చూస్తున్నట్లు రాసారు. ఇది వ్యాఖ్యాతగారి అంతులేని ఉగ్రపక్షి తత్వాన్ని — ప్రపంచానికి గొప్ప తాత్వికునిగా పోజుపెట్టాలనే కుత్సితబుద్ధిని మనకు తేటతెల్లం చేస్తున్నది — కాస్ట్రోపై సి. ఐ. ఎ. 70సార్లు హత్యాప్రయత్నం చేసిందనేది పత్రికలు చదివే సాధారణ పాఠకులకు తెల్సు — ఇవెందుకు జరుగుతుందనేది వారికి తెల్సు — కాని దుబాషి గారు ఆ భావాన్ని వక్రీకరించదల్చారు — అంతే!

6. మానవుడుసైతం ఒక యంత్రం :– అని మార్క్స్ చెప్పినది నిజమయితే బాధపడే వాళ్ళలో నేనొకడిని అంటున్నారు. అసలు మార్క్స్ తపన అంతా అదేకదా !

పెట్టుబడిదారీ విధానం మానవుడ్ని యంత్రంలా మార్చేసింది. అతనిని నిజమైన మానవుడిగా తీర్చిదిద్దాలనేదే మార్క్సిస్టుల బాధంతా. దీన్నే పెట్టుబడిదారులు నిరోధిస్తున్నది — అందుకే వర్గపోరాటం అవసరమయ్యింది.

పోతే హిట్లర్‌కూడా ఒకప్పుడు మార్క్సిస్టే; వియత్నాంలో కవులనూ, కళాకారులను జైళ్ళలో పడవేయుటం; కమ్యూనిస్టు దేశాల్లో సంక్షోభం; మానవుడి చరిత్రలో ఏదో పద్ధతి కన్పిస్తుందని నిరూపించటానికి ప్రయత్నించి, మళ్ళీ విఫలుడయ్యాడు; అంటూ దుబాషి వ్రాసినవి ఏమాత్రం వాస్తవాలో చరిత్రను పరిశీలించే అందరికీ తెల్సు. హిట్లర్‌ని మార్క్సిస్టు అనే ధైర్యం ప్రపంచంలో బహుశ 'ఈయనకే' దక్కింది. హిట్లర్ పార్టీ నేషనల్ సోషలిస్ట్‌పార్టీ కాబట్టి — ఆయన అలా అనుకొని వుంటారు. కాని నేషనల్ సోషలిజం అనే భావన మార్క్సిజానికి విరుద్ధం. మార్క్స్ కాలంనాడు లేని సోషలిజం — నేడు ప్రపంచంలో అన్ని దేశాల ప్రజలను ఉత్తేజపరుస్తోంది. 150 కోట్ల ప్రజలు సోషలిస్టు సమాజ నిర్మాణంలో కృషి చేస్తున్నారు. పెట్టుబడిదారీయేతర పంథాలో అనేక దేశాలు పయనిస్తున్నాయి. చివరకి బి. జె. పి. లాటి పార్టీలు సైతం సోషలిజమ్ పేరుచెప్పుకొని, ముందుకొస్తున్నాయి. ఇది మార్క్సిస్టు భావాల విజయానికి తిరుగులేని నిరూపణ.

మానవుడు ప్రాథమిక అవసరాలైన తిండి, బట్ట, ఇల్లు, విద్య, వైద్యంతోపాటు, క్రీడలు, సాహిత్యం, విజ్ఞానశాస్త్రం, సాంస్కృతిక రంగాలలో సోషలిస్టు వ్యవస్థ మానవుడి అవసరాలను తీర్చడంలో ఘనవిజయాలు సాధించింది. గుర్తించిన, గుర్తించకపోయినా, మార్క్సిజం ఒక చారిత్రక వాస్తవం —

డి. సోమసుందర్ (తాడేపల్లిగూడెం)

## న్యూఢిల్లీ లేఖ

'జయ్‌దుబాషి' గారి "న్యూఢిల్లీ లేఖ" దేశపు ప్రస్తుత పరిస్థితులను చక్కగా ఆకళింపు చేసుకోవటానికి ఉపయోగపడ్తాయనటంలో సందేహంలేదు.

వేమూరి సాయిప్రసాద్, ప్రదీప్‌కుమార్ (చీరాల)

* * *

3–6–83 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో న్యూఢిల్లీ లేక "అధికోత్పత్తికి ప్రోత్సాహం అవసరమా" అద్భుతంగా ఉంది.

సి. ప్రతాప్, సి. ప్రకాష్ (విశాఖపట్నం) ★

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

*శివలెంక శంభుప్రసాద్*

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 17–6–'83

రుధిరోద్గారి నామ సం. జ్యేష్ఠ శు. సప్తమి

**సంపుటము 75 సంచిక 42**

సంపాదకుడు :

*శివలెంక రాధాకృష్ణ*

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 1-50 |
| ఆరు మాసాల చందా | రు. 42-90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 85 80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం· విజయవాడ-520 003·


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి జయసుధ

ఫోటో: 'కాజాన్'



లోకంపోకడ * ఊమెన్









# రాజకీయాలలో కంపెనీలు

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

మేనక అంటే శ్రీమతి గాంధీకి ఎందుకంత కోపం ? అంత కోపం లేకపోతే ఇలాగ బజారున పడి ఒకళ్లనొకళ్లు తిట్టుకుంటారా ? మేనక అప్పుడూ ఇప్పుడూ శ్రీమతి గాంధీ కోడలే అనుకోండి — అది అంత ముఖ్యమయిన విషయం కాదు. ఎందరు అత్తా కోడళ్లు పోట్లాడు కోవటంలేదు కాని వాళ్ల కొట్లాటలు ఇలాగ బజారున పడుతాయా ? ఆలోచించి చూస్తే ఈ యుద్ధం కూడా స్వరాజ్‌పాల్—భరత్‌రామ్—నందాల మధ్య యుద్ధం లాగే ఉందనిపిస్తుంది. ఒక చిన్న తేడా ఉందనే ఉందనుకోండి — పాల్—రామ్ — నందాలు ఇద్దరు గాంధీల లాగా వీధిన పడటంలేదు.

ఈ పరిస్థితిని అర్థం చేసుకోవాలంటే రాజకీయవాదులు వ్యాపారులనీ, వాళ్ల పార్టీలు కంపెనీలనీ అర్థం చేసుకోవాలి. శ్రీమతి గాంధీ ఆరితేరిన వ్యాపారి అని వేరే చెప్పనక్కరలేదు. ఆమె రాజకీయ పక్షానికి ఆమె పేరే ఉంది. ఇది సమంజసంగానే ఉంది. ఆమె పార్టీ ఒక ప్రయివేట్ లిమిటెడ్ కంపెనీ లాంటిది. అత్యవసర పరిస్థితి లేదా ఎమర్జెన్సీదాకా అది ఇందిరాగాంధీ ప్రయివేట్ లిమిటెడ్‌గా ఉండేది. ఆ కంపెనీకి శ్రీమతి గాంధీయే అధ్యక్షురాలూ, మేనేజింగ్ డయిరెక్టరూ కూడా. అత్యవసర పరిస్థితి కాలంలో ఆమె తమ కుమారుడు సంజయ్‌ని ఒక డయిరెక్టరుగా తీసుకున్నారు. అప్పుడు అది ఇందిరా — సంజయ్ — ప్రయివేట్ లిమిటెడ్‌గా మారింది. సంజయ్ మరణించాడు. ఆయన షేరులని మేనకకి ఇచ్చారు. ఆమె ఒక చిన్నతరహా డయిరెక్టరుగా ఉంటుందని అనుకున్నారు. కాని, కథ అడ్డం తిరిగింది. సంజయ్ స్థానాన్ని ఆక్రమించిన వ్యక్తి రాజీవ్, అతని వాటాలూ, కంపెనీ కాస్తా ఇందిరా — రాజీవ్ ప్రయివేట్ లిమిటెడ్‌గా మారింది.

పోనీ ఈ కంపెనీ అయినా బాగా నడుస్తుందా అంటే మేనక ఆశలు పెరిగిపోయి ఆమె తమస్వంత కంపెనీ పెట్టుకుంది. అంతటితో ఊరుకోకుండా ఆ కంపెనీకి సంజయ్‌పేరు పెట్టింది. ప్రస్తుతం జరుగుతున్నయుద్ధం ఈ కంపెనీలమధ్య జరుగుతున్నదే. ఒకపక్క ఇందిరా—రాజీవ్ ప్రయివేట్ లిమిటెడ్; మరొకపక్క సంజయ్ మేనకా ప్రయివేట్ లిమిటెడ్. పేరు తెచ్చిందే తగాదా అంతా. మేనకకి ఎన్ని గుండెలు లేకపోతే తన సంస్థకి శ్రీమతి గాంధీ కుమారుడి పేరు తగిలిస్తుంది ? అంతేకాకుండా, శ్రీమతి గాంధీతో పోటీ పడుతుందా ? కొన్ని దశాబ్దాలుగా రాజకీయాల వ్యాపారం చేసి దానిలో బాగా లాభాలు గడించిన ఒక నెహ్రూ వంశపు వ్యక్తి ఈ అక్రమాన్ని ఎలాగ సహించగలరు? అందుకనే, ఈ కుటుంబ — వ్యాపారం ముక్కలయింది. అన్ని కుటుంబ వ్యాపారాలూ ఎప్పుడో అప్పుడు చీలవలసిందే. నిన్నటి భాగస్వాములు ఇవాళిటి శత్రువులు అయిపోతారు. మేనక వితంతువు. కాని, సంజయ్ పోయిన అనతి కాలంలోనే మంచి బట్టలు వేసుకోవటం మొదలుపెట్టిందిట, ఇది తప్పా ? ఆ మాటకి వస్తే శ్రీమతి గాంధీ వితంతువు కాదూ ? ఆమె వేషం సంగతి ఏమిటి ?

ఒక కంపెనీని బయటివాళ్లు చేజిక్కించుకోవాలని ప్రయత్నిస్తే పేచీ తప్పదు. మేనకా గాంధీ ఈ దేశంలో కాకుండా ఇంకెక్కడో నివసించే వ్యక్తి కాదుకదా ? ఆమె నివాసం, కార్యాలయం ఎక్కడ ఉన్నాయి ? 1 సఫ్దర్‌జంగ్ రోడ్‌కి దగ్గరలోనే ఉన్నాయి. ఈ కార్యాలయానికి దేశం అంతటా బ్రాంచిలు ఉన్నాయి. అమేతీ అనే ఊరిలో కూడా ఒక బ్రాంచి ఉంది ఈ కంపెనీకి. ఈ ఊరికి ఈమధ్యనే శ్రీమతి గాంధీ కంపెనీ నుంచి ఒక డయిరెక్టరు వచ్చి వెళ్లారు. ఆమె ఒక భారతీయ వ్యక్తి కూడా కాదు. ఒక ఇటలీ దేశపు మనిషి. ఆమె పేరు సోనియా. అంటే అమేతీలో శ్రీమతి గాంధీ కంపెనీకి బాగా చికాకు కలిగిస్తోందన్న మాట శ్రీమతి మేనక కంపెనీ యొక్క బ్రాంచి. అందుకనే, అధ్యక్ష పదవిలో ఉన్న శ్రీమతి గాంధీ, మేనేజింగ్ డయిరెక్టర్ రాజీవ్‌గాంధీ ఇంత పట్టుదలగా పనిచేస్తున్నారు.

ఈ కంపెనీలో వ్యాపారం చేసే సరుకు ఏమిటి ? కొన్ని కంపెనీలు వనస్పతి, మరికొన్ని టీ, మరికొన్ని ఇంకేదో సరుకుతో వ్యాపారం చేస్తే శ్రీమతి గాంధీ కంపెనీ, తదితరుల కంపెనీలూ కోట్లతో వ్యాపారం చేస్తాయి. ఇది ''బల్లమీద'' చెయ్యగలిగిన వ్యాపారం కాదు, బల్లకింద చేసే వ్యాపారం. అమేతీనే తీసుకోండి. అక్కడ ''చీకటి బజారూ'' ఉంది. ''వెలుతురు బజారూ'' ఉంది. కాని, కోట్ల లెక్క మాత్రం ''వెలుతురు బజారు''లోనే జరుగుతుంది. కంపెనీలకి 'రిజిస్ట్రార్' అనే అధికారి ఉంటాడు. రాజకీయాలకి ఎన్నికల కమీషనరు ఉంటాడు. అమేతీ సీటు పోయిందా మేనేజింగ్ డయిరెక్టరు రాజీవ్‌కి తన ఉద్యోగం పోతుంది. అంటే మేనేజింగ్ డయిరెక్టర్‌గా ఉండడు. ఇటలీ వనితామణికి ఎటువంటి ఉద్యోగమూ ఎలాగూ లేదు కనుక ఈ కుటుంబం వాళ్లు ఇంత లాభకరమయిన వ్యాపారాన్ని పోగొట్టుకుంటారా ? ఒక విధంగా ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అంతకి ముందున్న ఈస్ట్ ఇండియాకంపెనీకి వారసత్వపు సంస్థ. కాంగ్రెసు పెట్టి వంద సంవత్సరాలయితే ఇటువంటి దివాళా ఏమిటి ?

సాధారణంగా కంపెనీలలో ఇబ్బందులు వస్తే వాటి అధ్యక్షులు లేదా అధిపతులు ఇతర కంపెనీలతో కలుస్తూ ఉంటారు. శ్రీమతి గాంధీ ఇప్పుడు జ్యోతిబాసుతో బేరాలు చేస్తున్నారు. ఈయనకి కలకత్తాలో ఇంచుమించు ''సర్వాధికార — వ్యాపారం'' ఉంది. అలాగే ఆమె హైదరాబాదులో ''ఎన్. టి. ఆర్.''తో బేరాలు మొదలు పెట్టారు — ఈయనకీ అక్కడ ఒక రకం సర్వాధికార — వ్యాపారం ఉందనవచ్చు. మదరాసులో ఎమ్. జి. రామచంద్రన్ వ్యాపారం అంత బాగా జరగటంలేదు కాని ఆయనతోనూ బేరాలు జరుగుతూనే ఉన్నాయి. పెద్ద కంపెనీలలో ఇదేపని చేస్తూ ఉంటారు. తక్కిన కంపెనీలలో షేరులు కొంటూ ఉంటారు, పేచీలు పెట్టేవాళ్లని డయిరెక్టరు పదవులు ఇస్తానంటూ ఉంటారు. ఇందిరా — రాజీవ్ ప్రయివేట్ లిమిటెడ్‌ని ఇందిరా రాజీవ్ ఎండ్ కంపెనీగా మార్చినా మార్చవచ్చు. ఈ పని చేస్తే ( అంటే ప్రయివేటు లిమిటెడ్‌ని పబ్లిక్ లిమిటెడ్‌గా మారిస్తే ) అదుపు తప్పినట్లు అనిపించవచ్చు కాని నిజంగా చేసింది ఏమిటంటే కొన్ని వాటాలు జనానికి ఇచ్చి, స్నేహితులకి కొన్ని ఇచ్చినట్లు—అంతే. జ్యోతిబసు స్నేహితుడా? కాదేమో. అయినా ఆయన సయితం వ్యాపారంలో ఉన్నాడు కనుక స్నేహితుడే అనుకోవాలి. జ్యోతిబసు కుమారుడు ''అసలు వ్యాపారం''లో ఉన్నాడు. ఆయనకి ఒక బిస్కట్లు తయారు చేసే కంపెనీ ఉంది. ఒక విధంగా చూస్తే ఇది ''ఫెరా'' కంపెనీ. [విదేశీ మారకద్రవ్యం నియంత్రణ వర్తించే కంపెనీ అన్న మాట.] వాటాదారులు కొందరు మాస్కోలోనూ, బెయిజింగ్‌లోనూ ఉన్నారు. ఈ ఫెరా కంపెనీలని ఎటు కావలిస్తే అటు తిప్పి పిండవచ్చు. ఎన్నికల

[66 వ పేజీ చూడండి]

# ఘాటాక్షుని డైరీ



## మోసానికి ప్రాణం !

సేలానికి చెందిన ఆలాటిపట్టిలో 30 ఏళ్ల వైరన్ అనే వొకతను అదే వూరుకు చెందిన చిన్నప్ప ఉడయారుకు వో బంగారు గొలుసు రెండువేల రూపాయలకు అమ్మేసి, చక్కాపోయాడట. ఆనకా ఉడయారు ఆ గొలుసు నకిలీదని గ్రహించి, తననంత మోసం చేసిన వైరన్ గాడిని సంహరించాలని తన స్నేహితులతో కలిసి ప్లాను వేసుకున్నాడట. తత్ ప్రకారం ఆవైరన్ని దారికాసి, పెడరెక్కలు విరిచికట్టి, తాను తన మిత్రులూ కలిసి, రాళ్లతో కొట్టి అతన్ని చంపేశారట.

## విశ్వ విద్యాలయంలో గుమాస్తాల గోడు !

మద్రాసు విశ్వవిద్యాయలంలో గత మూడు సంవత్సరాలుగా కొందరు క్లర్కులు టెంపరరీగా పనిచేస్తున్నారట. వారి దురదృష్టమో అన్నట్టు వీరి తరువాత వచ్చిన వారు కూడా పెర్మనెంట య్యారట. వీరు శాశ్వత వుద్యోగులతో సమానమైన బాధ్యతలను నిర్వహిస్తున్నారట. తమ గోడును, రిజిస్ట్రారుకు, వైశ్చాన్సలరుకు, గవర్నరుకు చెప్పి, ఇహ సి. యం. ఎం. జి. ఆర్. వద్దకు వెలితే ఆయన వారిని చూడనందువల్ల మహజరాయన సెక్రెటరీకి యిచ్చారట. ఆ తరువాత కూడా ఏ ఫలితమూ లేనందువల్ల వారు ప్రధాని మేడమ్ గాంధికి ఒక లేఖను సమర్పించారట. దీంతో విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు వారందరికీ నోటీసులు యిచ్చి, మీరు నేరుగా ప్రధానికి యీ చిన్న విషయం రిపోర్టు చేసినందుకు, మీ మీద ఏల చర్య తీసుకోనరాదు అని ప్రశ్నించారట — వో చదువరీ విద్యాసంస్థ రిజిస్ట్రారుకు అంతచేటు కనీసపు రూల్సు తెలీవా— ఏ పౌరుడయినా తనకు కలిగిన కష్టాన్నిగానీ నష్టాన్నిగానీ దేశపు అత్యదిక అధికారి (రాష్ట్రపతి)కే రాయవచ్చు కదా !

## పోలీస్ స్టేషన్లో మానభంగాలు !

గోరక్‌పూర్‌కు చెందిన ముందేర్వ బజార్ అనే గ్రామ పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు వో ఇద్దరు కానిస్టేబుల్స్‌తో బిస్‌రాల్సో యింటిమీద దాడిచేసి, ఇంటాయనేడి అని ఆతని భార్య 22 ఏళ్ళ నిషా అనే ఆమెనడిగాడట. తన భర్త గోరక్‌పూరు వెళ్లారని చెప్పేసరి కాతడు ఆ యింట్లోంచి వో ట్రాన్సిస్టరు, కొన్ని ఖరీదయిన బట్టలూ పట్టుకుపోయి, ఆనక ఆమెను కూడా తీసుకుపోయి, తన కామదాహం తీర్చుకుని, తన తోటి పోలీసులక్కూడా అది పంచి ఇచ్చాడట. ఆమె అత్తగారు తన కోడలు ఏమయ్యిందని పోలీస్టేషనుకు వస్తే ఆమెను కూడా బలాత్కరించి అక్కడి వారంతా తమ తమ కామదాహాలు తీర్చుకున్నారట. నిషాను మూడురోజులపాటు రోజూ సామూహిక బలాత్కారాలు చేసి తమ పైశాచిక కామాన్ని తీర్చుకున్నారట.

## సినిమా వేషాల్ని తిరస్కరించిన ఫూలన్‌దేవి !

అమ్మడూ ! నీమీద వో సిన్మా తీస్తాం. నువ్వే నటించు. ఇందు యీ వొప్పందంమీద సంతకంచై అంటూ బొంబాయి నిర్మాతలుజైల్లో వున్న ఫూలన్‌దేవికి వొప్పందం పేపర్లందిస్తే ఆమె వాటిని విసిరికొట్టి, పిచ్చి పిచ్చి వేషాలు వేయవద్దని వారిని హెచ్చరించిందట. మామూలు సినిమా నిర్మాతలేగాక, ప్రభుత్వ సినిమావారడిగినా జానా నై అని తెగేసిందట !

## మరో బాల భీముడు !

సౌత్ ఆఫ్రికా ట్రాన్స్‌కెయ్‌లో 1982 మే 24వ తేదీన వో బాల భీముడు పుట్టాడట. పుట్టినపుడితని బరువు పదిన్నర కిలోలట. అంతకుముందు 1961 లో టర్కీలో పుట్టిన బాల భీమేశ్వరుడు పదకొండు కిలోల బరువుతో రెండడుగుల మూడు డంగుళాల పొడవున పుట్టాడట.

## ఓడిపోతే సినిమారంగానికి !

అమెరికా ప్రసిడెంటు రోనాల్డ్ రీగన్ ఈ 1984 ఎన్నికలలో తిరిగి తాను ప్రసిడెంటుగా ఎన్నిక అవకపోతే ఎగిరిగంతేసి, మళ్ళీ సినిమాల్లోకే ప్రవేశించవచ్చునని విశ్వసనీయంగా వెల్లడైందట. ఆయన హాలీవుడ్ చిత్ర నిర్మాతలలో చాలా పెద్ద సంస్థలతో మంతనాలు జరుపుతున్నారట. ఆయనకు 72 ఏళ్ళు అట— వాటీఫ్ !



## వ్యక్తిగతం



స్వరాజ్‌పాల్ "బ్రిటన్‌లో ఉండే భారతీయుడు" ఆయన అక్కడ కొన్ని పరిశ్రమలు నడుపుతున్నారుట. ఈ మధ్య ప్రభుత్వంవారు "విదేశాలలో నివసించే భారతీయులు" ఇక్కడ కంపెనీలలో వాటాలు కొనవచ్చునని అన్నారు. స్వరాజ్‌పాల్ ఈ పనే చేస్తానంటున్నారు. దానితో ఢిల్లీ క్లాత్ మిల్స్, ఎస్కార్ట్స్ వగయిరా కంపెనీలని నిర్వహించేవారి గుండెలలో రైళ్ళు పరిగెత్తటం ప్రారంభించాయి. వీరు ఈ కంపెనీల యజమానులుగా చెలామణి అవుతున్నారు కాని వారికి వాటిలో 5 శాతం కన్నా ఎక్కువ వాటాలు లేవుట. అందుకనే వారి భయం. వారిని భయపెట్టాలనే కేంద్ర ప్రభుత్వంవారు ఈ పని చేస్తున్నారని ఎందరో అనుకుంటున్నారు ...



స్వెట్లానా సలిట్‌స్కాయా వయసు 34. ఈ సోవియెట్ అంతరిక్ష ప్రయాణికురాలు ఇంజనీరింగు చదువుకుంది. మాస్కోలోని విమాన సంస్థలో పయిలట్‌గా తరిఫీదు పొందింది. ఇప్పటికి ఈవిడ వేగం, ఎత్తు, విమానంలోనుంచి గాలి గుమ్మటంతో దూకటం మొదలయిన వాటిలో 20 ప్రపంచం రికార్డులని సృష్టించింది.

స్వెట్లానాకి 20 రకాల విమానాలని నడిపే లయిసెన్సులు ఉన్నాయి.

ఆమెకి బ్రిటన్ పత్రికలవారు "మిస్ సెన్‌సేషన్" అన్న బిరుదు ప్రసాదించారు. అంత సంచలనం సృష్టించగలదన్నమాట స్వెట్లానా.

మగవారికన్నా ఆడవారే అంతరిక్ష యానం బాగా చెయ్యగలరని ఆమె నమ్మకం. ప్రకృతి ఆడవారికి అటువంటి దేహ నిర్మాణం ఇచ్చిందంటుంది స్వెట్లానా సలిట్‌స్కాయా.

ఆమె భర్త విక్టర్ కూడా విమాన చోదకుడే. తనతోపాటు అన్ని ఇంటి పనులూ చేస్తాడు, స్త్రీ విముక్తి అన్నది సోషలిజంలో ఇమిడి ఉంది — అని స్వెట్లానా అంటుంది ...




# ఫాలాక్షుని డైరీ

## విధి బలీయం !

అమలాపురం ఎర్రగరువు అనే గ్రామంలో మల్లాడి వీరవెంకట సత్యనారాయణకు 1973లో వివాహమై, ఆనాటినుంచీ అత్తారింటిలోనే వుంటున్నాడట. ఈ వుండడంలో ఆతనికి, అతని మరదలు పల్లాలమ్మకు ప్రేమ చిగురించి, అది వీడని బంధమయిందట. ఇది అత్తమామలకు తెలిసి వారు దండించినా ఆగలేదట. ఇహ ఇది పనికాదని సత్యనారాయణ తన మరదల్ని తీసుకుని ఆ వూరొదిలి పారిపోడానికి బస్టాండుకి వచ్చేసరికాబస్సులో ఆమె మేనమామ రామారావు దిగి, వీరిని చూసి, ఆశ్చర్యపోయి, తేరుకుని, ఇంటికి పదండి మీ కథ చెప్తానని బయల్దేర దీశాడట. శత విధాల వారు బ్రతిమిలాడినా ప్రయోజనం లేకపోయేసరికి సత్యనారాయణ కత్తి తీసి, తన ప్రియురాలైన మరదలునో పోటు పొడిచి, తనోపోటు పొడుచుకుని, ఇద్దరూ వొకర్నొకరు కౌగిలించుకు పడిపోయారట. ఆమె అక్కడికక్కడే చనిపోయిందట. ఆయన ఆసుపత్రిలో కోలుకుంటున్నాడట—

## సీతాకోకచిలుక రెక్కల్లో అద్భుత శక్తి !

వెస్ట్ జర్మనీ వో అద్భుతమైన తలగడా (దిండు అనీ అనచ్చు)కనిపెట్టారట. ఈ తలగడా తల్కింద పెట్టుకు పడుకుంటే గుర్రు తగ్గుతుందట. అంతేగాక ఆతని వుచ్ఛ్వాస, నిశ్వాసలు సక్రమంగా వుంటాయట. అంతేగాక అతని ముఖంలోని వయస్సును సూచించే ముడతలు కూడా రావట. వచ్చినవి తగ్గుతాయట. లేని వారికి రావట. ఇంతకూ ఆ తలగడలో శీతాకోక చిలుకల రెక్కలు దూదికి బదులు వాడారట. ఈ రెక్కలకంత శక్తి కలవని డాక్టర్ వింక్లర్ అన్నారట—

## భర్తని నరికిన భార్య !

ఈరోడ్డుకు చెందిన 29 ఏళ్ల జయలక్ష్మి భర్త ధర్మరాజుకు తీసిపోని జూదగాడూ, దేవదాసుకు తీసిపోని తాగుబోతూ అయి ఆమెను అనునిత్యం వేపించుకుతినడమేగాక, చీటికి మాటికి చావతన్నేవాడట. ఈ నరకయాతన భరించలేక, మార్గాంతరం లేక కొడవలి తీసుకుని [ ఎబ్బే మీరనుకున్నట్టు ఆత్మహత్య కాదు] తన భర్త ఆండియప్పనును ఠప్పన నరికి చంపేసిందట.

## హత్యకి దారితీసిన అనుమానం !

తమిళనాడు రాశిపురానికి చెందిన పింమెట్టూరులో 37 ఏళ్ల కొంజుపయ్యనే అనే అతను క్షౌరశాల పెట్టుకున్నాడట. ఈ సెలూనులో పనిచేసే వారేదో పనిమీద ఇంటికి వచ్చేవారుట. వారితో ఖులాసాగా తన భార్య 25 ఏళ్ల అలమేలు మాట్లాడ్డం అతనికి నచ్చేది గాదట. అయినా ఆమె అలాగే అందరితో కలిసిమెలిసి వుండేదట. ఆమె ప్రవర్తన మీద, శీలం మీదా యితడి కనుమానం వచ్చి నిద్ర పోతూన్న అలమేలును క్షవుర కత్తితో పీక కోసి చంపి, అంతటితో కసి చల్లారక పక్కనున్న ఏణ్ణర్ధం పిల్లాడిని కూడా పీకకోసి చంపేశాడట.

## ఐదు ప్రాణం తీసిన నీటి తగవు!

ఓమలూరు అనే వూరు (తమిళనాడు)లో మాదయ్యన్ అనే వ్యవసాయదారుడికి, అదే వూరుకు చెందిన పొన్నుసామి అనే అతనికి బహుకాలంగా పొలాల నీటిపారుదల గూర్చిన విరోధం వుండేదట. పొన్నుసామి తన బలగంతో పొలంలో పని ఆరంభించాడట. దాన్ని మాదయ్యన్ భార్య 45 ఏళ్ళ భాగ్యం, ఆమె కొడుకు చిత్తన్ కలిసి ఎదిరించారట. దాంతో పొన్నుసామి బలగం భాగ్యాన్నీ, ఆమె కొడుకును కర్రలతో కొట్టారట. భాగ్యం ఆసుపత్రికి తీసుకువెళ్ళేదారిలో చనిపోయిందట. ★




(గత సంచిక తరువాయి)

ఎందుకూ పనికిరాడనుకున్న బిజ్జలుడు ఏకవీరను బుట్టలో పెట్టేడు. కొడుకు మీద విశ్వాసం పెరిగింది. అతడు కేవలం వెర్రి వెంగళప్ప అనుకోవటానికి వీలులేకుండా చేసేడు. అలాగని తెలివికలవాడనుకునేందుకూ వీలుకాదు. వెంకన్నదొర డోలాందోళిత మనస్కుడయ్యేడు.

ఇప్పుడీ సమాధానం బిజ్జలుడి అమాయకత్వానికి నిదర్శనమా? లేక అతడి మేధాసంపత్తికి నిదర్శనమా ? ఏకవీరాదేవి దర్శనానికి వెళ్ళుతున్నాడా. ఏ ఏకవీర ? ఆలయంలో ఉన్న ఏకవీరా? ఆశ్రమంలో ఉన్న ఏకవీరా ?నారాయణకు ఇందాకటినుండీ ఏమి చెప్తున్నాడు తను ? ఇప్పుడీ బిజ్జలుడు ఆలయంలోని ఏకవీరను దర్శించేందుకు వెళ్తున్నాడనీ, ఆ విషయం తెలిసి తాను మెదలకుండా ఊరుకున్నాడనీ తెలిస్తే నారాయణ ఏమనుకుంటాడు ? వెంకన్నదొరకు గొప్ప చిక్కే వొచ్చిపడింది. బిజ్జలుడు వెళ్లేది ఆలయంలో ఏకవీర దర్శనానికికాదనీ, ఆశ్రయంలో ఏకవీరను చూచేందుకు వెళ్తున్నాడనీ ఇప్పుడు నారాయణకు నిరూపించాలి. లేకపోతే పరువు మట్టికొట్టుకుపోతుంది.

"నాయనా బిజ్జలా ? ఆశ్రయంలో కృష్ణస్వామి యీ వేళప్పుడు పూజాదికాల్లో నిమగ్నమై ఉంటారు. ఏకవీర ఆయనకు సపర్యలుచేస్తూ వుంటుంది. నీవు ఆశ్రయానికి మధ్యాహ్నం వెళ్ళకూడదూ ?" అన్నాడు వెంకన్నదొర దారి మార్చేస్తూ. కాని బిజ్జలుడికి తండ్రి ఆలోచనలు గ్రహింపుకు రాలేదు.తాను చెప్పదలచుకున్నది సూటిగా చెప్పివేసేడు.

"నాన్నగారూ ! అవును. ఈ వేళప్పుడు ఏకవీర ఆశ్రమంలో పనుల్లో మునిగిపోయి వుంటుంది. కృష్ణస్వామికి పూజాద్రవ్యాలు సమకూర్చుతూనో, పుష్పాపచయం చేస్తూనో, పద్మనో, లక్ష్మినో లాలిస్తూనో ఉంటుంది. అందువల్ల నేను యీవేళప్పుడు వెళ్ళినా ఆమె నాతో పలుకదు. ఆ విషయం నాకు తెలుసు. అందుకనే ఆలయంలో ఏకవీరను చూచేందుకు వెళ్తున్నాను" అంటూ విషయాన్ని తేల్చివేసేడు. వెంకన్నదొరకు తల నేలకేసి బాదుకున్నట్లనిపించింది.

"తప్పునాయనా ! మనం అలా వెళ్ళకూడదు. మనం జైనులంకదా! విగ్రహారాధన చేయకూడదు" అన్నారు నీరుకారిపోతున్న స్వరంతో.

"ఏమో, మీరు ఎప్పుడూ యిలాగే చెప్తారు. అమ్మగారు ఉదయమే లేచి స్నానంచేసి ఏకవీర ఆలయానికి వెళ్ళిరాందే ఏమీ తినకూడదని చెప్తారు. నాకు కడుపులో ఎలుకలు పరుగెడుతున్నాయి." అంటూ తుర్రున పారిపోయేడు బిజ్జలుడు.

వెంకన్నదొరకు మతిపోయినంత పని అయింది. నారాయణ ఆయన అభిమానం దెబ్బ తింటుందన్న భయంతో ముఖంలో ఏ భావమూ చూపకుండా నిలిచిపోయేడు.

"శిల్ప నిర్మాణం రేపటినుండీ ప్రారంభం కానున్నది. హరిజనులు శిల్పులవద్ద సహాయ సహకారాలు అందిస్తూ వుండిపోవాలి. అందుకు కూలి దండిగానే ముడుతుంది. వెంటనే ఏర్పాట్లు జరగాలి" అంటూ వివరించేడు వెంకన్నదొర.

"అలాగే దొరా! మావారందరికీ చెప్తాను" అంటూ ముందుకు సాగిపోయేడు నారాయణ.

కొడుకుకు బుద్ధిచెప్పాలన్న సంకల్పంతో ఏకవీర ఆలయంకేసి నడవసాగేడు వెంకన్నదొర.

## 11

ఎవరో తరుముకొస్తున్నట్లుగా సూర్యుడు పైపైకి వొస్తున్నాడు. త్రిపురాంతక దేవుడు తెల్లవారుజామున లేచి ఎక్కడకో వెళ్లి వచ్చాడు. అప్పటికి పద్మగంధి సిద్ధంగా ఉన్నది.

బాగా వచ్చిన వెలుతుర్లో ఆమె ఆకృతిని గమనించి ఆశ్చర్యపోయాడు త్రిపురాంతకదేవుడు.

రాత్రి చీకటిలో ఆమె స్వరాన్ని, సంస్కారాన్ని ఊహించి ఆమె ఎవరో గొప్ప యింటి ఆడపడుచు అయి ఉండాలని ఊహించేడు కాని యిప్పుడు ఆమెను చూస్తుంటే అది యధార్థం కాదేమోనని అనిపిస్తోంది. సంస్కార రహితమై చిందరవందరగా పడి ఉన్న శిరోజాలూ, అస్తవ్యస్తంగా ఉన్న వస్త్రధారణ శరీరమంతా మలినమై జిడ్డోడుతూ ఉంది.

ఆమెతో ఎలా మాట్లాడాలో ఆలోచిస్తూ మాట్లాడటం మరచిపోయేడు,

"ఏమిటి పరదేశీ ఆలోచిస్తున్నావు"

"ఏమీ లేదు"

"నా ఆకారంలో ఉన్న వికారాల గురించి కదూ !"

"నిజం చెప్పాలంటే అంతే !"

"రాత్రి నా గొంతూ, మాట్లాడే తీరు చూచి ఇందుకు భిన్నంగా ఊహించి ఉంటావు. అవునా !"

"అవును. నిజమే !"

**జరిగిన కథ — 7 :** ఏకవీర కృష్ణస్వామి ఆశ్రమంలో పెరిగి పెద్దదవుతుంది. ఆమె స్వామిని ఆరాధిస్తుంటుంది. ఆమె శ్రీదేవుడిని ఒక చిన్న స్వామి రూపును చెక్కివ్వమని కోరుతుంది. మొగలిచర్లలో జైనాచార్యుని సభలు జరుగుతాయని తెలిసి కృష్ణస్వామి వ్యాకుల పడుతాడు. కృష్ణస్వామి తనకు లొంగి వచ్చేలా ఉండాలంటే ఏకవీరను తను కోడలుగా స్వీకరించేందుకు యిష్టం ఉన్నట్లుగా నటించాలనుకుంటాడు వెంకన్నదొర. ఏకవీర వెంకన్నదొర ఇంటికి వచ్చి ఆశ్రమానికి తిరిగి వెళుతూ ఏకవీరదేవి ఆలయంలో తను కృష్ణస్వామికి దొరికిన వృత్తాంతం అర్చకస్వామి ద్వారా తెలుసుకుంటుంది. ఆశ్రమానికి పద్మగంధి వస్తుంది, ఆమె విచారవదనం చూసి మంచి మాటలతో ఓదారుస్తుంది ఏకవీర. జైనాచార్యుడు గొప్ప పండితుడు, తాత్వికుడు. తను గతంలో పద్మగంధితో గడిపిన మధురక్షణాలు, ఆమెకు తనవల్ల ఒకవేళ శిశువు జన్మిస్తే ఆ శిశువును ఆమె పెంచకూడదు అని మాట తీసుకున్న వైనం జ్ఞప్తికి తెచ్చుకొని కలత చెందుతాడు. పద్మగంధి ఒక బిక్షకత్తె వేషంతో ఓరుగల్లులోని ఒక పాంథశాలకి చేరుతుంది. తను, పరదేశి కలసి గోపాల దేవునికి బుద్ధి చెప్పాలనుకుంటుంది. త్రిపురాంతకుడు గోపాలదేవునికి బాగ బుద్ధి చెపుతాడు. ఆహవమల్లు జైనస్వామి ఆదేశానుసారం జైన సభలు ప్రారంభించు ఏర్పాట్లు చేయడనికి మొగలిచెర్లలో విడిది చేస్తాడు. మొగలిచెర్లలో ఏ హరిజనుడు ఏకవీరదేవి ఆలయానికి వెళ్ళరాదని ఆజ్ఞ జారిచేస్తాడు వెంకన్నదొర.

నేను ఒక సామాన్య భిక్షుకి అని తెలిసేక ఇప్పుడు నిర్ఘాంత పోవాల్సిన అవుసరమేమిటి?''

''నీవు భిక్షుకివి అయినందుకు కాదు. ఒక భిక్షుకురాలికి జైన స్వామితో పని ఏమిటా అని ఊహిస్తున్నాను.''

''అది కూడ ఊహించలేకపోయేవా పరదేశీ''



''ఎలా ఊహించను, నాకేమీ తెలియందే!''

''విషయం ఊహించటానికి కావలసినంత వరకూ తెలుసు''

''అయోమయంగా మాట్లాడుతున్నావు. ఏమిటది ?''

''నేను భిక్షుకినని గ్రహించావుగా''

''గ్రహించాను''

''మరినేను వెళ్లేపని ఎందువల్ల గ్రహించలేకపోయావు''

''చెప్పకూడదూ !'' రవంత విసుగుతో అన్నాడు త్రిపురాంతకుడు. పద్మగంధి పకా పకా నవ్వుతోంది.

''మీ మగ వాళ్ళు ఆడ వాళ్ళు మంద బుద్ధులనీ, మేము ఎంతో తెలివికలవాళ్ళమని విర్రవీగుతారు. కాని నీవు యింత చిన్న విషయాన్ని గ్రహించలేకపోయావు'' అంటూ ఎత్తి పొడిచింది.

త్రిపురాంతకుడు ఆశ్చర్యపోయేడు. ఆమె అసాధ్యురాలని అర్థమయింది.

''పరదేశీ ! యీ భిక్షుకురాలు జైనస్వామిని చూడాలనుకుంటున్నది భిక్ష యాచించటానికే'' అన్నది నవ్వుతూ.

''ఏమిటే భిక్షకోసం జైనస్వామిని వెదికి పట్టుకోవాలా ?''

''చిత్రంగా ఉన్నది కదూ ! అయినా అది







నిజమే ! అయితే నేను జైనస్వామిని యాచించేది సామాన్యమయిన భిక్ష కాదు.''

''ఏమి యాచించాలనుకుంటున్నావు ?''

''ఆ విషయం తర్వాత చెప్తాను. ముందు మన ప్రయాణానికి ఏర్పాట్లు చూడాలి. యిదుగో ! యీ నూరు కార్షాపణాలు నీదగ్గిర ఉంచు. అవసరమైనచోట వ్యయపరుచు.'' అంటూ నూరు కార్షాపణాలు తీసి అతని దోసిట్లో పోసింది పద్మగంధి.

ఆమె సామాన్యమయిన భిక్షుకురాలు కాదని, వెనుకది ఏదో అగాధమయిన చరిత్ర అనీ, నడువబోయేదికూడ అద్భుతమయిన గాథ అనీ గ్రహించేడు త్రిపురాంతకుడు. ఆ కార్షాపణాలు నిరభ్యంతరంగా స్వీకరించి దాచేడు.

''నేను గ్రామాలకు వెళ్ళి చహారా తీసుకుని వస్తాను. ముందు మనం బయలుదేరటానికి ఏదో ఒక దిక్కును నిర్ణయించుకోవాలి కదా !'' అన్నాడు త్రిపురాంతక దేవుడు.

''అక్కరలేదు. ఇక్కడే తెలుస్తుంది.''

''ఎలా తెలుస్తుంది''

''గోపాలదేవుని ద్వారా''

''అతడు మనకిప్పుడు విరోధి అయ్యేడు కదా !''

''అతనితో విరోధం మనకు జన్మతః వొచ్చిందీకాదు, జన్మంతా ఉండేదీకాదు. గత రాత్రి వచ్చిన వైషమ్యం యీ రాత్రి మైత్రిగా మారకూడదని ఏముంది.''

''ఆడ బుర్రలకు అసాధ్యమేముంది.''

''మగవాడి తోడుంటేనే ఆడబుర్రలు అద్భుతంగా రాణిస్తాయి'' అంటూ పకా పకా నవ్వింది పద్మగంధి.

త్రిపురాంతకుడు ఆమె నవ్వులోని అందాలను కొలుస్తున్నాడు.

''ఈ పగలంతా నీవు మన ప్రయాణానికి కావలసిన సామగ్రిని సమకూర్చే పనిలో ఉండు. సాయంత్రానికి గోపాలదేవుని విషయం నేను సానుకూలం చేస్తాను'' అన్నది పద్మగంధి చిరునవ్వుతో. త్రిపురాంతకుడు తన పనిమీద వెళ్ళిపోయేడు.

## తిరుచరణాలు

పద్మగంధి పాంథశాలలో సోమరిగా ఆటలాడుతున్న ఒక బొట్టికాయను పిలిచి ''నీకు గోపాలదేవుడు తెలుసునా'' అన్నది. అతడు తెలుసునని తల ఊపేడు.

'నీవు వెంటనే వెళ్ళి యీ సాయంత్రం అతడు పాంథశాలకు రావలసిందిగా చెప్పు. వెళ్ళు.'' అన్నది పద్మగంధి.

ఆ బొట్టికాయి తాను నిలబడిన చోటు నుండి బొత్తిగా కదలలేదు.

''నీకేమి కావాలి?'' ప్రశ్నించింది ఆమె. అతడు ఆమెకేసి జాలిగా ఆశగా చూచేడు. వెన్నెముకను అంటుకుపోయివున్న అతని బక్క పేగులు ఆమెను జాలిగా చూచేయి.

ఆమె రొంటిన దోపుకున్న చిల్లర వెండి నాణెం ఒకటి తీసి అతని చేతిలో ఉంచింది.

ఆ బొట్టికాయి మహదానందంతో ఒక్క పరుగుతీసేడు. ఇక యీ రాత్రికి ప్రయాణం ప్రారంభమే అని ఊహించుతూ ఆమె భోజనం విశ్రాంతి వగైరాలు చూచుకోవటానికి లేచింది.

నగరంలో ఒక మారుమూల ఒక నిరుపేద గృహస్థు యింటికి వెళ్ళి అన్నం అడిగి పెట్టించుకుని తిన్నది. అతడు ఊహించినంతకన్నా అధికంగానే మూల్యం చెల్లించి బైటపడింది.

పాంథశాలకు చేరి రవంత కునుకుతీసింది.

సంధ్యారాగం లోకానిలత్తుక వర్ణాలను హత్తేవరకు ఆమె లేవలేదు. త్రిపురాంతకదేవుడు ఇంకా రాలేదు. యీలోగా శ్రీ గోపాలదేవుడు వొస్తే యిబ్బంది అవుతుంది. అయినా త్రిపురాంతకుడు సమయానికి రాకపోడు. అతడు ఎంతో ముఖ్యమయిన రహస్య వార్తలను సేకరించగలిగిన చారుడు. ఎక్కడకు ఏ వేళకు చేరుకోవాలో ఎలా మరచిపోతాడు? అని ధైర్యం చెప్పుకుంది.

గోపాలదేవుడు కల్లుతాగి తూలిపోతూ నడుస్తున్నాడు. పాంథశాల లోపలకు అతడిని రానిస్తే పథకం తారుమారు అవుతుందని ఊహించి ఆమె అతనికి ఎదురువెళ్ళింది. తనే ముందుగా వెళ్ళి ఎత్తయిన అరుగులమీద చతికిలపడింది. తాగినటిమ్మిరిలో శకారుడల్లే వాచాలుడై మాట్లాడుతూ వస్తున్నాడు గోపాలదేవుడు.

''దమయంతి కీచకుణ్ణి దేవాలయానికి రమ్మన్నట్లు యీపిల్ల నన్ను పాంథశాలకు రమ్మంది. భలే. భలే'' అంటూ తూలుతూ గొణుక్కుంటున్నాడు గోపాలదేవుడు.

''గోపాలదేవా ! కీచకుణ్ణి పిలిచింది దమయంతి కాదు. ద్రౌపది. ఇక్కడున్నాను యీ అరుగులమీద...'' అంటూ కవ్వించింది పద్మగంధి. మొదలే తాగిన మైకంలో కళ్ళు మూసుకుపోతుంటే చూపు ఆనక నానా అవస్థ పడుతున్న గోపాలదేవుడు చేతులతో తడుముతూ వొచ్చి ఆమె ప్రక్కన అరుగుమీద కూలబడ్డాడు.

''నన్ను పిలిచేవు. సంతోషం'' అన్నాడు గోపాలదేవుడు.

''పిలిచింది నేను. సంతోషపెట్టవలసింది నీవు'' ద్వంద్వార్థంలో అన్నది ఆమె.

అయితే గోపాలదేవుడు యీ అర్థాలను పట్టించుకునే స్థితిలో లేడు. అజ్ఞానం వల్ల కలిగిన ఆనందంలో తలమునకలవుతున్నాడు:

''గోపాలదేవా ! గత రాత్రి జరిగిన అనర్థానికి నేను చాలా బాధపడిపోయాను తెలుసా ?'' అన్నది పద్మగంధి.

''మా భటులు ఒట్టి శుంఠలు. లేకపోతే అతడిని పట్టి బంధించి జైన స్వామి పేరు తలచి బలి యిచ్చేవాడిని'' అన్నాడు గోపాలదేవుడు.

''అవును. అవును. నేనూ గ్రహించాను. నీవు ఎంతో వీరోచితంగా పోరాడావు.చూస్తుంటే ఎంత ఆనందం కలిగిందనుకున్నావు. నీవు బాలచంద్రుడల్లే పదహారు కళలు ఒలకపోస్తున్న అభిమన్య కుమారుడిని తలపింపచేశావు.'' అన్నది పద్మగంధి. ఆ ఉపమానంలోని అస్తవ్యస్తత, అర్థాంతరమూ అతని తలకు ఎక్కలేదు.

పైగా తన తెలివి తక్కువ తనాన్ని తానే నిరూపించుకుంటూ ''అవును, ఇన్నాళ్ళకు నా పరాక్రమాన్ని గుర్తించ గలిగిన ఒకే ఒక వ్యక్తిని నిన్ను చూచాను. నాకు చాలాసంతోషంగావున్నది'' అన్నాడు. పద్మగంధి ఉలికి వచ్చే నవ్వును ఆపుకుంది.

''అయితే యింత వరకు నీవు వీరుడవన్న

విషయం ఎవరూ గ్రహించనే లేదన్నమాట ?'' అని ఆశ్చర్యపోతున్నట్లుగా అడగింది.

అవునని తలూగించాడు గోపాలదేవుడు.

''ఇంతకూ వాడెవడూ?'' అన్నాడు కాసేపు ఆగి;

''ఏమో ! నాకేమి తెలుసు ?''

''పిడి దుంపతెగ. ఆ ఖడ్గ ప్రహారాలు చూస్తుంటే ఆరితేరిన గడుసు పిండమల్లే ఉన్నాడు. పదిమందిని ఎదిరించి పిండిపిండిచేశాడు. పోనీలే మరొకసారి దొరికితే జైనస్వామికి బలి యిస్తాను'' అని కోతలు కోయటం ప్రారంభించాడు.

''జైనస్వామి అంటే అంత భక్తా నీకు ?'' యాదాలాపంగా అడుగుతున్నట్లుగా అన్నది పద్మగంధి.

''ఆయన మా గురువు. ఆంధ్ర మహాసామ్రాజ్యాన్ని మూడు వందల ఏండ్ల నుండి పిల్లి పిప్పి చేస్తున్న యీ కాకతీయ ప్రభువులు ఆయన వల్లనే కుప్పకూలి పోతారు. అంతటి అఖండ మేధా సంపత్తి నీ వంటి దేశ సంచారులకేమి తెలుస్తుందిలే.''

''అంతటి అఖండ మేధావిని గురువుగా పొందిన నీవు చాల భాగ్యశాలివి. ఎప్పుడైనా ఆయనను చూచావా ?''

''లేదు. చూడకపోతేమటుకు ఏమిటి ? మా జైన సమావేశాల్లో చెప్పుకుంటూ ఉండగా విన్నాను.'' అన్నాడు గోపాలదేవుడు. పద్మగంధి అతనిమాటలు జాగ్రత్తగా వింటూ అన్నది.

''ఒకసారి ఆయననుచూచేందుకు ప్రయత్నం చేయకపోయావా ?''

''అదెలా సాధ్యం...? ఆయన ఎక్కడో కొండగుహల్లోనూ, అడవుల్లోనూ రహస్య జీవనం గడుపుతూ వుంటారు?''

''అంతటి ధీరువా మీ గురువు?'' గురువు మీద పద్మగంధి యింత అభాండం వేయగానే గోపాలదేవుడికి పౌరుషం పొడుచుకు వొచ్చింది. ఆవేశపడిపోయేడు.

''ఎవరు ధీరువులో త్వరలోనే తెలుస్తుంది. రుద్రాంబ తలతెగి ఎగిరి ఆయన కాళ్ళమీద పడే రోజు తరుముకొస్తోంది. తొందర ఎందుకు ? అయినా యింక ఆ విషయాన్ని వదిలివెయ్యి'' అంటూ మరికొంచెం దగ్గరగా జరిగేడు.

పద్మగంధి దూరంగా జరిగి కూర్చుంటూ ''అంత ఆవేశపడతావెందుకు? యిప్పుడు నీమీద పదిమంది ఒక్కసారి యుద్ధానికి తలపడతారనుకో ఏమి చేస్తావు. అలాగే ఎవరైనా జైనస్వామి జాడలు కూపీతీసి దాడిచేస్తే ఎలాగని అడిగానంతే'' అన్నది.

గోపాలదేవుడు ఆ అమాయకపు సందేహం విని పెద్దగా నవ్వాడు.

''పిచ్చిదానా ! ఆయన చుట్టూ ఎంత సైన్యం కాపుంటుందనుకున్నావు. అయినా ఆయన ఉనికి కనిపెట్టడం ఎవ్వరితరమౌతుంది ఆ అరణ్యాలలోకి పోయిన వారు బ్రతికిబయటకు రారు.''

''ఒకవేళ నీకిప్పుడు జైనస్వామిని చూడాలని పిస్తుందనుకో ! ఏమి చేస్తావు'' చిన్న పిల్లలా అమాయకంగా అడిగింది.

''వెంటనే పాలంపేట వెళ్ళి రామప్పగుడి పరసర ప్రాంతాలలో తిరిగే సన్యాసులకు నా కథ వినిపిస్తాను. వారే నాకు దారి చూపుతారు. అయినా అడుక్కుతినే నీకు యీ ఆరాలన్నీ ఎందుకు? నా అవుసరం గడిపేవంటే నాలుగు కార్షాపణాలు పారేస్తాను.''

''ఏమిటో నీ అవుసరం ?''

''ఏమిటి అనుకుని పిలిపించేవు. పెద్ద నంగనాచివి...''

''నాలుగు కార్షాపణాలు నాకొక లెక్కకాదు. యిదిగో యీ పది కార్షాపణాలు తీసుకుని నీ దారిన నీవు పో.''

''ఆఁ. ఇంత ధనం నీ కెక్కడిది. నీవు నిజంగా భిక్షుకివేనా? చారిణివా ? అనుమానంగానే ఉంది. ముందు నిన్నే జైనస్వామికి బలియిస్తాను'' అంటూ ఒరనుండి సర్రున కత్తిలాగేడు.

''ప్రియతమా ! నామీద అంత కోపం ఎందుకు?'' అంటూ ప్రేమ వర్షిస్తూ మాట్లాడింది పద్మగంధి. కత్తి మళ్ళీ ఒరలోకి పోయింది.

---

''ఇకమీదట అనవసరమైన విషయాలు కదిలించకు'' అంటూ నీరుకారిపోయేడు గోపాలదేవుడు. అతనికి స్త్రీ బలహీనతలున్నాయి. ఆ బలహీనతకు అశక్తులు ఎందరో బలి అయ్యారు. కాని ఆ బలహీనతే అతడిని పద్మగంధి మాటలకు ఆటబొమ్మగా బందీగా చేసింది.

త్రిపురాంతక దేవుడు ఎంతకూ రాలేదు. గోపాలదేవుడి తొందరపాటువల్ల కీడును శంకిస్తోంది పద్మగంధి. ఆతడిలోని బలహీనతను రెచ్చగొట్టి కార్యం సానుకూలం చేసుకోగలిగింది కాని ఇప్పుడది విషమించే పరిస్థితులు ఏర్పడ్డాయి. ఆమె జన్మతః వేశ్య.

కాని గోపాలదేవునికి లొంగిపోవటం ఆమెకు ఆత్మహత్యా సదృశమైన విషయమనిపించింది.

గోపాలదేవుడు చొరవచేస్తున్నాడు. ఆమెను స్పృశించాలనే ప్రయత్నంలో పడిపోయేడు.

పద్మగంధి తనచోటునుండి లేచి వీధిలోకి వచ్చింది. గోపాలదేవుడు విడిచిపెట్టలేదు. వెంట తరుమసాగేడు.

''నీవు నానుండి రహస్యాలు రాబట్టటానికి వొచ్చిన గూఢచారిణివి. నిన్ను ఎవరు పంపేరో చెప్పు. లేకపోతే నీ ప్రాణం నా కత్తిని బలి అవుతుంది ' అంటూ అరువసాగేడు.

తాను పరుగెడుతూ ఆమె చేరువలోకి రాగానే ఒరనుండి కత్తిలాగి ఆమె మెడ చూచి గురిగా విసిరేడు. కత్తి ఆమె మెడకు తగలలేదు కాని ప్రక్కనుండి దూసుకువెళ్ళి నేలలో దిగబడింది. దూరంనుండే యీ జరుగుతున్న విషయాన్ని గమనిస్తున్న త్రిపురాంతక దేవుడు వడివడిగా అక్కడకు చేరేడు.

పద్మగంధి సంతోషంతో ఊపిరి పీల్చుకుంది. త్రిపురాంతకదేవుడు రావటం రవంత ఆలస్యం జరిగిపోతే తన ప్రాణాలు పోవటమే నిశ్చయమని తలపోసిందామె.

''ఎవడురా నువ్వు. చెప్పు. ఆమెకూ నీకూ సంబంధమేమిటి. మీరు యిద్దరూ చారులే. సందేహంలేదు. యీ రోజుతో మీకు భూమిమీద నూకలు చెల్లిపోయాయి. ఇదిగో. నేను వెళ్ళి మా మొత్తం పటాలాన్ని వెంటపెట్టుకు తీసుకు వస్తాను. యీ భూమండలంమీద మీరు ఎక్కడ దాక్కున్నా పట్టి వధిస్తాం.'' అంటూ గోపాలదేవుడు ముందుకుసాగేడు.

అతడు వెళ్ళిపోతే అతడు అన్నంతపనీ జరగపోయినా తమ ప్రయాణం విషయం పదుగురుకీ తెలిసిపోతుంది. అది జరిగితే ఆపై గొడవలు చాలానే ఉన్నాయి. కనుక దానిని ఆపటం తప్పనిసరి. అంటే యీ గోపాలదేవుని పని పట్టించాలి. అమాయకుడుకనుకా, సాటి మేటి వీరుడుకాదు కనుకా అతడిని చంపకూడదు.

త్రిపురాంతకదేవుడు విసురుగా వెళ్ళి గోపాలదేవుని రెక్కపట్టుకుని ఆపివేసేడు.

# తిరుచరణాలు

''నన్నొదులు. మీకు శనిరోజులు దాపురించాయి'' అంటూ ముందుకు పోబోయేడు గోపాలదేవుడు. త్రిపురాంతకుడు విసురుగా అతడి మెడమీద ఒక్కటివేసేడు. మెడ తెగిన కోడిపుంజులా వ్రేలాడబడిపోయేడు గోపాలదేవుడు.

''ఇతడి ప్రాణానికి ఎటువంటి హానీ లేదు కాని తెల్లవారేవరకూ ఇక వొళ్ళు తెలియదు. ఈలోగా మనం దాటిపోవాలి'' అంటూ ముందుకు సాగేడు త్రిపురాంతకుడు. పద్మగంధి అతడిని అనుసరించిపోతోంది. వారిద్దరూ చీకటిలో మాయమయ్యారు.

పాలంపేట చెర్వు ఓరుగల్లుకు యిరవై క్రోసుల దూరం. అంత దూరాన్ని ఒక్క రాత్రిలో నడిచిపోవటం అసాధ్యమనిపించింది త్రిపురాంతకునికి. అందుకనే నగరం వెలుపల రెండు అశ్వాలను సిద్ధంచేసి వుంచాడు.

చెరొక అశ్వాన్ని అధిరోహించి రామప్ప గుడి దిశగా పయనమయ్యారు వారు. తెల్లవారే సరికి చెరువుదాపుల్లోకి వెళ్ళారు. త్రిపురాంతకుడు రెండు పెద్ద తాళ్ళతో ఒక కొస చెట్టుకొమ్మలకూ, మరొక కొస గుర్రపు జీనుకూ ముడి వేసేడు. రెండు మూడు రోజులైనా గుర్రాలు చుట్టూ ఒత్తుగా పెరిగి ఉన్న శాద్వలాలను మేస్తూ గడిపివెయ్యవచ్చు.

వారిద్దరూ కాలిబాటన నడవసాగేరు. కొంత దూరం పోయి రామప్ప గుడి దాపులకు చేరేక వారికొక సన్యాసి ఎదురయ్యేడు. అతడిని చూస్తూనే ఉన్మాదినిలా ఉన్న తన వేషానికితోడు జుట్టు విరపోసుకుని మరింత భయంగొల్పేలా చేస్తూ తయారయింది పద్మగంధి.

''ఎవరు మీరు ?'' ఎంతో సౌమ్యంగా సర్వసంగ పరిత్యాగివలె ప్రశ్నించేడు సన్యాసి.

''తమరు సన్యాసులు. త్రికాలవేదులు. తమకు తెలియనిది ఏముంది. ఈమె నా చెల్లెలు. పెళ్ళి కెదిగిన కూతురు తనది అని చెప్పుకుందుకు వీలులేకుండాపోయింది. ఆ బాధతో ఇది ఉన్మాదినిగా మారింది. రామప్ప గుడి చేరువలో వున్న ఆంజనేయస్వామికి ప్రదక్షిణలు చేస్తే తగ్గిపోతుందని మీలాగే త్రికాలవేత్త అయిన ఒక సాధువు శలవిచ్చాడు. ఎంతో ఆశతో తీసుకొచ్చాను'' అంటూ దీనంగా ఒక కథ చెప్పేడు త్రిపురాంతకుడు.

''అయ్యో అలాగా ! నాయనా ! నిజమే ! కాని రామప్ప గుడి దాటి అవతలకు వెళ్ళితే భయంకరమైన మృగాలు తిరుగుతూ వుంటాయి. నాయనా ! ఆ ప్రయత్నం మానుకో. యిదిగో యీ విభూతి తినిపించు. తగ్గిపోతుంది'' అంటూ పిడికెడు విభూది పెట్టబోయేడు సన్యాసి.

త్రిపురాంతకుడు ఆ సన్యాసికి వొంగి వొంగి దండాలు పెడుతూనే విభూతిని తిరస్కరించేడు.

''యిలాంటివి చాల అయిపోయేయి స్వామీ ప్రదక్షిణలు తప్ప మరొక పరిష్కారం లేదని తేలిపోయింది'' అంటూ కన్నీరు నటించేడు.

సన్యాసి ఇహ అంతకన్న బలవంతంగా వాదించలేకపోయేడు.

''అయితే నాతో రండి. దారిజూపుతాను'' అంటూ ముందు నడవసాగేడు. వెనుక త్రిపురాంతకుడూ, పద్మగంధి.

''స్వామీ ! మీ కెందుకు లేనిపోని శ్రమ. మాకు దారి చూపుతే చాలు. ఎలాగో వెళ్ళిపోతాం. మీరు సన్యాసులు. ఆ క్ర్రూరమృగాల మీద మేమయితే ఎదురు నిలిచి ఎలాగో పోరాడతాము. మీరు అహింసావాదులు. ఆపని మీవల్ల కాదేమో'' అంటూ వాపోయేడు గోపాలదేవుడు.

''నా గురించి నీవు బెంగ పెట్టుకోవద్దు నాయనా ! యిటువంటి చోట్లు తిరగటం నాకు అలవాటే, కాని మీ గురించే నేను బాధపడుతున్నాను. అందునా ఒంటరి వాడవు కావు. ప్రక్కన ఆడకూతురుకూడ ఉంది.''అంటున్నాడు సన్యాసి.

అతడి మాటలు నమ్మదగిన వ్యక్తులకు ఒక అర్థంలోనూ, నమ్మదగని వ్యక్తులకు ఒక అర్థంలోనూ, వినిపించేలా ఉన్నాయని గ్రహించేడు త్రిపురాంతకుడు.

అంటే అతడు జైనుల చారుడని అర్థమయింది.

''స్వామీ ! యీ పరిసరాలలో ఎక్కడా నరసంచారం ఉన్నట్లుగా లేదు'' అంటూ తన సందేహాన్ని వెలిబుచ్చాడు త్రిపురాంతకుడు. వాస్తవానికి అతడు ఆ మాట అడగవలసిన అవసరం లేదు. అక్కడ నరసంచారం లేదనీ, అది క్ర్రూరమృగాలకు ఆలవాలమనీ ఇంతకు మునుపే సాధువు హెచ్చరించాడు.

''అవును నాయనా ! ఇక్కడ క్ర్రూరమృగాల బెడద ఎక్కువ. అందువల్ల ఎవరూ యీ చాయలకు రారు.''

''పాలంపేట చెరువు పక్కన ఒక పల్లె ఉన్నదని విన్నాను — ?''

త్రిపురాంతక దేవుడు కూపీలాగటం ప్రారంభించేడు.

''ఆ గ్రామం ఇప్పుడు నిర్జనావాసమైంది నాయనా !''

''ఎందువల్లనో...?'' త్రిపురాంతకుడు విషయాల లోతుల్లోకి రావడం మొదలెట్టగానే సన్యాసికి అనుమానం వేసింది.

''మీరు ఎక్కడ నుండి వొచ్చారు'' అని అడిగేడు.

''మాది ఓరుగల్లు స్వామీ !''

''హనుమకొండలోని వేయిస్తంభాల మండపంప్రక్కన ఒక చిన్న ఆంజనేయస్వామి ఆలయం ఉన్నదని విన్నాను.''

''అవునుస్వామీ ఉన్నది. కాని, ఇక్కడకే రావలసివొచ్చింది.''

# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."




ప్రత్యేకమైన ఔషధ యుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మజీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

Glaxo nycil PRICKLY HEAT POWDER

## నైసిల్ తెచ్చుకోండి
## చెమటకాయల బాధ మరిచిపోండి.

ASGLN-4-203 TEL

## తిరుచరణాలు

"సరే రండి" అంటూ ఇక ఎటువంటి సంభాషణకూ తావులేదన్నట్లు ముందుకు సాగాడు సన్యాసి.

కొంతసేపు నడిచేక రామప్ప గుడిముందుకు వొచ్చేరు. అప్పటికి చేయిపొడవున పొద్దుసాగింది.

రామప్ప ఆలయమంటపంలో ఎవరో ఒక రుషితుల్యుడైన కనుపించే వ్యక్తి కూర్చుని వున్నాడు. మహావర్చస్వి. తెల్లని గడ్డమూ, కరిగిన బంగారంవంటి మేని చాయా అద్భుతంగా ఉన్నాడు. మెడలో యజ్ఞోపవీతంలేదు. అది పరిత్యక్తమయిందికాబోలు.

వారిద్దరినీ ఆయనకు కనిపించేలా దూరంగా నిలువరించి ఆ సన్యాసి ఆయ్యనవద్దకు వెళ్లేడు.

"స్వామీ ఎవరో అగంతకులు."

"పరీక్షించేవా ?" ప్రశ్నించేడు స్వామి. ఆయన కంఠం శ్రావణమేఘాలు ఉరిమినట్లుగా ఉంది.

"ఉన్మాదిని అట. ఆంజనేయస్వామి బొమ్మకు చుట్టు తిరుగుళ్ళు చేయాలని వొచ్చారట" అన్నాడు యీసడింపుగా.

"మరి వారిని ఏమిచెయ్యాలని నిర్ణయించావు ?" ప్రశ్నించేరు స్వామి.

"స్వామీ! నా నిర్ణయం ప్రకారమైతే యీ పొలిమేరలో కాలుమోపగానే వారిద్దరినీ నరికి అనుమానం అలా తీర్చుకునేవాడిని. కాని నిర్దోషులను వధించరాదని కదా మీ శాసనం. శాసనానికి తలవొంచి మీ ముందు నిలపాలని తీసుకొచ్చేను. వారిని ఏమిచేయదలచినా అది మీ యిష్టం" అన్నాడు సన్యాసివేషధారి.

"అలాగా! సంతోషమైన పనే చేశావు. వారిని మా ముందుకు పంపు" అంటూ ఆలోచనలో మునిగేడు జైనస్వామి.

స్వామి ముందుకు ఏ క్రొత్త వ్యక్తిని పంపాలన్నా అక్కడ ఒక ఆచారముంది. ఆ వ్యక్తిని బాగా పరీక్షించికాని స్వామి ముందుకు పంపరు. ఆ వెళ్లే వ్యక్తివద్ద ఎటువంటి ఆయుధాలూ ఉండకూడదు. అదీ ఆచారం.

సన్యాసి వారిదగ్గరగా వొచ్చి పరీక్షించేడు.

"ఆయుధాలతో వొచ్చేవా ?" అన్నాడు సన్యాసి నేత్రాలు విశాలం చేసి త్రిపురాంతకుని కన్నులలోకి చూస్తూ.

"అవునుస్వామీ! ఇటువంటిచోట ఆత్మరక్షణకు అవుసరమే కదా!" అన్నాడు త్రిపురాంతకుడు. సన్యాసికి వొళ్ళు మండిపోయింది. అయినా స్వామి ఆజ్ఞ అయినతరువాత చేయగలగింది ఏమీ లేదు. ఆ ఆయుధాలన్నీ తీసుకుని వొట్టిచేతులతో వారిద్దరినీ స్వామి చెంతకు నడిపించేడు.

ఆయన మూర్తిని చూస్తూనే కన్నీటితో చెంపలు తడిసిపోతుండగా వొంగి ఆయన పాదాలను అభిషేకించింది పద్మగంధి. ఆమె రెండుకాళ్ళూ

స్పృశించగానే, ముఖం ఆ పాదాలమీద పెట్టగానే స్వామిలో విద్యుత్తు ప్రవహించినట్లు అయింది.

"అమ్మా లే! కన్నీరు తుడుచుకో" ఆయన కంఠం కూడ గద్గదమయింది. పద్మగంధి లేచి ఆయన ముఖంలోకి చూచింది.

"ఎక్కడనుండి వొచ్చేవు?" స్వామిఅడిగేరు.

"ఎక్కడ నుండి అయితేనేమి రావలసిన చోటుకే వొచ్చాను."

"ఇది నీకు రావలసిన చోటు ఎలా అయింది?"

"నా సర్వస్వమూ యిక్కడే వున్నది కనుక..."

"నీ సర్వస్వమూ యిక్కడే ఉన్నదా? ఏమిటది ?

"నాకు మాతృత్వాన్ని ప్రసాదించిన దైవం"

"ఎవరా దైవం ?" అనుమానిస్తూనే ప్రశ్నించేరు స్వామి.

ఆమె మళ్ళీ వొంగి ఆయన పాదాలను పెనవేసుకుపోయింది. స్వామికి సంగతి అర్థమయింది.

"పద్మగంధీ !" యుగ యుగాల విరాళి ధ్వనించేలా పిలిచేరాయన.

"గుర్తించేరా ! ధన్యురాలిని."

"నేను దుష్యంతుడను కానులే ! ఇన్నేళ్ళ తరువాత ఎందుకిలావొచ్చావు. ఏమికావాలి నీకు."

"నేను కోరి పుచ్చుకునేందుకు రాలేదు. యివ్వాలనే వొచ్చాను."

"ఏమిటో ఆ యివ్వవలసింది,"

"మీరు తండ్రి అయ్యేరన్న విషయం మీకు చెప్పాలని."

"ఇన్నేళ్ళ తరువాత ఈ వార్త నాలో ఎటువంటి చలనమూ కలిగించలేదని ఊహించలేక పోయేవు. నేను మతానికీ, రాజకీయాలకూ నా సర్వస్వాన్ని అంకితం చేశాను. సరే! ఇంతకూ ఎక్కడ ఉన్నది మన బిడ్డ ?"

"మొగిలివర్ణలో ! కృష్ణస్వామి పెంపకంలో" ఆయన నెత్తిన యీ వార్త పిడుగులు కురిపించినట్లయింది.

"స్వామీ ! ఆనాటి మీ ఆమని స్పర్శతో యీ మోడు జీవితానికంతా ఒకేసారి చిగురించింది. ఆ స్పర్శవల్లనే మోడు మొగ్గతొడిగింది. ఆ మొగ్గ పూవు అయింది. ఏ పూజకు దానిని నిర్దేశించాలో అది మీరు నిర్ణయించాలి" అన్నది పద్మగంధి.

ఆమె ఆలోచనలోని స్వార్థమనే పేరుతో మలినమైన మాతృత్వమనే పవిత్ర అర్థాన్ని గ్రహించగలిగేరాయన. కన్నులు రవ్వంత చెమ్మగిల్లాయి.

కృష్ణస్వామిమీద ఎదురుదెబ్బకు కూడా ఇదొక అస్త్రమని భావించి ఎంతో సంతోషంతో పొంగిపోయేడు.

"పిచ్చిదానా ! యీవార్త చెప్పేందుకు నీవు యింత కష్టపడి రావాలా ?" అంటూ ఆప్యాయంగా ఆమె బుజాలు పట్టుకుని లేవదీసేరు.,

త్రిపురాంతకుడు నిర్ఘాంతపోయి ఊహించని యీ సంభాషణ వింటూ సంతోషంతో పొంగిపోయేడు.

## 12

శ్రీదేవుని మానసిక స్థితి చూస్తే నిశ్చల తటాకంలోకి చిన్నరాయి విసిరినట్లుగా ఉంది. కణ్వునివలె సర్వసంగ పరిత్యాగి అయిన కృష్ణస్వామి ఏకవీరను పెంచి పెద్దచేశాక సామాన్య కుటుంబీకునివలె ఆలోచించక తప్పలేదు.

ఆయన శ్రీదేవునికి ఏకవీర నిచ్చి వివాహం చేస్తే బాగుంటుందని సంకల్పించారు. కాని ఏకవీర మానసిక స్థితి మరోకలా తయారయిరది. తన పూజకు పూజాద్రవ్యాదికాలు అమర్చటం అయ్యేక మిగిలిన సమయంలో కొంత పద్మ, లక్ష్మిలను ఆడిస్తూ లాలిస్తూ గడిపేస్తుంది. మిగిలిన సమయమంతా ఏకాంతంలో గడపటం ఆమెకు అలవాటయింది.

అందరి దృష్టిలో అది ఏకాంతమయినా ఆమెకుతోడు ఏడుకొండలవాడున్నాడు. ఆయన మూర్తిని మనసులో సంకల్పం చేయగానే ఆ స్వామి ఆమె ముందుకే వచ్చినట్లు అయ్యేది. ఏకవీర ఆ స్వామితో మాట్లాడేది. ఎప్పడైనా రావటం రవ్వంత ఆలస్యమయితే పోట్లాడేది. ఆడేది. పాడేది. ఆయనతో చేయి కలిపి దూర దూర తీరాలకు వెళ్ళి విహరించేది.

అదంతా ఆమె ఊహాలోకం. కాని ఆమెకు అలా అనిపించదు. నిజంగానే జరుగుతున్నట్లు అనుకునేది. ఆ రసానందాన్ని అనుభవించేది. సంతోషమూ, దుఃఖమూ, నవ్వూ, ఏడుపూ అన్నీ ప్రదర్శించేది.

ఎవరైనా ఆ రసానందానికి ఆనకట్టవేస్తూ ఆమెను పలకరించపోతే వారిమీద చిరాకుపడేది. ఆ స్వామే తన సర్వస్వమూ అయినట్టు అనుభవానికి తెచ్చుకునేది.

శ్రీదేవుడు కృష్ణస్వామి సూచనమీద ఆమెను గురించి ఆలోచించటం ప్రారంభించేడు. అది తొలి దశ. కాని యిప్పుడు ?... ఆ దశ దాటిపోయింది. ఆమె ఆకృతి అతనికి మరపుకు రాదు. ఆమెను గురంచి ఆలోచించకుండా అరనిముషం బ్రతుకలేదు.

జీవితం ఎంత అగాధమయినది ? బ్రతుకు విలువలు ఎంత అగమ్యమయినవి ? ఏకవీరను మనసులో ధ్యానించి ఆమె సన్నిధికోసం శ్రీదేవుడు తహతహలాడుతున్నాడు. తన స్వామి కోసం, ఆ స్వామికి తన సర్వస్వమూ సమర్పించుకోవటం కోసం ఏకవీర మనసు ప్రతి క్షణమూ ఆర్తితో ఉండేది.

ఆమె మనసులో ఆర్ద్రత పెరిగింది. తన మనసులోని ఆలోచనలకే తాను కరిగిపోవటం ఆమెకు అలవాటయింది.

(ఇంకా వుంది)






# వారఫలం

**17-6-1983 శుక్రవారం మొదలు 23-6-1983 గురువారం వరకు**

♈ **మేషం :** వ్యాపార సంబంధంగా మేలు జరిగే వారం. ఒకానొక వ్యవహారంలో పరిష్కార మార్గం సమకూడుతుంది. ఉద్యోగంలో ప్రగతికి అవకాశం చేకూరుతుంది. స్త్రీలకు : కళా సాహిత్య రంగాలలో పేరు ప్రతిష్ఠలు అభివృద్ధి నంద గలవు. గ్రహించాలి.

♉ **వృషభం:** ఎవరితోనూ వివాదాలకు పోకూడని కాలం. సంఘ గౌరవం కొరకో, గ్రామంలో గౌరవం సంపాదించుటకో ప్రాకులాడుట అనవసరం. కాలం అనుకూలం గాదని గ్రహించుట న్యాయం. స్త్రీలకు: శుక్ర శనివారాలందు ప్రయాణాలు చెప్ప వీలున్నది. విందులు వినోదాలుంటాయి.

♊ **మిథునం:** వ్యాపార ఉద్యోగాలలో అభివృద్ధి కనిపించే సమయం. శుభ కార్యాలోచనలకు అనువైన వారం. ఇళ్ళు అభివృద్ధి నందే మార్గమున్నది. ఆభరణాలు కొనుగోలు చేయనున్నారు. స్త్రీలకు: శుభకార్యానుకూలత, నూతన వస్త్ర ప్రాప్తికి అవకాశం గలవారం.

♋ **కర్కాటకం:** వృత్తి వ్యాపారాలలో అభివృద్ధి కనిపిస్తుంది. మీ ప్రజ్ఞ రాణించే వారం, అలాంటి సదవకాశాలు లభిస్తాయి. ఈవారం అధికం వ్యయం చేయ వలసిన అవసరాలుంటాయి. ముగమాటం పెట్టి మిమ్ముల మోసగించ గలవారుంటారు, జాగ్రత్త. స్త్రీలకు: వస్తు సేకరణకు, గృహోపకరణాలకు అవకాశమున్నది.

♌ **సింహం :** రాజకీయాలలో చాలమంది విజయం పొంద నున్నారు. పై విద్యార్జనకు ప్రయత్నించే వారికి మేలు సమకూడుతుంది. నూతన బాధ్యతలను నిర్విరామంగా నెరవేర్చవలసిన అగత్యమున్నది. స్త్రీలకు: మానవ ప్రయత్నాలు ఫలించి ప్రగతి పథం కనిపిస్తుంది.

♍ **కన్య:** డబ్బు యిబ్బంది బాగా కనిపిస్తుంది. అవసరాలు కూడాగడవక చాల యిబ్బంది పడుతారు. వృత్తిలో ఏదో విధంగా ఆటంకం ఏర్పడే అవకాశం ఉంటుంది. స్త్రీలకు: రచనా విధానంలో, నటనా విధానంలో గాన కళా ప్రదర్శనాన్ని గూర్చిన సదవకాశాలు లభిస్తాయి.

♎ **తుల :** కోపం అధికంకావటం, లేని పోని వ్యవహారాలందు జోక్యం కలిగించుకొనటం కొందరు గ్రహించ నున్నారు. చేతికి అంద వలసిన డబ్బు సమయానికి అందక పోవటం కూడా గమనించ నున్నారు. డబ్బును గూర్చిన వత్తిడి అధిక మవుతుంది. స్త్రీలకు: అప్రయత్న ధనలబ్ధి, రచనా విధానంలో మేలు కనిపించే వారం.

♏ **వృశ్చికం :** చాల కాలంగా కలిసి కోని వారు ఈవారం అనుకోకుండా మీ సమీపానికి రానున్నారు. అన్ని రంగాలలో మీరు చూపే శ్రద్ధను బట్టి ఫలితం అందుకో గలరు. స్త్రీలకు: హటాత్తుగా, అప్రయత్నంగా, న్యాయంగా చెంద వలసిన ఆస్తిని గూర్చిన ప్రశంస లుంటాయి.

♐ **ధనుస్సు :** సంఘంలో గౌరవ మర్యాదలు అధికం కాగలవు. అధికారుల వలన జరగ వలసిన పనులుంటే సుకరంగా నెరవేర గలవు. ఉద్యోగంలో ఆశించిన 'ప్రమోషన్' లభించే మార్గమున్నది. స్త్రీలకు: ఆస్తి హక్కును గూర్చిన తర్జనభర్జన లుంటాయి. దూర ప్రయాణం చేసే అనుకూలత కొందర విషయంలో రుజువు కాగలదు.

♑ **మకరం:** అన్ని విధాలా ఈవారం విజయవంతమే. కోర్టు కచేరీలలో కొందరకు అనుకూలత చేకూరే మార్గమున్నది. వృత్తిలో పెంపు సమకూరుతుంది. శత్రు వర్గీయులను ఒక కంట కనిపెట్టదగిన వారం. బంధువుల తాకిడి అధికం. స్త్రీలకు: ఆశించిన విధంగా వృత్తి వ్యాపారాలు సాగిపోతాయి. 'రోడ్డు' ప్రమాదం కొందర విషయంలో చెప్ప వీలున్నది.

♒ **కుంభం:** సంఘంలో గౌరవ ప్రతిష్ఠలకు లోపంలేదు. కొందరకు సత్కారాలు కూడా జరిగే అవకాశమున్నది. కొందరకు అదృష్ట వశాత్తు కించిత్తులో ప్రమాదం తప్పిపోతుంది. స్త్రీలకు: ఉద్యోగాభివృద్ధి, వ్యాపారంలో లాభించే మార్గాలు, రచనా విధానంలో మేలు చేకూరుతుంది.

♓ **మీనం:** యత్న కార్య సిద్ధి, యత్నించిన ఉద్యోగం సంప్రాప్తం. కుటుంబానందం, స్త్రీ మూలకంగా ఆనందం చేకూరుతుంది. ఒకానొక విషయంలో ఆందోళన కనిపిస్తుంది. స్త్రీలకు: ఆరోగ్య లోపం, అధిక వ్యయం, అనేకుల విషయంలో చెప్ప వచ్చు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# నీహారిక



## కుమారి ఎ.వి. శేషారత్నం

మాఘమాసం వచ్చేసినా మంచు దట్టంగానే ఉంది. అడుగు దూరంలో ఉన్నది మనిషో ఏమిటో తెలియనంత గాఢంగా ఉంది. ఏదయినా మంచువిడక చలికి కాళ్లు చేతులు కొంకర్లు పోతుంటే మంచుని తెగ తిట్టుకుంటూ పనుల్లోకి పోతున్నారు జనం.

నిట్టూర్చింది నీహారిక.

'ఇలా ఇప్పుడు తిడుతున్న ఈ మనుషులే మరో రెండు నెలలకి ఎండలు మాడ్చేస్తుంటే మంచుముక్కల కోసం అరాటపడుతూ ఆ చల్లదనాన్ని కొనుక్కోడానికి ఎగబడతారు. అవసరానికి ఆపదలో దేవతలా కరుణించిన మంచు అవసరం తీరగానే నెత్తిమీద అమ్మవారయి పోతుంది. ఇదే లోకం.'

పట్టుచీరల గరగరలు—

'ఆ అమ్మాయెవరంటావ్ ?'

'నా బొంద—అమ్మాయేమిటి ముప్పయ్యేళ్ళు దాటాక— పెళ్లి పెటాకులూ లేవుమరి. పెళ్లయితే నలుగురు బిడ్డల తల్లి అయ్యేది.'

'ఆడపెళ్లివారి తరపు బంధువా ?'

'హుష్ నెమ్మది—పెళ్లికొడుకు అప్పగారు'

'ఆ'— నోరు తెరిచేసింది ఎర్రపట్టుచీర—

'అయితే అప్పకి కాకుండా తమ్ముడికి చేస్తున్నారేం పెళ్లి ?'

'ఈయనగారిదో ప్రేమ వ్యవహారంలే. అక్కడికీ అప్పగారికోసం ఒక సంవత్సరం ఆగి, ఆవిడగారికి సంబంధం కుదరక చేసేసు కుంటున్నాట్ట—'

—'పోదూ అరవై ఏళ్లొచ్చాక అరులూ మరులూ అన్నట్టు ఈవిడకింకా 'పెళ్లేమిటి లెద్దూ ! నాకూ ముప్ఫయ్యేనా అప్పుడే మా పెద్దది పెళ్లికెదిగింది.— నీలం కంచి పట్టుచీర ముక్కు చీదింది.

'నాకు మాత్రం ఇరవై తొమ్మిదేగా! మనకి ముక్కుపచ్చలారకముందే చేసేసారు. పీటలమీద నిద్రోయానట. అయినా ఈవిడగారికిన్నాళ్లూ పెళ్లి కాలేదంటే ఏనైనా బెడిసికొట్టిన వ్యవహారమంటావా ?'—

మరింక ఆ దృశ్యాన్ని ఊహలో కూడ భరించలేక తల విదిల్చింది నీహారిక. తనకి తెలుసు పెళ్లికి వెళ్తే కాకుల్లా పొడిచేస్తారు తనని.

పెద్దపెట్టున దుఃఖం ముంచుకొచ్చింది. ఊహకే ఇంత భయంకరంగా ఉంటే వాస్తవంలో ఇవి ఎదురయితే భరించగలదా?

ఒక్కసారిగా తను ఒంటరిదైపోయినట్లూ ఇంట్లో వాళ్ళంతా గర్భశత్రువుల్లా తనమీద పగ తీర్చుకుంటున్నట్లూ అనిపించిందామెకు.

'వీళ్లకి తనేం అన్యాయం చేసింది? ఇదంతా ఆ బ్రూట్— రవిగాడు చేసాడు. ఎంతకీ తన స్వార్థమే చూసుకున్నాడు తప్ప నాకు— ప్రాణం లాంటి అక్కకి ఎంత తలవంపులో ఆలోచించాడు కాదు. ఇదేస్వార్థంలఆరేళ్లక్రితంతనూచూసుకుంటే ఏమయ్యేది? ఇప్పుడు తను అనుభవిస్తున్న నరకం అక్కకి రాకూడదనేగా చేతులారా బంగారంలాంటి భవిష్యత్తుకి సమాధి కట్టింది—

త్యాగం చేస్తున్నాననే భ్రమలో ఆనాడు తను మధుకలశాన్ని కాలదన్నింది.

ఎంతగా నచ్చచెప్పాడు మురళి ? ఊహూ అప్పుడవేమీ తన తలకెక్కలేదు. అదోరకం ఊపు—మత్తు, అసలు అలా త్యాగం చెయ్యడానికి ఆనాడు అక్కకీ తనకీ గొప్ప సఖ్యతేంలేదు. కాని పాడు కన్నీళ్ళతో తనని ఉక్కుచట్రంలో బంధించేసారు. పొగడ్తలతో ఆకాశానికెత్తుతున్నామని అథఃపాతాళానికి అణగతొక్కేసారు. అంతా స్వార్థపరులే.

మురళి ఇప్పుడేం చేస్తున్నాడో ? అతనికేం ? బంగారంలాంటి పెళ్లికొడుకుని ఎగరేసుకు పోయారు. ముత్యాల్లాంటి పిల్లలతో పండంటి సంసారం చేస్తూ చరణాల దాకా వచ్చేసి ఉంటాడు.

తనే ఇలా పల్లవితో ఆగిపోయింది.

ఆనాడు తనే ఎవరిమాట లెక్కచేయక ఏ కన్నీళ్లనూ లెక్కచెయ్యకపోతే ఈపాటికి మురళి అర్థాంగి స్థానంలో...

—ఆలోచించడానికి మరి ఇష్టంలేకపోయింది నీహారికకు.

మంచు ఇంకా విడలేదు. ఇలాగే ఎనిమిదయినా ఉంటే ఎలా ? —

అప్పుడారోజుల్లో ఆ ఆవేశం ఉధృతం వేరు. నల్లటి బండరాళ్లను సైతం లెక్కచెయ్యని సెలయేటి పరుగది.

మరో మూడేళ్ల తర్వాత అక్క పెళ్లి అయి

వెళ్లిపోతూ జాలిగా చూసింది ఒక్క క్షణం. అక్కకితెలుసు తను పోగొట్టుకున్న నిధి ఏమిటో—

అప్పటికి సంవత్సరం క్రితమే మురళికి పెళ్లయిపోయింది. ఎవరయినా ఎన్నాళ్లాగుతారు? అసలెందుకాగాలి ?

మురళి ఎప్పుడయినా పనిమీద ఈ ఊరొచ్చి నప్పుడు ఎక్కడయినా తారసపడినా అపరిచితునిలా మిగిలిపోయాడు. అతనికేసి ఒక్క క్షణమైనా చూడలేదు. చూస్తే ప్రపంచంలోని జాలినంతా పోగుచేసి తనకేసి చూసే ఆ చూపును తను తట్టుకోలేదు.

జాలిని భరించడమంత నరకం ఇంకొకటి లేదు. అదంటే పరమ అసహ్యం తనకి. అంత కంటే ద్వేషాన్ని భరించడం వెయ్యి రెట్లు సులభం.

అక్క పెళ్లి సంబంధాలకి తిరిగి తిరిగి అలసిపోయినట్లు— మధ్య తరగతి అమ్మానాన్నలు తన గురించి పట్టించుకోవడమే మానేసి కాళ్లు సాచేసారు ఒక్క పెళ్లికే. అయినా ఒక కుంపటి దిగిందిగా. మురళి ఉన్నాడనే వాళ్ల ధైర్యంమీద సమ్మెట పోటుపడింది— అతనికి ఆర్నెల్ల క్రితమే పెళ్లయి పోయిందని తను చెప్పిన కబురుకి.

మళ్లీ తన కోసం వేట మొదలు.

వేటాడిన సంబంధాలలో వాళ్లకే ఒకటి నచ్చితే మరోటి నచ్చేది కాదు. తనకంటె చదువు తక్కువనో, ఉద్యోగం తక్కువో — సరైన సంబంధాలు రాలేదు. తనకేం పట్టనట్టే ఊరు కుంది. మురళి కానప్పుడు ఎవరైతేనేం ?

తన కసలు పెళ్లి చేసుకోవాలనే లేదు.

వయసు ముదురుతున్న కొద్దీ రెండో పెళ్లి సంబంధాలు — నలభై దాటిన యువకుడికికూడ పదహారేళ్ల పడుచు కావలసి వచ్చి అవీ తప్పి పోయాయి.

తనకి పెళ్లికాకపోతేనేం ? కాని ఇదేమిటి ఇలా — ఇది సహజమని అన్పించడం లేదెందుకనో? అసూయా ?

రవి — రవి ఎంత ఎదిగిపోయాడు ? అసలు వాడికి పెళ్లి వయసు వచ్చిందనే తట్టలేదు తనకి. ఇంకా ఇద్దరమూ గిల్లికజ్జాలాడు కుంటున్నట్టే ఉంది. తన చాదస్తం కాకపోతే— తనకి ముంచుకొస్తున్న ఏళ్ళు వాడి కాగుతాయా?

మరి కొన్నాళ్లుపోతే సీత, రాధ కూడ పెళ్లికి తయారవుతారు. అసలు సీత పోకిళ్లు చూస్తుంటే తనకిప్పటికే అనుమానం — అది వయసును మించి ఎదుగుతోందని — దానిదింకా పసిమనసు కాదని !

ఆ రోజు ఆఫీసునుంచి అలసి గుమ్మంలో అడుగుపెట్టిన తను అక్కడే చేష్టలుడిగి ఆగిపోయింది.

'నాన్నా ! నీహా పెళ్లి చేస్తారా ? లేకపోతే నేను చేసే ...

'ఏమిట్రా నేనుచేతులుముడుచుక్కూర్చున్నా ననుకున్నావా ? ఛ ఛ జీవితంలో ఒక్క క్షణం



## నీ హా రి క

సుఖపడి చచ్చానా ? ఏ జన్మలో బాకీ ఉన్నానో — కూతుళ్లుగా పుట్టి ఇలా నా రక్తం పీల్చేస్తు న్నారు. కాకిలా కాళ్లరిగేలా తిరుగుతూనే ఉన్నాను. సంబంధం కుదరద్దూ ?'

'ఆ కుదురుతుంది— నువ్వు తెచ్చే సంబం ధాలు ఆవిడగారికి నచ్చితేగా. అయినా ఇన్నేళ్లొచ్చి ఇంకా సెలక్షనేమిటో గంతకు తగ్గ బొంతని చేసుకోక !'

రవి— రవేనా ఈ మాటలంటున్నది ? ఒక్కసారిగా కళ్లు తిరిగినట్టనిపించి గుమ్మానికి చేరబడిపోయింది తను.

రవంటే ఎంత ప్రాణం ? వాడి కోసం అమ్మతో ఎన్ని అబద్ధాలాడేది. మొదటి సారిగా తనకి సిగెరెట్టు తాగుతూ దొరికిపోయి గడ గడ లాడితే 'చిన్నతనం' అని నాన్నతో చెప్పకుండానే వదిలేసింది చిన్నగా మందలించి. వాడిప్పుడు నాన్నకి ఎదురు చెప్పేటంత మొనగాడయ్యాడు. అక్కకి కూడ అసూయ కలిగేది రవికి తనమీద ఉన్న అభిమానం చూసి. 'మీరిద్దరూ ఒక్కటే' అని ఎంత ఉడుక్కునేది'

అటువంటిది ఈనాడు తను రవికి అడ్డుగా ఉందన్నమాట ! ఎందుకు ? ప్రేమలో పడిన వాళ్లకంతేనేమో !

ప్రేమ ! రెండక్షరాల ప్రేమకి ఎంత మహత్తు. మరో హృదయం పలికే ఊసులు వినే శక్తి ప్రేమకుంది. చిన్నప్పటి నుంచి పెంచి పెద్దచేసిన తలిదండ్రుల్ని సైతం మరిపిస్తాయా రెండే రెండక్షరాలు. రక్తం పంచుకున్న వాళ్లు అవరోధాలను కుంటుందా ప్రేమే. ఆ మత్తులో ఏహో లోకాలు — రంగు రంగుల లోకాలు. అందులో ఆ ఇద్దరికీ తప్ప గాలికి కూడా చోటు లేదు. మరొకరి ఉనికి కూడ భరించలేని లోకం అది.

ఆ ప్రేమను తనూ చవిచూసింది. కానీ అక్కయ్యని 'అడ్డు' అనుకోలేకపోయిన నిస్వార్థ ప్రేమ తనది. అప్పట్లో అక్కని చూసి జాలి కలిగింది తనకి.

ఇప్పుడో ?

తనే దయనీయమైన స్థితిలో ఉంది.

రవి— ఆ స్వార్థపరుడు— నాకు పెళ్లి అక్కర్లేదనుకున్నాడా? అక్కయ్య విషయంలో తన త్యాగానికి కన్నీరు పెట్టుకున్న రవేనా ఇలా మారిపోయింది.

'నీహా ! నేను నీ కోసం దాచిన మామిడిపండును అక్కకివ్వెయ్యడంకాదే త్యాగ మంటే, రేపు ఇదే నరకమౌతుంది. నా మాట విను. మురళిని వదులుకోవడం మంచిదికాదు. అక్క పెళ్లయ్యేదాకా నువ్వు ఆగడం— మురళి ఒప్పుకున్నా అతనివాళ్లు ఒప్పుకోరు. నీ పెళ్లి అయిపోతే ఆ తొందరలో నాన్న ఎలాగూ అక్క పెళ్లి చేసేస్తారు. నామాట వినవే.'

ఆ రోజు వాడి ప్రేమకి మురిసిపోయింది. కాని ఈనాడు ఆసాంతం వాడు తన జీవితానికీ వర్తింపజేసుకుంటూంటే...

ఒకనాడు బ్రహ్మాండం బద్దలయింది అను కున్నట్టే రోజంతా ఇంట్లో తుఫానే.

తుఫాను వెలసిన క్షణాన ఇంక తన మొహం చూసే శక్తిలేక చీకట్లో అమ్మ కంఠం నిశ్శబ్దంగా రోదిస్తోంది. ఎంతయినా కన్నతల్లి తనకోసం కొట్టుకులాడే ఒకేఒక ప్రాణం—చీకటికి ఆమె గొంతుకు దాచే శక్తి లేక బావురుమంది.

'చూడమ్మా నీహా ! రవి పెళ్లి...'

తనకేమీ తెలియదనుకుంటున్న పిచ్చితల్లి తనకి సమస్యని విప్పి చెప్పడానికి తాపత్రయ పడుతోంటే జాలేసింది. ఒక రకమైన నిరాశ నిస్పృహ ఆవరించాయి తనని.

కూతురికి 'నీకంటే తమ్ముడికి ముందు పెళ్లి చేస్తామమ్మా' అని చెప్పలేక ఆవిడపడే అవస్థను చూడలేక —

'రవి పెళ్లి చెయ్యాలనుకుంటున్నారా అమ్మా !'

'అవునమ్మా ! తప్పనిసరి పరిస్థితిట. ఆ అమ్మాయి పట్టే ...'

'ఛీ ! ' పెద్దావిడ గొంతు పెగలేదు అంత కంటే చెప్పేందుకు.

'అందుకే — వీడా అమ్మాయిని తప్ప వేరెవరినీ చేసుకోనంటున్నాడు. అదీ వెంటనే చెయ్యకపోతే...నువ్వు ఊ ! అంటే...'

పిచ్చి అమ్మ ! తనకి నచ్చచెప్పాలని కాకపోతే ఇంకా రవి తన అంగీకారంకోసం కూర్చున్నాడా ? అసలు ఈ ముసలాళ్లు మాత్రం ? తను ఏడిస్తే కొడుక్కి అశుభమనేగా ? లేకపోతే వాడి కాళ్లు విరగ్గొట్టే ... — ఎవరిమీదో తెలియని కసి బుసకొట్టింది.

అంతలోనే ఏమీ చెయ్యలేని నిస్సహాయత. తల్లి మొహంచూసి జాలి.

హుం జాలి ! దీనితోనే తన జీవితాన్నంతా శాసిస్తున్నారు వీళ్లు.

ఛ, ఏమిటిలా ఆలోచిస్తోంది? బలవంతంగా కొరడా ఝుళిపిస్తూ ఎవరో అనిపిస్తున్నట్టే —

'నీయిష్టమమ్మా ! పెళ్లికి మాత్రం నేను రాను.'

ఇంటిల్లిపాదీ తిరుపతి ప్రయాణమౌతున్నా అదే మాటమీద ఉండిపోయింది తను. అమ్మ తర్కించలేదుమరి. కాని నాన్న, అక్కయ్య మిగతా అంతా సణుగుతూనే ఉన్నారు.

అక్కయ్య ఎంత మారిపోయింది ? ఆశ్చర్య మేస్తోంది.

ఒకప్పుడు తన పెళ్లికాకుండా నేను ముందే మురళిని చేసుకుంటే నూతిలో దూకుతానని ఏడ్చిన అక్కయ్యేనా ? అలా చేస్తే నాకెంత పాపం, ఉసురు చుట్టుకుంటాయో నూరిపోసి కాళ్లా వేళ్లా పడిన అక్కయ్యకే — వీళ్లందరికీ

# డాక్టరు సలహాలు

## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**ఓ. ఆర్. — గుంటకల్లు**

మా అన్నయ్య వయస్సు 25 సం॥లు. 5 సం॥ల క్రితం క్షయరోగం వచ్చింది. 2 సం॥ తర్వాత మా అక్కయ్యకి వచ్చింది. ఇప్పుడు నాకు, మా తమ్ముళ్లకి రావచ్చునని భయముగా నున్నది. ఈ రోగం ఎందువల్ల వస్తుంది? దీనికి చికిత్స ఏమిటి?

★ కుటుంబంలో ఉన్న సంఖ్యలలో 5 శాతంవారికి మాత్రమే ఈ రోగం సోకే అవకాశం ఉంటుందని శాస్త్రజ్ఞుల అంచనా. ఈ విషయం దృష్ట్యా మీరు భయపడవలసిన అవసరంలేదు. వానిముందు జాగ్రత్తగా రోగి వాడిన వస్తువులు (కప్పులు, కంచాలు, టవల్స్, జేబురుమాళ్ళు) వాడకూడదు. రోగి దగ్గేటప్పుడు నోటికి అడ్డంగా కర్చీఫ్ పెట్టుకోవటం అవసరం.

క్షయరోగం మైకో బాక్టీరియం ట్యూబర్క్యులోసిస్ అనే సూక్ష్మక్రిములవల్ల వస్తుంది. ఈ రోగానికి స్ట్రెప్టోమైసిన్, ఐ.ఎన్.హెచ్., పి.ఎ.ఎస్., థై అసిటజోన్ అనే మందులలో ఏ రెండింటినైనా 18 నెలలపాటు వాడవలసి ఉంటుంది. ఆరు నెలల కొకసారి వైద్య పరీక్ష అవసరం.

**ఎన్. జి. బి. — పాచిపెంట**

నా వయస్సు 28 సం॥లు. నేను పోస్ట్ మాన్ ఉద్యోగం చేయుచున్నాను. నాకు గుండెకి ఎడమప్రక్క ఒక్కోసారి నెప్పి వస్తుంది. రెండు నిమిషములు మాత్రం ఉంటుంది. ఆ టైములో మాట్లాడినా, నవ్వినా నెప్పి వస్తుంది. ఎక్కువగా ఉండదు.

★ ఈ నెప్పి ఫైబ్రోసైటిస్ అయి వుంటుంది. అంటే కండరములు కొద్దిగా వాయటం అని అర్థం. మీ ఉద్యోగరీత్యా ఒకే చేతితో పెద్ద ఉత్తరాల కట్టను పట్టుకోవటం వల్ల ఇలా నెప్పి రావచ్చును. పైపూతగా బొలాన్‌డిన్ క్రీం పూయండి.

**ఎం.సి.పి.ఆర్. — ఒంగోలు**

నాకు పది సం॥ల నుండి ఫిట్సు వస్తున్నాయి. అనేక మంది డాక్టర్లు నరముల బలహీనత వల్ల వచ్చినదే కాని మరే జబ్బు లేదంటున్నారు. అసలు ఫిట్సు అనేవి ఎందుకు వస్తాయి? వాటికి చికిత్స ఏమిటి?

★ ఫిట్సు రావటానికి చాలా కారణాలున్నాయి. శిశువు జన్మించక మునుపు ఏర్పడగల కొన్ని మార్పులవల్ల, శిశుజనన సమయంలో ఏర్పడగల కొన్ని అవాంతరాలవల్ల, పుట్టిన తర్వాత శరీరంలోని రాగల రోగాలవల్ల ఫిట్సు వస్తాయి. చాలా సందర్భాలలో ప్రత్యేకమయిన కారణం అంటూ లేకుండానే ఫిట్సు రావచ్చును. మెదడు భాగం కొంత మేరకు అధికంగా పనిచేసినా, పాడై పోయినా ఇలా ఫిట్సు వస్తాయి. ఫిట్సు మాదిరిగా హిస్టీరియా రోగంవల్ల కాళ్ళు చేతులు కొట్టుకోవటం జరుగుతుంది. రోగనిర్ధారణను బట్టి మందులు వాడవలసి ఉంటుంది. ఎక్కువగా గార్డినాల్, ఫెనిటాయిన్ సోడియం, (డైలాన్‌టిన్) వంటి మందులు వైద్యుల పర్యవేక్షణలో వాడవలసి ఉంటుంది. ★

---

ఇప్పుడు రవి చేస్తున్న పని న్యాయంగా అనిపిస్తోందన్నమాట.

ఒక్కరంటే ఒక్కరైనా చెప్పరేం — 'మగాడివి నీ పెళ్లికి తొందరేంటి — నీహా పెళ్లి కానియ్యి' అని.

పైగా తననొక శిలలా, కుళ్లబోతులా చూస్తున్నారు తప్ప తన మనసు నర్థం చేసుకోరేం?

దుఃఖం పొంగుకొచ్చింది వెల్లువలా. ఎంతసేపో అలో ఉండిపోయింది నీహారిక.

'అక్కయ్యా నీకీ ఎర్రచీర బాగుంటుందని తీసాను. రాధకి సీతకి ఒకే రంగు చీరలు ...' రవి మాటలు శల్యాల్లా తూట్లు పొడుస్తున్నాయి గుండెను.

ఒకప్పుడు తను ఏరుకుంటే తప్ప ఏ వస్తువునీ ఎవర్నీ ముట్టనివ్వని రవికి ఈరోజు నేను గుర్తే రావడం లేదు.

అంతా గుడికి వెళ్లారు. రేపే తిరుపతి ప్రయాణం. ఒక్కరు కూడ బలవంతం చెయ్యడం లేదు రమ్మని — అమ్మ తప్ప. ఎవరికీ తను అక్కరలేదు.

వీళ్లంతా ఏమయిపోయినా తనకి మాత్రం ఎందుకు? నిజంగానే తను పాషాణం. చిన్నప్పుడు తెలుగుమాస్టారి మాటలు గుర్తొస్తాయి.

కొత్తలో — క్లాసులో ఒక్కొక్కరి పేరూ అడిగి అర్థం చెప్తమంటున్నారు.

'శాంభవి'

'అంటే శంభుని భార్య — పార్వతి —'

'కుసుమ'

అంటే పువ్వు —

'నీహారిక' — కంగారు పడింది తను. తన పేరుకి అర్థం తనకి తెలియదు. మెత్తగా నవ్వారు మాస్టారు.

'అంటే మంచు ముక్కమ్మా! మంచు కఠినమైనదైనా స్వచ్ఛమైన చల్లని హృదయం గలది. అంటే కరిగిపోయే జాలిహృదయంగల దాని వన్నమాట' ఎంత సంతోషం కలిగిందో అంత మంచి అర్థంగల పేరు తనకున్నందుకు.

ఇప్పుడో?— విరక్తి కదలాడింది— అందరికీ తన కఠినత్వమే కనపిస్తోంది తప్ప కల్లాకపటం లేని స్వచ్ఛమైన హృదయాన్నెవరు చూడ గలిగారు?

అందుకే తనకీ వాళ్లు అక్కర్లేదు.

పెళ్లికి వెళ్లదల్చుకోలేదు తను.

వెళ్లకపోయినా పెళ్లి ఆగదుగా!

ఉదయమే పెళ్లికొడుకుని చేసి రవికి నిలువుబొట్టు పెడుతుంటే తనకెంత కోపంగా ఉన్నా— 'ఎంత బుద్దిగా ఉన్నాడు— దిష్టి తగులుతుందేమో పిచ్చినన్నాసికి' అనిపించింది. కొత్త బట్టల్లో, నుదుట కుంకుమబొట్టు— కాళ్లకి పసుపు— పెళ్లికళ వచ్చేసింది వాడికి.

'ఛ వాడెలా ఉంటేనే తనకి?' అంత స్వార్థంతో అక్క భవిష్యత్తు ఏమవుతుందోనన్న ఆలోచన అణుమాత్రం కూడా లేకుండా పెళ్లి చేసుకుంటున్నాడు. ఏం? అభిమానం ఉన్నవాడైతే మరో నాలుగేళ్లు ఆగొచ్చుగా.

పొంగులా బుసబుసలాడింది కోపం.

'వాడికిలేని అభిమానం నాకు మాత్రం ఎందుకుండాలి? నాకింక ఎవరిమీదా ఏ అభిమానమూ లేదు. ఉండదు. తన ప్రేమ అభిమానం మురళితోనే పోయాయి. త్వరలో ఇక్కడ్నుంచి ట్రాన్సఫరు చేయించుకుని వెళ్లి పోవాల్సిందే'—

మళ్లీ పొంగింది కడలి బడబాగ్నిని దాచలేక.

'నీహా!'

ఉలిక్కిపడింది నీహారిక. పాదాలపై బరువు.

'అక్కయ్యా!'

నమ్మలేకపోతోంది. రవి కళ్లలో నీళ్లు. తన కాళ్లకి దణ్ణం పెడుతున్నాడు. ప్రక్కన మనస్విని ఎవరది?

'నీహా! మంజుల' — అర్థమయింది నీహారికకు. రవి గుడికి వెళ్లలేదు. ఈ పెళ్లికూతు రిక్కడికెలా వచ్చింది? —

'మమ్మల్ని దీవించక్కా! నీ అంత నిగ్రహం లేని సన్నాసిని. అందుకే మంజును త్వరగా పెళ్లి చేసుకోవాల్సి వస్తోంది' — ఏడుస్తున్నాడు రవి.

'అయ్యయ్యో! ఏమిటిది! ఛ! పెళ్లికొడుకు ఏడవచ్చా?' — కంగారుపడింది నీహారిక.

సూర్యుడు పైకొస్తున్నాడు. మెత్తని మల్లెపూరేకులమీద కరిగిన మంచు బిందువులు.

మౌనంగా ఉండిపోయినా ఆమె స్వచ్ఛమైన హృదయాన్ని చాటుతూ రవి తలపై రెండు నీటిచుక్కలు — మంచు కరిగింది రవి కిరణ స్పర్శతో.

మర్నాడు అందరికంటేముందే హుషారుగా చకచకా తిరుపతికి ప్రయాణమవుతున్న కూతుర్ని చూసి తల్లి విస్తుపోలేదు — కొంగుతో కళ్లు తుడుచుకుంది. ★

సీరియల్

# నీలి మేఘ సంధ్యారాగం

## వక్కలంక పద్మావతి

*(గత సంచిక తరువాయి)*

**జరిగిన కథ — 3:** సురేంద్ర ఉద్యోగ నిమిత్తమై తన తండ్రికి మిత్రుడైన విశ్వనాథంగారింటికి వస్తాడు. మంజుల విశ్వనాథంగారి కుమార్తె. విశ్వనాథంగారి కుటుంబంతో కచేరికి వెళ్ళగా అక్కడ గాయత్రి పరిచయం అవుతుంది. మంజులతో గాయత్రి ఇంటికి బయల్దేరుతాడు సురేంద్ర. అతనికి గాయత్రి గురించి చెపుతుంది మంజుల. గాయత్రి అందం చూసి ముగ్ధుడవుతాడు సురేంద్ర. ఆమెను ప్రేమిస్తాడు. మంజుల వినోద్‌ను తను ప్రేమిస్తున్నట్లు, పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నట్లు సురేంద్రతో చెపుతుంది. వినోద్‌ను సురేంద్రకు పరిచయం చేస్తుంది. సురేంద్ర తను గాయత్రిని ప్రేమిస్తున్నట్లు మంజులతో చెపుతాడు. గాయత్రి మాటలకు సురేంద్ర మనసు దెబ్బతింటుంది. తను గాయత్రిని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నట్లు ఆమెకు చెపుతాడు. గాయత్రి కూడ సురేంద్రను ప్రేమిస్తుంది కాని తండ్రికి భయపడి తన ప్రేమను బయటకు వ్యక్తం చేయలేకపోతుంది.

కారు వేగంగా దూసుకుపోతూంది. వినోద్ సిగరెట్ పొగలు వదుల్తూ పక్కనున్న మంజులతో మాట్లాడుతూ డ్రైవ్ చేస్తున్నాడు. ఒక హోటల్ ముందు ఆపాడు కారు.

'కాఫీ త్రాగుదాం' అంటూ మంజులను ఆహ్వానించాడు. ఇద్దరూ ఒక కార్నర్‌లో కూర్చున్నారు. కాఫీకి ఆర్డరిచ్చి మంజుల్ని సూటిగా చూడటం మొదలు పెట్టాడు. అతని కళ్ళు సంతోషంతో మెరుస్తున్నాయి. అతనలా చూస్తుంటే మంజుల చిన్నగా నవ్వింది.

"ఏయ్ విన్నీ! ఏమిటా చూపు. ఎవరైనా చూస్తే పిచ్చివాడనుకుంటారు. కాస్త నాలుగు వైపులా కూడా చూస్తుండు స్వామీ."

"ఉహు! ఎదురుగా నువ్వుండగా దిక్కులు చూడాల్సిన ఖర్మ నాకేమిటి?" మొండిగా అన్నాడు.

టేబిల్ మీదున్న ఆమె చేతిమీద తనచేయి వేసి మృదువుగా నొక్కాడు. అతని స్పర్శకు పులకించిన మంజుల అతని చేతిని మరింత గట్టిగా పట్టుకుంది.

కాఫీ రావడంతో ఇద్దరూ యీ లోకంలో వొచ్చి, మౌనంగా కప్పులు అందుకుని ఖాళీ చేసి మళ్ళీ బయలుదేరారు.

"సురేంద్ర ఉన్నాడా ఇంటి దగ్గర?" కారులో అడిగాడు వినోద్.

"ఉహు! ఆఫీసు నుంచి రాగానే క్లబ్‌కి వెళ్ళాడు. ఏం?"—

"అతను కూడా వుంటే సరదాగా వుండేది కదూ;" అంటూ కారుని యూనివర్శిటీ రోడ్‌లోకి మళ్ళించాడు.

కొద్ది దూరంలో మైదానంలాటి ప్రాంతంలో కారు ఆపాడు వినోద్. సాయం కాలం కావటం వల్ల సూర్యుడు అలసిపోయిన మొహంతో పశ్చిమ దిశకు విశ్రాంతి కోసం పయనిస్తున్నాడు. ఆ నీరెండలో ఇద్దరూ ఒక గుబురుగా వున్న పూల మొక్కల పక్కన చతికిల పడ్డారు. చల్లగాలి వీస్తుంది. చెట్లన్ని గాలికి రెపరెపలాడుతున్నాయి నవ్వుతూ తుళ్ళుతూ చెట్లచాటున కబుర్లాడుకుంటున్న జంటల్ని కళ్ళు వెడల్పుచేసి చూసింది మంజుల.

"మంజూ" అన్నాడు ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ వినోద్. ఏమిటన్నట్టు చూసింది.

"వాళ్ళంతా చూడు. ఎలా ధైర్యంగా చెట్టాపట్టాలేసుకుని ముచ్చట్లు చెప్పుకుంటున్నారో! ఇప్పటికి సంవత్సరం నించీ ఏడిపిస్తున్నావు. ఇంకెంత కాలం మనం ఇలా దూరంగా బ్రతకటం?"— అతని మొహంలో దిగులు.

మంజుల కిలకిలా నవ్వింది.

"ఒక్క రెండేళ్ళే కదా విన్నీ; నువ్వు మలేషియాలో వుండేది. నువొక్కడివే వెళ్ళి రాకూడదూ! తిరిగొచ్చిం తర్వాత మ్యారేజ్ చేసుకుందాం" అంది అతన్ని కవ్వించటానికి.

వినోద్ కోపంగా చూసి "సరే నీ ఇష్టం! అలాగే వెళ్తాను. అక్కడ ఎర్రగా బుర్రగా వున్న అమ్మాయిని చూసి పెళ్ళాడేసి మరీ తిరిగి ఇండియా వస్తాను. సరేనా"— ఉడికించాలని అన్నాడు,

ఆ మాటలకి మంజుల మొహం ఎర్ర బడింది. మూతిని మూడు వంకర్లు తిప్పింది తమాషాగా!

"అవున్లే! మీ మగవాళ్ళ ప్రేమలు ఇలాగే వుంటాయి. ఒకరి కోసం ఒకరి ఏ చిన్న విషయంలోనూ త్యాగం చేసుకోలేని ప్రేమ కూడా ప్రేమేనా? అందుకే గాయత్రి మగవాళ్ళనలా దుయ్యబడుతుంది. నీ ఇష్టం విన్నీ... అలాగే చేసుకో! కానీ నాకంటే అందగత్తె, నాలా నిన్ను ప్రేమించే అమ్మాయి దొరుకుతుందేమో చూడు. ఆఁ!"— ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరగటం, ఆమె మొహం ఎర్రగా కందిపోవటం చూసిన వినోద్ పకపకా నవ్వాడు. మరింత కోపంగా చూసింది మంజుల.

మంజులను తన హృదయానికి మృదువుగా హత్తుకుని ఆమె కళ్ళల్లోకి ప్రేమగా చూశాడు.

"మంజూ! నిన్ను వదలి ఒంటరిగా, దూరంగా నేనెలా వుండగలననుకుంటున్నావు? నువ్వుకాక నా మనసుకు మరో స్త్రీ నచ్చుతుందనే భావిస్తున్నావా! ఒక్కోసారి; ఇన్ని సంవత్సరాలు... నీ పరిచయం... నీ ప్రేమ లేకుండా నేనెలా యీ జీవితాన్ని గడపగలిగానా, అని ఆశ్చర్యం కలుగుతుంది. అలాంటిది; నువ్వు నాదానివికాకుండా, నీ తోడు లేకుండా నేను బ్రతగ్గలనా మంజూ!"

ఆమె మాట్లాడలేదు. తలొంచుకుని మెల్లగా నవ్వుకుంటోంది.

"మాట్లాడవేం మంజూ!" జాలిగా అడిగాడు.

"నన్నెందుకు ఏడిపించాలి. నువ్వు గనక నిజంగా ఆపనే చేస్తే... చూడు నిన్నేంచేస్తానో" అంది కోపం నటిస్తూ.

"ఏంచేస్తావు" బెదురుగా అన్నాడు.

"నువ్వు వెంటేసుకొచ్చిన ఆ తెల్ల దొరసానితో కరాటేఫైట్‌చేసి మళ్ళీ ఇండియా మొహం చూడకుండా తరిమేస్తాను—"

వినోద్ ఆ దృశ్యాన్ని వూహించుకుని పకపకా నవ్వేశాడు. ఆమెకూడా అతని నవ్వుతో శృతి కలిపింది.

కొన్నిక్షణాల తర్వాత వినోద్ అన్నాడు "మరో రెణ్ణెల్ల తర్వాత నేను వెళ్ళిపోవాలి యీ లోపే సెటిల్ అయిపోవాలి మంజూ! మరి అంకుల్‌తో నేను మాట్లాడనా! మా డాడీ, మమ్మీ నా మాటకి తప్పకుండా ఒ.కె. అంటారు, మీ డాడీతో మాట్లాడమని చెప్పమంటావా?"

రెండు నిమిషాలు ఆలోచించి అంది.

"వద్దు విన్నీ! సురేంద్ర గురించి మా డాడీ ఆలోచన చెప్పాను కదా! అతను మన పెళ్ళి జరిగేలా డాడీని ఒప్పిస్తానన్నాడు. మనం డైరెక్ట్‌గా అడిగితే మనమీద బాడ్ ఇంప్రెషన్ పడుతుందేమో! సురేంద్ర మాట డాడీ తప్ప కుండా వింటారు. నేను మిసెస్ వినోద్‌ని అవుతాను—" గర్వంగా అంది.

అతని మొహం కాంతిగా వెలిగింది. దగ్గరిలో ఎవరూ లేరని గమనించి ఆమెమీదికి వంగి చటుక్కున బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు.

చిరుకోపంతో చూసింది మంజుల.

"మంజూ! మనం పెళ్ళిచేసుకుని వెళ్ళి పోతాం కదా! ఈలోపు ఒకటి రెండుసార్లు పిక్నిక్ ప్రోగ్రామ్ వేసుకుని ఎంజాయ్ చేద్దాం. గాయిత్రి, సురేంద్ర అందరం కలిసి సరదాగా గడుపుదాం. రేపే సండే ప్రోగ్రామ్ మహాబలి పురం వేసుకుందాం! సరేనా—"

"మైగాడ్! మహాబలిపురమే! ఉదయం వెళ్ళి రాత్రికి వచ్చేయటం కుదురుతుందా!..."

"ఉహూ! కుదరదు. ఒక్క నైట్ అక్కడే అడ్జస్ట్ అవుదాం."

"అమ్మో! మమ్మీ ఊరుకోదు."

"నా బాడ్‌లక్! సరే ఎంత రాత్రయినా వచ్చేద్దాంగానీ, గాయత్రికి కూడా చెప్పు యీ విషయం."

"చెప్తానుగానీ..." నీరసంగా అంది ఏదో ఆలోచిస్తూ.

"ఏమిటి" —

"వాళ్ళిద్దరిమధ్యా పచ్చగడ్డి వేస్తే భగ్గు మంటుందే. మనం ఇన్వైట్ చేశామని బావుండ దని వచ్చినా వాళ్ళిద్దరూ ఎడమొహం పెడమొహంగా వుంటే ఎవరుమాత్రం ఎంజాయ్ చేయగలం?"

"అదేమిటి? వాళ్ళిద్దరూ అలా..." ఆశ్చర్యంగా అడిగాడు.

మంజుల అతనికి వాళ్ళిద్దరి గురించి అన్ని విషయాలు చెప్పింది.

"పాపం ఆ రాత్రి మీరెళ్ళిపోయిన దగ్గర్నుంచి ఇప్పటిక్కూడా ఏదో పోగొట్టుకున్న వాడిలా ఎంతో డల్‌గా వున్నాడు. గాయత్రి వస్తుందని ఏరోజు కారోజు ఎదురుచూస్తున్నాడు గానీ... యీ వారం రోజుల్లో ఒక్కసారికూడా రానేలేదు. కాలేజీ మూలంగా నాకూ వీలుపడటం లేదు... ఈరోజు వెళ్దామా!"

"అంతేనా! ఇంకేమిటో అనుకున్నాను.



ఆడపిల్లకి ఒక మగాడిమీద అంత కోపం వచ్చిం దంటే... కారణం మనసులో అతన్ని గాఢంగా ప్రేమిస్తూ్ందన్నమాట. ఫర్వాలేదు. వాళ్ళు తప్పకుండా ఒకటౌతారు. డోంట్‌వర్రి'' అన్నాడు నవ్వుతూ !

ఇద్దరూ అక్కణ్ణుంచి తిన్నగా గాయత్రి ఇంటికి వచ్చారు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. కిరణ్ బయటికి వచ్చాడు వీళ్ళని చూసి.

## ఇది మేఘ సందేశమూ...

''అక్కకి వారం రోజుల్నుంచి జ్వరంగా వుంది. గదిలో పడుకునుంది'' అన్నాడు.

మంజుల గబగబా వెళ్ళింది గదిలోకి. వినోద్ ఆమెను అనుసరించాడు. వీళ్ళిద్దరిని చూసిన గాయత్రి ఏదో పుస్తకం చదువుతున్నదల్లా, పక్కన పడేసి ''రండి'' అంటూ లేచికూర్చుంది.

మంజుల గాయత్రి పక్కన మంచంమీద కూర్చుంది. వినోద్ ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

''జ్వరం ఎప్పట్నుంచి గాయత్రీ. ఇప్పుడెలా వుంది'' అన్నాడు.

''తగ్గిపోయింది వినోద్. ఉదయం నుంచీ కాస్త తిరగ్గలుగుతున్నాను'' నవ్వుతూ అంది.

ఆ నాల్రోజుల జ్వరానికే గాయత్రి బాగా చిక్కిపోయింది. ముఖం వాడిపోయి నీరసంగా వుంది. ఆమె కళ్ళక్రింద నల్లనిచారలు, ఆమె ఆలోచనలనీడలని గ్రహించింది మంజుల.

''గాయత్రి! ఇంతజ్వరం అయితే కిరణ్‌తో నాకు కబురుచేయకూడదటే...'' నిష్ఠూరంగా అంది.

''నేను చెప్పానమ్మా గాయత్రికి ! కబురు చేద్దామా అని. రెండురోజులు టెంపరేచర్ మరీ ఎక్కువైంది. ఏవేవో పిచ్చి పిచ్చి కలవరింతలు. నీకు కబురుచేస్తే నువ్వు కంగారుపడతావని వద్దంది. అందుకే వూరుకున్నాము''—. అప్పుడే పాలగ్లాసుతోవచ్చిన పరమేశంగారు అన్నారు మంజుల నుద్దేశించి.

మంజుల గాయత్రిని చూసింది.

ఆమెకు కోపం వచ్చిందని గ్రహించింది గాయత్రి. మంజుల భుజంమీద చేయివేసి ''నువ్వు అనవసరంగా గాభరాపడతావని'' అంది. గాయత్రి చేతిని తన భుజంమీంచి విసురుగాతీసేస్తూ అంది మంజుల —

''అవును బుల్లిపాపాయిని కదూ ! జర్వం చూసి ఝడుసుకోవటానికి. నీకు మేం ఎందుకు పనికొస్తాంలే... నీ ఇష్టం''.

''సారీ మంజూ ! కాస్త తగ్గింతర్వాత కిరణ్‌తో కబురు చేయాలనుకున్నాను. వాడికి పబ్లిక్‌పరీక్షలు. టైములేక వీలుపడలేదు. కోపం తెచ్చుకోకు, ప్లీజ్'' అంది సంజాయిషీ ఇచ్చు కుంటున్నట్టు.

''మంజుల మనసు వెన్నలాటిది. ఊరికే కరిగిపోతుంది. నువ్వు భయపడకు గాయత్రి,'' వాతావరణాన్ని తేలికపరుస్తూ అన్నాడు వినోద్. గాయత్రితోపాటు మంజులకూడా నవ్వేసింది. పరమేశంగారు అక్కడనుంచి నవ్వుకుంటూ వెళ్ళి పోయారు బయటకు.

కాసేపాగి ''మరినేను వెళ్ళొస్తా గాయత్రీ'' అంటూలేచాడు వినోద్. మంజుల అతన్ని కారు వరకూ సాగనంపి ... తిరిగి వచ్చింది. పిల్లలు 'కేరమ్స్' ఆడుకుంటున్నారు.

గాయత్రికి సురేంద్రగురించి అడగాలని తహ తహగా వుంది. అడిగితే మంజుల ఏమయినా అనుకుంటుందేమోనని సందేహంగావుంది. సంభా షణ ఎలా మొదలుపెట్టాలో ఆమెకు అర్థం కావటంలేదు. హఠాత్తుగా తలెత్తి మంజులని చూసింది.

ఏదో చెప్పాలని చెప్పలేకపోతున్న ఆమె

## మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

## సబ్బు- ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమున్నకు ప్రేమ్.
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్.



Imageads-M-1564



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ




ప్రేమ్ – తాజాతనము నందించు సబ్బు.

మొహమాటాన్ని మంజుల గమనించి, తనలోతను నవ్వుకుంది.

"మంజూ" నెమ్మదిగా పిలిచింది

"ఏం గాయత్రీ."

ఇక తను ఆగలేదు. సురేంద్ర ఎలా వున్నాడో, ఏమిటో అడిగేయాలి. తన మీద బాగా కోపం వచ్చివుంటుంది. అందుకే మంజులతో పాటు ఇంటికి రాలేదు. తన మాటలకు అంతగా బాధపడుతున్నాడా ! ! !

"ఏమిటే గాయత్రీ ! ఎదురుగా నన్ను ఒంటరిదాన్ని చేసి నీ ... ఆలోచనలు... !" ఆమె చేతిని చిన్నగా నొక్కుతూ అడిగింది.

"మంజూ ! సురేంద్రకి నామీద కోపం వచ్చిందా !"

"కోపమా ! ఎందుకు ?"

"మంజూ ! ఏమీ తెలీనట్లు మాట్లాడకు. ఆరోజు సురేంద్ర నీతో చెపుతున్న మాటలన్నీ నేను విన్నాను. ఒకవైపు ఆనందంతో, మరో వైపు భయంతో నా మనసు ఊగిసలాడింది. అవే మాటలు తిరిగి నాతోనూ అన్నాడు సురేంద్ర. నా మనసు విప్పి చెప్పే మార్గంలేక, అతను దూరమవుతాడేమోనన్న బాధతో అతని మనసును గాయపరచాను. ఆ తర్వాత ఆలోచిస్తే నా మనసు నాకు అర్థం చెప్పింది. తర్వాతరోజు వచ్చి సురేంద్రకు క్షమాపణలు చెప్పుకోవాలనుకున్నాను. కానీ ... రెండు రోజుల తర్వాతగానీ నేను జ్వరంతో మంచం పట్టినట్టు తెలీలేదునాకు. నువ్వూ, సురేంద్ర వస్తారని — ఎంతో ఎదురు చూశాను. అతనెట్లావున్నాడు మంజూ !"

ఆమె అంతగా బాధపడటం చూసి మంజుల మెత్తబడింది.

"సురేంద్ర మనసు విప్పి చెప్పినపుడు నీ అభిప్రాయం నిష్కర్షగా చెప్పేయాలి. అతన్ని అనవసరంగా అసహ్యించుకున్నట్టు మాట్లాడితే నీ మనసు శాంతిస్తుందా ? నీ మనసులో తన మీద అలాటి భావం ఏర్పడిందని ఎంతో బాధపడు తున్నాడు సురేంద్ర. అతన్నెలా ఊరడించాలో నాకు అర్థం కావటంలేదు."

గాయత్రి కళ్లల్లో నీళ్లు తిరగటం చూసిన మంజుల మనసు కరిగిపోయింది.

"బాధపడకు గాయత్రి !"—అంది.

"మంజూ ! నా గురించి నీకు తెలియనిదేం వుంది ! నాన్నగారి గురించి ... నా తర్వాత వాళ్ల భవిష్యత్తుగురించి భయపడ్డాను. కానీ ఆలోచిస్తే నేనిప్పుడలా అనుకోవటంలేదు. అతన్ని మనసారా ప్రేమిస్తున్నాను. పెళ్లి చేసుకోవాలనుకున్నాను. అందువల్ల ఎదురయ్యే పరిణామాలను ఎదుర్కో వాలనే నిశ్చయించుకున్నాను".

ఆవేశంతో చెప్పున్న గాయత్రి మాటలు మంజుల్ని ముగ్ధురాల్ని చేశాయి.

"గాయత్రీ! నువ్వు నిజంగా చాలా ధైర్యం చేస్తున్నావు. నిన్ను అభినందిస్తున్నాను. ఈ

## ఇది మేఘ సందేశమా ...

విషయం నువ్వే సురేంద్రకు స్వయంగా చెప్పు. అతని మొహం సంతోషంతో వెలిగిపోతుంది ?"

గాయత్రి మనసులో సురేంద్రను గురించిన ఆలోచనలు అధికమయ్యాయి. మంజుల ఆమె భుజం తట్టింది ధైర్యం చెపుతున్నట్టుగా.

* * *

గాయత్రి ఆరోగ్యం బావుండలేదని మంజుల చెప్పినదగ్గర్నుంచి సురేంద్ర మనసు ఆమెను చూడాలని తొందరపడింది. కానీ ఎందుకో వెంటనే వెళ్ళటానికి సందేహించాడు. ఆమె తలపులు ఎంత మర్చిపోదామన్నా మరుపుకు రావటంలేదతనికి.

గాయత్రికి కాకపోతే తన బ్రతుకులో వెన్నెలజల్లి, తనను లాలించే శక్తి ఎవరికుంది. కానీ తను ఎంత ప్రయత్నించినా తన మనసు ఆమెకు అర్థంకావటంలేదు. సముద్ర కెరటాల్లా అందినట్లే అంది దూరమవుతూంది. ఏ విధంగా ఆమె మనసును కరిగించటం ?

రెండు రోజులతర్వాత సురేంద్ర క్లబ్ నుంచి రాగానే స్నానం ముగించి లుంగీ, బనీనుతో భుజం చుట్టూ టవల్ కప్పుకుని బాత్‌రూం లోంచి బయటికిరాగానే... ఎదురుగా కనిపించిన దృశ్యాన్నిచూసి ఆశ్చర్యచకితుడయ్యాడు.

తూర్పువైపునున్న కిటికీలోంచి బైటకు చూస్తే... దూరంగా కొండలు, లోయలు దర్శనమిస్తాయి. ఉదయంలో సూర్యోదయం, స్త్రీ హృదయంలో రాగోదయంలా అద్భుతంగా వుంటుంది ఆ లోయల్లో ! ఆ కొండ శిఖరాల్ని కనిపించనీయకుండా మేఘాలు కమ్ముతూవుంటె గడచిన అనుభవాలు మనసులో మెదుల్తాయి. ఆ అందాలు, చూడగానే మనసుకు హత్తుకుపోయే అద్భుతాన్ని కల్గించవు. రసహృదయంలో అన్వేషిస్తే ఎన్నెన్ని గొప్ప గొప్ప సౌందర్యాలు ఆ కొండ చరియల్లో, లోయల్లో గోచరిస్తాయో ! ఎన్ని ఒంపులు ఒయ్యారాలు ఆ సృష్టిలో కని పిస్తాయో !

ఆ ఆనందాన్ని హృదయ నిశ్శబ్దంలో ఆనందించి పరవశించిపోతూ వుంటాడు సురేంద్ర స్త్రీ హృదయంలా అగాధంలా అద్భుతంగా కనిపించే ఆ లోయల్ని చూస్తున్నప్పుడు మాత్రం ఏదో ఆలోచనలలో మునిగిపోతాడు.

కిటికీ చువ్వల్ని పట్టుకుని ఆ సాయం సంధ్యలో ఆ కొండలకేసి ఊహించిన అందాల కోసం అన్వేషిస్తున్నట్టు గుచ్చి గుచ్చి చూస్తూ నిలబడివుంది గాయత్రి.

నిటారుగా నిల్చున్న ఆమె వీపుమీద... ఆ కదలికకు వయారంగా నాట్యం చేస్తున్నట్టు చిన్నగా కదుల్తున్న ఆమె జడను ముగ్ధుడై చూస్తూ నిలబడ్డ సురేంద్రను కంగారుగా చూసింది, అప్పుడే వెనక్కితిరిగిన గాయత్రి. ఆమె తనని చూడటంతో బలవంతాన తన చూపును విడదీసుకుని... "గాయత్రీ !" అని పిలిచాడు. అతని పిలుపులో ఆనందం ఆవేదన ఒక్కసారిగా ప్రతిధ్వనించాయి.

ఆ పిలుపుకు ఆమె హృదయంలో తొలకరి జల్లు కురిసినట్టు హాయిగా పలికింది. అప్పటి వరకూ ఆనకట్ట కట్టిన శోకం కట్టలుదాటి ఒక్కసారిగా ప్రవహించింది.

అప్రయత్నంగా అతన్ని ఒక్క వుదుటున సమీపించి గట్టిగా కౌగలించుకుంది. ఆమె కన్నీళ్ళు అతన్ని భుజాన్ని తడిపేశాయి. సురేంద్ర చేతులు ఆమె భుజాలచుట్టూ మరింత బిగుసు కున్నాయి. అశాంతితో రగిలిపోతున్న అతని మనసు ఆమె సాన్నిహిత్యానికి స్వాంతనపరచినట్టు నిర్మలమయింది.

ఆమెను పొదివి పట్టుకుని తననుండి విడదీసి మొఖాన్ని రెండు చేతుల్తోను పట్టుకుని "ఏమిటి గాయత్రీ ఇది" అన్నాడు.

"సురేన్ ! నన్ను క్షమించు. నువ్వు లేకుండా నేను బ్రతకలేను" దుఃఖంతో గొంతు పూడుకుపోతుందామెకు.

ఆమె కన్నీళ్ళు తుడిచి "పిచ్చి గాయత్రీ ! నిన్ను క్షమించటం ఏమిటి ? నువ్వూ, నేనూ ఒకటయ్యాము. ఇంతకంటే మన జీవితాలకు ఏ భాగ్యాలూ వద్దు. నువ్వు నా సర్వస్వానివి గాయత్రీ !" అంటూ ఆమెను హృదయానికి హత్తుకున్నాడు.

అతని కంఠంలో ఉద్విగ్నతకు తన్మయు రాలైంది గాయత్రి. కొద్ది నిమిషాలపాటు అతని కౌగిలిలో కదలకుండా వుండిపోయింది. ఏదో కొత్త, అద్భుతమైన అనుభూతినిస్తున్నట్టు... ఆమెలో స్త్రీత్వం ఏరులా ప్రవహించింది. ఏ స్త్రీ అయినా జీవితంలో ఒక్కసారే అలాటి అనుభూతి పొందుతుంది. అతనిపట్ల గాయత్రి ప్రేమ మరింత అధికమైంది.

"రా గాయత్రీ ! కూర్చో." అన్నాడు మృదువుగా. ఆమె నీరసించిన మొఖాన్ని లోతుకు పోయిన కళ్ళనీ ఆవేదనతో చూస్తుండిపోయాడు సురేంద్ర.

"ఎంత చిక్కిపోయావు. మంజుల నీకు జ్వరమని చెప్పిన దగ్గర్నుంచి నిన్నొక్కసారి చూడాలని నా మనసెంత కొట్టుకుపోయిందో తెలుసా ! నేను రావటం నీకు అయిష్టమేమోనని సందేహిస్తూ ఆగిపోయాను" అతని కంఠంలో వేదన ధ్వనించింది.

"నాకు తెలుసు సురేన్ ! నువ్వు నా గురించి ఆలోచిస్తూ మనసు పాడు చేసుకుంటావని. నీ దగ్గర్నుంచి వెళ్ళిన తర్వాత రెండు రోజులు ఆలోచించాను. నా మనసు నీ కోసమే పరుగెడు తోంది. నిన్ను నా మనసు నుండి దూరం చేయటం సాధ్యం కాలేదు. నా మనసు నీకు తెలియజేయాలని ప్రయత్నించాను గానీ తీవ్రమైన జ్వరంవల్ల వీలుపడలేదు. ఇన్ని రోజులూ నా

ఆలోచనల నిండా నువ్వే! నిన్ను ఎప్పుడు చూస్తానా అని ఎంత ఆత్రుతపడ్డానో."

ఇద్దరి మనసుల్లోనూ సంతోషపు సవ్వడులు వినిపించాయి. జన్మజన్మల సాన్నిహిత్యాన్ని మేలు కొలిపే అనుభూతి కలుగుతోంది ఇద్దరిలోనూ. ఒకరిలోకి ఒకరు చూస్కుంటుంటే వారి పెదవులు చిరునవ్వుతో విచ్చుకుని, ఆ నవ్వు మరింత... మరింత పెద్దదై ... గట్టిగా ... హాయిగా నవ్వుతుంటే, హాలంతా వారి నవ్వుతో ప్రతి ధ్వనించింది.

కూనిరాగం తీసుకుంటూ లోనికిరాబోయిన మంజుల లోకాన్ని మర్చిపోయి నవ్వుకుంటున్న గాయత్రిని, సురేంద్రని చూసి ఆశ్చర్యంతో నోట మాట రాకుండా అయింది. అప్రయత్నంగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి ఇద్దరి మధ్య టీపాయ్ మీద కూర్చుని గట్టిగా నవ్వింది వాళ్ళతోపాటు.

అప్పటికి గాని వాళ్ళిద్దరూ యీ లోకంలో పడ్డేదు.

గాయత్రి మంజులని చూసి సిగ్గుతో తలొంచుకుంది. ఆమె మొఖంలో కాస్త ఉత్సాహం చూసి మంజుల చిరునవ్వు విసిరింది. వాళ్ళిద్దరిని అలా చూస్తుంటే చాలా ఆనందం కలిగింది ఆమెకు.

"సురేన్ ! వినోద్ ఇప్పుడే ఫోన్ చేశాడు. ఎల్లుండి సన్‌డే మనం మహాబలిపురం పిక్నిక్‌కి వెళ్తున్నాం!" అంది సంతోషంగా. "ఒ.కే. అయామ్ రెడీ" ఉత్సాహంగా. అరిచాడు సురేంద్ర.

గాయత్రి మౌనంగా వుండటం చూసి "గాయత్రి ఏమిటాలోచన. మనిద్దరం ఎప్పుడూ హాయిగా, ఆనందంగా ఇలాగే వుండాలి. సరదాగా అందరం కలిసి వెళ్దాం. ఇలాటి అనుభవాలు మన జీవితంలో మధురమైన జ్ఞాపకాలుగా నిలుపు కుందాం." అన్నాడు ప్రాధేయపూర్వకంగా సురేంద్ర. గాయత్రి తలెత్తి చూసింది. అతని కళ్ళల్లో ఆశకూ, ఆరాటానికి ఆమె మనసు తలొంచింది.

కారు వెనకసీట్లో మంజుల, వినోద్ కూర్చున్నారు. సురేంద్ర డ్రైవ్ చేస్తున్నాడు. అతని పక్కన గాయత్రి బిడియంగా కూర్చుంది.

అలా అతని పక్కన కూర్చుని ప్రయాణం చేస్తుంటే తమాషాగావుంది గాయత్రికి. లోక మంతా అద్భుతంగా అనిపించింది ఆమెకు. ఆమెలో హృదయస్పందన అధికమై, అతను తన వెలుగురేఖని, ఆ వెలుగురేఖ మార్గదర్శకంగా అపూర్వమైన అనుభూతిని, అందమైన జీవి తాన్ని యీ ప్రపంచంలో తనొక్కతే పొందబో తుందనే ఆనందంలో మునిగిపోయింది.

యుగయుగాల తన అన్వేషణ ఇంత మహత్త రంగా ఫలిస్తుందని ఎన్నడైనా అనుకుందా తను. తనలో యీ రాగోదయం అపూర్వమై అనంతమై నా సురేంద్ర ఒక్కడికే అంకితం కావాలి. లేకుంటే తన బ్రతుక్కి అర్థంలేదు.

స్టీరింగ్ వీల్ మీదనుంచి ఒకచేయి తీసేస్తూ గాయత్రి మునివేళ్ళని చేతిలోకి తీసుకున్నాడు సురేంద్ర. ఆలోచనా స్రవంతిలో మునిగిపోయిన ఆమె గుండె ఝల్లుమన్నట్టు ఒక్కసారిగా అతన్ని చూసింది. మొహంలో ఏదో మెరుపు తళుక్కు మంది.

అతని మొహంలో ఆ సంతోషపు వెలుగు ఆమెకెంతో సంతోషాన్ని కలిగించింది. అతని జీవితమంతా ఆ వెలుగు అతని మొహంలో నిలిచి పోయేలా చేయాలని ఆ క్షణంలో ఆమె నిశ్చ యించుకుని అతని చేతిని గట్టిగా పట్టుకుంది.

* * *

క్రీస్తుశకం ఆరవ శతాబ్దంలోని దక్షిణాత్య వాస్తు శిల్పాలను చాటిచూపే శిథిలాలను చూపిస్తూ అంది మంజుల.

"సురేన్ ! నువ్వేమో ఇంజినీరువి. విన్ని డాక్టరు. అయినా మీ ఇద్దరికీ హిస్టరీ గురించి ఏమైనా తెలుసునేమో చిన్న క్వశ్చన్ వేస్తాను. చెప్తారా ?!"

"బాబోయ్! నన్నడక్కు. హిస్టరీ అంటేనే నాకు తల తిరుగుతుంది. నాకూ ఏ ఘజినీనో, ఔరంగజేబునో అయి యుద్ధం చేయాలని పిస్తుంది. నా కవన్నీ గుర్తుచేయకు"— బెదిరి పోతూ అన్నాడు వినోద్.

"సరే! సురేన్ నువ్వు చెప్పు ! పెరిపింపుల్ పల్లవరాజుల్లోకెల్లా అగ్రగణ్యులైనవారు మహేంద్రవర్మ; నరసింహవర్మ. వీరిద్దరిలో ఎవరికాలంలో యీ మనోహరమైన శిల్పాలు, రాతి రథాలు నిర్మించబడ్డాయి !—."

సురేంద్రకు చాలా ఇంటరెస్టింగ్‌గా వుంది. వాటినిగురించి చాలా చదివాడు. తనలో ఒక విధమైన ఇన్‌స్పిరేషన్‌కోసం లేచి నిలబడి...సము న్నతమైన ఆ రాతి శిథిలాలను, అపురూపంగా తాకుతుంటే ఎన్నో శతాబ్దాలక్రితం పల్లవుల నాగరికతాచిహ్నాలుగా నిలిచిన ఆ రాతిశిలలు అతి శక్తివంతంగా కనిపించాయి. క్షణ భంగురమైన మానవుని జీవితసత్యాలను తెలియజేసే ఆ శిథి లాలు మాటలు చెప్పలేకపోయినా మనసులో భావాలు కలుగజేస్తాయి. ఆ శిలల గాంభీర్యాన్ని దర్శిస్తూ... మంజుల వాళ్ళవేపు చూసాడు ఒక్కసారి.

గాయత్రి ఆశ్చర్యంగా అతన్నేచూస్తూ నిల బడివుంది.

"మూడు శతాబ్దాల పల్లవుల పాలనలోనే యీ దక్షిణదేశసంస్కృతి రూపురేఖలు దిద్దు కుంది. పల్లవులలో మహేంద్రవర్మ, నరసింహ వర్మ ఇద్దరే ప్రముఖులు. యీ నరసింహవర్మ కాలంలోనే మహాబలిపురం నిర్మాణం సాగింది. ఇటు రండి అందరూ, ఒక్కొక్కటే చూసు కుంటూ వెళ్దాం, అంటూ ముందుకు నడిచాడు సురేంద్ర.

"ఇవిగో ! పల్లవశిల్ప రీతులలోకెల్లా ప్రశిద్ధమైన పాండవుల రథనిర్మాణాలు, ఆనాటి శిల్పులు రాతిలో ఎంత అద్భుతమైన ఆకృతుల్ని సృష్టించారో చూడండి. ఆ శిల్పులు కాలగతిలో కలిసిపోయినా వారి ప్రతిభ వారి ఔన్నత్యం యీ శిథిలాలలో చిరంజీవిగా నిల్చిపోయింది".

వినోద్, మంజుల, గాయత్రి అతనుచెప్పేది వింటూ పరిశీలనగా ఆ శిలా నిర్మాణాలను తిల కిస్తున్నారు. ఒక పెద్ద శిలమీద దుర్గాదేవి






# ఇంట్లో అమ్మ చేసిన కాఫీకి యోగ్యమైన బిరుదు.



ఇంట్లో వాళ్ళందరికీ ఏది మంచిది అన్నది అమ్మ కన్న మించి ఇంకెవరికి తెలుస్తుంది!

ఇక కాఫీ రుచి విషయం ఎత్తామంటే అమ్మదే తుది నిర్ణయం. ఆ నిర్ణయం పైనే అందరికీ గౌరవం.

అందుకు కారణం కాఫీ చేయడంలో అమ్మ అనుభవసారమే. అనుదినం అమ్మ చేతి కాఫీ తెచ్చే ఆ తొలి వెలుగుల తాజాదనం తిరుగులేనిది. దాన్ని తయారుచేసి అందించే అమ్మ చేయి అంతకన్న తిరుగులేనిది.

అది అమ్మ హస్తవాసి అందమూ, లేక ఆమె రహస్యమందమూ? చక్కని రుచీ,సువాసనా ఇచ్చే ఆ ఖచ్చితమైన రంగుకు కాఫీ విత్తుల్ని వేయించడం, ఆ పొడి కొట్టడం, వడకట్టడం...



ఇక చుక్క చుక్కగా కిందికిదిగే ఆ డికాక్షన్ చిక్కగా ముదురు రంగుతో నోరూరించే దాని సువాసన, నురుగు తేలుతూ, పొగలు కక్కుతూ అది అందించే ఆహ్వానం. అబ్బ! ఆ తాజాదనపు సువాసనకు జోహార్లు చెప్పాలి. నురగల బుడగలలో దోబూచులాడుతూ వచ్చే ఆ రుచికి జేజేలు పలకాలి.

ఆ మేళవింపులో పరిపూర్ణత సాధించడానికి ఎన్నేళ్ళ తపస్సు అవసరమైందో!

## సన్‌రైజ్. శ్రేష్ఠతకొక బిరుదు.

ఇంట్లో అమ్మ చేసే కాఫీ గురించి మాకు అన్నిటికన్నా ఎక్కువగా నచ్చిన విషయం అదిచ్చే ఆ "తొలి వెలుగుల తాజాదనపు" అనుభూతి.

అందుకే మా మిశ్రమానికి "సన్‌రైజ్" అన్న పేరు పెట్టాం. అదెంత మంచిదంటే, అత్యుత్తమమైన కాఫీకి అదొక యోగ్యమైన బిరుదు అని మా విశ్వాసం.

## అమ్మ పద్ధతే అచ్చంగా మా పద్ధతీనూ

అమ్మలాగే, కాఫీ గొప్ప అంతా 'సరైన' కాఫీ



విత్తుల ఎంపికలోనే ఉందన్న సంగతి మేమూ గుర్తించాం, అందుకే, చిక్కదనం, సువాసనా సరైన పాళ్లలో ఇచ్చే కాఫీ విత్తుల ఎంపికలో మా నిపుణులు శిక్షణ పొందారు.

అమ్మ చేసినట్టుగానే మేమూ కాఫీ విత్తుల్ని సరిగ్గా తగినంత మేరకు వేయిస్తాం. అలా ఆ చిక్కదనం, సువాసన, రంగు పరిపూర్ణ స్థాయిలో వచ్చేలా చేస్తాం.

సరిగ్గా అలాటి సమయంలో ఆ విత్తుల్ని అతి వేగంగా చల్లారుస్తాం. దానితో వాటి మంచితనం, సువాసన, రుచి, చిక్కదనం, రంగు అన్నీ అలా అందులో నిలిచిపోతాయి.

ఆ విత్తుల్ని నాజూగ్గా పొడికొట్టి, బ్రహ్మాండమైన పర్కొలేటర్లలో వడపోస్తాం. దీనితో ముదురు రంగుతోటి, ముగ్ధుల్ని చేసే సువాసనతోటి అతి చిక్కని డికాక్షన్ తయారవుతుంది.

అనుదినం ఉదయం పూట అమ్మ కాఫీ రుచికి నోచుకున్న వారందరికీ ఇది సుపరిచితమైందే.

## చిక్కని డికాక్షన్ నుంచి మళ్ళీ పొడి.

ఈ దశలో డికాక్షన్‌ను సుతారంగా ఆరబెట్టడం ద్వారా దాన్ని పొడి రూపంలోకి మార్చడం జరుగుతుంది. ఈ పద్ధతి వెనక 40 ఏళ్ళ పరిశోధన, అనుభవాల పరిపూర్ణత ఉంది.

ఇక బంగారు గోధుమ రంగులో ఉన్న ఆ పొడిలో తాజాదనం, సువాసన సమృద్ధిగా ఉంటాయి.

## ఆ తాజాదనాన్ని అలా నిలిపి ఉంచడం కోసం

ఆ పొడిని జాడీలలోకి, సంచీలలోకి నింపి, దాని సువాసన, రుచి, చిక్కదనం అన్నీ అందులోనే దాగి ఉండేలా సీలుచెయడం జరుగుతుంది. ఆ గుణాలన్నీ కలిసి ఏ వేళలోనైనా, ఏ జాములోనైనా



## ఆ సన్‌రైజ్ తొలివెలుగుల తాజాదనపు అనుభూతి మీకు నిస్సందేహంగా అందుతుంది

ఇక సన్‌రైజ్ అచ్చంగా ఇంట్లో అమ్మ పద్ధతి లోనే తయారవడం వల్ల, ఆ శ్రేష్ఠతకు ఇదొక యోగ్యమైన బిరుదే అనవచ్చు కదా మరి!




కొత్త

Nestlé

# సన్‌రైజ్

ఇన్‌స్టెంట్

## ఇంట్లో అమ్మ చేసిన కాఫీ అందించే ఆ తొలివెలుగుల తాజాదనపు అనుభూతి కోసం.

ఎంపిక చేసిన పట్టణాలలో మాత్రమే లభించును.

HTD-FSL-7910 TEL

## ఇది మేఘ సందేశమూ...

రౌద్రమూర్తిలా నిల్చునివుంటే... ఒక భక్తుడు ఆమెకు రక్తబలి సమర్పిస్తున్న దృశ్యంచూసిన మంజుల గుండెలో దడ పుట్టినట్లయింది. గాయత్రి పరిశీలనగా చూస్తోంది వాటిని.

"అబ్బ! ఏం భక్తోబాబూ! మరీ తలలు నరికి, బలలిస్తేతప్ప మోక్షంలేదా! బాబోయ్. వూహించుకుంటేనే భయంవేస్తుంది. ఇంకా నయం ఇప్పుడు నరబలి నిషేధించారు." తన అభిప్రాయం వెల్లడిచేసింది మంజుల.

సురేంద్ర నవ్వాడు ఆమె మాటలకు.

"మంజూ! అది వారితప్పుకాదు. ఆనాటి ఆచారం అది. పల్లవులలో కొంతమంది శైవ మతస్థులు. వాళ్ళు తీవ్రవాదులు కావటం వల్ల కొంతమంది వైష్ణవ మతస్థులు సాత్వికమైన తత్వాన్ని ప్రచారం చేయటం మొదలుపెట్టారు. తిరుపతి విప్రనారాయణ వంటి ఆళ్వారుల బోధల వల్ల సాత్విక భక్తిపట్ల ప్రజలు ఆకర్షితులౌతారు. అప్పట్నుంచి తిరుపతి పుణ్యక్షేత్రమై నిల్చింది.

అయితే ఆ శైవుల్ని, వైష్ణవులు ద్వేషిస్తే ... యీ వైష్ణవుల్ని బౌద్ధులు ద్వేషించేవాళ్ళు. యీ విధంగా మత వైషమ్యాలు తరాలుమారినా అప్పటికీ ఇప్పటికీ సమసిపోలేదు. అన్ని మతాలూ ఒకేశక్తి దగ్గరకు తీసుకుపోతాయని చెప్పేవారి క్కూడా పర మతం పట్ల నొసలు వెక్కిరిస్తూనే వుంటాయి. అయితే ఆ కాలంలో భక్తి అనేది వాళ్ల రక్తంలో వుండేది. ఇప్పుడలా కాదు. ఐదు రూపాయల టికెట్ కొనుక్కుని, రూపాయి కొబ్బరికాయ ధ్వజస్తంభం దగ్గర ఠాంమ్మని బద్దలుకొట్టి చిప్పలు సంచిలో వేసుకురావటం లోనే వుంది భక్తి! అందరూ ఒకేమార్గంలో నడుస్తున్నారు ... పదండి వెళ్దాం" — అని ముందుకు నడిచాడు సురేంద్ర.

ముగ్గురూ ఒకేసారి గలగలా నవ్వారు. కొబ్బరిబొండాలు అమ్ముతూ ఒక కుర్రాడు వాళ్లదగ్గరికి వచ్చాడు. నలుగురూ కొబ్బరినీళ్ళు త్రాగారు. మంజుల, వినోద్ అలా తిరిగొస్తామని వెళ్ళారు. గాయత్రిని తీసుకుని సముద్రపు ఒడ్డుకు వెళ్ళాడు సురేంద్ర.

సంతోషమో ... ఏమో ... పరవళ్ళు తొక్కుతూ కెరటాలు విసురుతున్న సాగరాన్ని చూడగానే సురేంద్ర మనసులో ఆనందం వెల్లువై పొంగింది.

గాయత్రి చేయిపట్టుకుని మెల్లగా ఇసుకలో పరుగెడుతూ తీరానికి చేరుకున్నాడు. ఎగసిపడే కెరటాలకు కాస్త దూరంగా ఇసుకలో కూర్చున్నారు ఇద్దరూ.

తన్మయత్వంలో కెరటాలకేసి దీక్ష గా చూస్తున్న గాయత్రిని ఆతిమార్దవంగా పిలిచాడు సురేంద్ర.

అతని పిలుపు ఆమె హృదయంలో తంత్రుల్ని శృతిచేసినట్టు కనురెప్పలు పైకెత్తి అతన్ని చూసింది.

ఆమె చేతిని తన చెంపకు రాసుకుంటూ "గాయత్రీ! నాకు చిన్నతనం నుంచి సముద్ర మంటే చాలా ఇష్టంగా వుంటుంది. సమస్యగా అనిపించే యీ జీవితం మీద ఆశ పుట్టించే సముద్రపు అందాలు ఎన్నిసార్లు, ఎంతసేపు చూసినా తనివితీరదు.

...కానీ ఇన్నిసార్లూ ఆ సాగరానికి కనిపించని అందాలు ఇప్పుడు నీ సౌందర్యంవల్లే కనిపిస్తున్నాయి. బంగారం రంగులో ఆకాశం.. ఏ ప్రియురాలినో కలుసుకోవాలనే ఆరాటంతో పరుగెత్తుకొచ్చే ఆ కెరటాలు... చుట్టూ మెత్తని ఇసుకతిన్నెలు... అక్కడక్కడా పొదలు చూస్తుంటే, నా మనసులో ఏదో అనిర్వచనీయమైన అనుభూతి కలుగుతుంది.

గాయత్రీ! యీరోజు నా మనసెంత ఆనందంగా వుందో చెప్పలేను. నీతో గడుపుతున్న ప్రతి క్షణం నా జీవిత పుటల్లో మధురానుభూతిగా గుర్తుంచుకుంటాను. నా జీవిత కాలంలో నిన్నెప్పుడూ దూరం చేసుకోను నీ తోడు లేకపోతే నా బ్రతుక్కి అందం వుండదు."

అతని హృదయంలో ఆవేదన పొంగింది.

అతని మాటలకి గాయత్రికి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. క్షణక్షణం తనగురించి అతనెంతగా ఆలోచిస్తున్నాడో...! అతనికి దూరంగా తను మాత్రం ఎలా వుంటుంది? అలా అని అతనికెలా నమ్మకం కలిగించేది?...

సురేంద్ర భుజంమీద తలవాల్చి, అతని చేతిమీద వేలితో గీతలు గీస్తూ... "సురేన్! నా గుండెలో గుడి కట్టి నిన్ను దేవుడిలా ప్రతిష్ఠించుకున్నాను. ప్రేమతో నిన్ను పూజిస్తున్నాను. నా ప్రాణానివి. నావాడివి" ఆమె కళ్ళ నుంచి రెండు కన్నీటిబొట్లు జలజలా రాలి అతని చేతిమీదపడ్డాయి.

తలెత్తి ఆమెను చూశాడు. ఆ కళ్ళల్లోని పవిత్రతకు, విశ్వాసానికి ముగ్ధుడయాడు. ఒక్కసారిగా ఆమెను దగ్గరకు తీసుకుని, ఆర్తితో ఆమె మెడవంపుల్లో గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు.

బాగా పొద్దుపోయింది. ఎంత సమయం గడిచిపోయిందో ఇద్దరికీ తెలియటంలేదు. ఆకాశంలో చీకట్లు కమ్ముకుంటున్నాయి.

దూరంగా మంజుల, వినోద్ చేయీ చేయీ పట్టుకుని ఇసుకలో పరుగెడుతూ వస్తున్నారు. దగ్గరికి రాగానే బాగా అలిసిపోయినట్టు కనిపించారు.

"ఎండలో బాగా తిరిగారా వినోద్ మీ ముఖాలు ఎర్రగా ఎలా కందిపోయాయో తెలుసా! పదండి. మొహాలు కడుక్కుని, టీలు త్రాగి బయల్దేరుదాం." అన్నాడు సురేంద్ర నవ్వుతూ.

"జస్ట్ వెయిట్! సురేన్! నేనింకా బోలెడు ఆల్చిప్పలు, గవ్వలు ఏరుకోవాలి." ఇసుకలో వంగుతూ అంది మంజుల.

చేసేదిలేక నవ్వుకుంటూ ఇసుకలో రకరకాల రంగులు గవ్వలు ఏరుతూ మంజులకు సహాయపడటంలో మునిగిపోయారు గాయత్రి, సురేంద్ర.

వినోద్ వాళ్ళని చూసి నవ్వుతూ నిలబడిపోయాడు.

**(ఇంకా ఉంది)**

ఇటీవల జరిగిన మదరాసు తెలుగు సంగీత అకాడెమీ ప్రారంభోత్సవం సందర్భంలో తీసిన చిత్రం. అకాడెమీ సంస్థాపకులు శ్రీ టి. వి. కె. శాస్త్రి, శ్రీ రమణయ్యరాజా, అధ్యక్షులు శ్రీ బాలమురళీకృష్ణ, శ్రీ కోలంక వెంకటరాజు, శ్రీమతి డి. కె. పట్టమ్మాళ్, శ్రీమతి ఎస్. జానకి, శ్రీ చిట్టిబాబుగార్లని చిత్రంలో చూడవచ్చు.






## స్టార్ ఏక్టర్ !

'మీరు స్టార్ కావాలనుకుంటున్నారా ? ఏక్టర్ కావాలనుకుంటున్నారా ?'— ఈ ప్రశ్నకు ఇటీవల ఒక ఇంటర్వ్యూలో కమలహాసన్ సమాధానం. ''నేను హిందీ చిత్రరంగంలో ప్రవేశించి నప్పుడు అమితాబ్ బచ్చన్‌లాగా దేశంలో నలుమూలలా మారుమోగే పేరూ, ప్రఖ్యాతీ సంపాదించాలనే కోరిక మనసులో లేక పోలేదు అయితే ఏ రోజు నేను ఇటు స్టార్‌గా— అటు ఏక్టర్‌గా పేరు సంపాదించి స్టార్ ఏక్టర్ అనిపించుకుంటానో ఆ రోజే నా కృషి సఫలమయిందని భావిస్తాను''—

టాలెంటుతోపాటు పట్టుదల, కృషిగల కమలహాసన్ హిందీలో తొలిచిత్రంతోనే స్టార్ అనిపించుకున్నాడు ఇప్పుడు తమిళచిత్రం 'మూండ్రామ్ పిరై' (తెలుగులో 'వసంతకోకిల' పేరుతో డబ్ చేశారు) చిత్రంలో నటనకు కమలహాసన్ జాతీయస్థాయిలో ఉత్తమనటుడు అవార్డు అందుకున్నాడు గనుక ఏక్టర్‌కూడా అనిపించుకున్నట్లే— ఇంత పేరూ, ప్రఖ్యాతీ ఉన్నా 'నా అంతవాడు లేడు' అని విర్రవీగేతత్వం లేదు కమల్‌కి—

'ఏక్ దూజే కేలియే' ఘన విజయం సాధించిన కొత్తలో 'కమలహాసన్ అమితాబ్‌ని కూడా అధిగమించిపోతాడు'— అని కొందరి కామెంట్స్ — దీనికి కమలహాసన్ ఇలా అన్నాడు. ''అమితాబ్ బచ్చన్‌తో పోటీ చెయ్యడానికి నేనెంత? అమితాబ్ బచ్చన్ బహుముఖ ప్రజ్ఞగల జీనియస్. అమితాబ్‌తో పోటీ చెయ్యగల మరో నటుడు ఇప్పుడు లేడు. ఇకముందు రాబోడు ఏ. బి. (అమితాబ్ బచ్చన్) ఎప్పుడూ ఏ. బీ. యే మిగతా నటులంతా ఎక్స్. వై. జెడ్‌లు మాత్రమే''—

కమలహాసన్ నటించిన 'జరాసీ జిందగీ' (ఆకలిరాజ్యం) చిత్రం పరాజయం చెందడంతో నిన్న కమల్‌హాసన్‌ని ఆకాశానికెత్తిన వాళ్లే కొందరు 'అయిపోయింది కమల్ పని'— అంటున్నారు ఇది ఇండస్ట్రీలో మామూలే. ప్రస్తుతం కమల్‌హాసన్ నటిస్తున్న చిత్రాలలో 'యాద్‌గార్' (ఎవరికివారే యమునాతీరే), 'సాగర్' పూర్తయి విడుదలైనప్పుడు కమలహాసన్ స్టార్ ఏక్టర్‌గా స్థిరమైన స్థానం ఏర్పరచుకుంటాడని సినీ అభిజ్ఞవర్గాల అంచనా. స్టార్ ఏక్టర్ కావాలనే కోరికతోపాటు కమల్ హాసన్‌కి మరో కోరిక కూడా ఉంది. ఎప్పటికైనా జయాబచ్చన్ (భాదురీ) సరసన నటించాలని ఆ కోరిక. జయాభాదురీబచ్చన్ చిత్రరంగం నుంచి పూర్తిగా విరమించుకున్నదని తెలిసీ, తన కోరిక ఎప్పటికైనా తీరుతుందేమోనని ఆశగా ఎదురు చూస్తున్న కమలహాసన్‌కి బెట్ 'స్ విష్ బెస్ట్ ఆఫ్ లక్

## స్టార్ - క్రికెటర్ !

అప్పుడప్పుడు సరదా కోసం, ఏదైనా సహాయ నిధి కోసం సినీస్టార్స్ అంతా కలిసి క్రికెట్ ఆడుతుంటారు. అయితే అసలు క్రికెట్ ఆటగాళ్ళు సరదా కోసమో, స్టార్స్ కావాలనో సినిమాల్లో నటించడం ఎప్పుడో గానీ జరగదు.

కొన్నేళ్ల క్రిందట క్రికెటర్ సలీందురానీ 'చరిత్ర' అనే హిందీ చిత్రంలో హీరోగా నటించాడు. అయితే ఆ చిత్రం బాక్సాఫీస్ వద్ద 'క్లీన్ బౌల్డ్' కావడంతో సలీందురానీ స్టార్ కాలేకపోయాడు

ఇటీవల మన గ్రేట్ గవాస్కర్ 'సావ్‌లీ ప్రేమాచీ' అనే మరాఠీ చిత్రంలో ముఖ్యపాత్ర ధరించి సినీరంగ ప్రవేశం చేశాడు ఆ తర్వాత 'ఝుకోల్' అనే మరాఠీ చిత్రంలో కూడా గవాస్కర్ నటించాడు. ఆ తర్వాత చాలామంది నిర్మాతలు గవాస్కర్‌ని బుక్ చెయ్యాలని ముందుకి వచ్చారుగానీ గవాస్కర్ ఒప్పుకోలేదు. స్టార్‌ని కావాలన్న కోరిక అంతగా లేదేమో సునీల్‌కి —

ఇప్పుడు హిందీ చిత్రరంగంలో హీరోగా ప్రవేశించిన తాజా క్రికెటర్ సందీప్ పాటిల్ ఈ చిత్రం పేరు 'కభీ అజనబీ' నిర్మాత దర్శకుడు విజయ్‌సింగ్ ఈ చిత్రంలో కథానాయకుడు అప్పుడే పైకి వస్తున్న క్రికెట్ ఆటగాడు అందుకని అసలు క్రికెటర్‌నే హీరోగా చేస్తే సహజంగానూ, సరికొత్తగానూ ఉంటుందని విజయ్‌సింగ్ సందీప్‌పాటిల్‌ని బుక్ చేశాడట ఈ చిత్రంలో సందీప్ సరసన పూనమ్‌ధిల్లోన్ నాయికగా నటిస్తోంది

''ఇంతమంది కుర్రకారు తారా సంతానం ఉన్నారు — వాళ్లలో ఎవరైనా హీరోగా తీసుకుంటే చిత్రం సులువుగా అమ్ముడుపోతుంది సందీప్‌ని హీరోగా పెట్టుకుంటే చాలా రిస్క్''— అంటూ డిస్ట్రిబ్యూటర్స్ విజయ్‌సింగ్‌ని హెచ్చరించారట. అయితే విజయ్‌సింగ్ ఒప్పుకోలేదు.

''సన్నీ, సునీల్ ఆనంద్, మోహనీష్‌బహల్ లాంటి తారాపుత్రులు ఎవరయినా వాళ్ల అమ్మనాన్నల పేరు ప్రఖ్యాతులనుబట్టి వాళ్లకి పేరూ ప్రచారం వస్తాయి సందీప్‌పాటిల్‌కి క్రికెటర్‌గా ఎంతో పేరుంది అది చాలదా ?'' అన్నాడు విజయ్‌సింగ్. సందీప్ పాటిల్ క్రికెట్‌లోలాగే నటుడుగా కూడా 'నాటవుట్ స్టార్' అవుతాడని విజయ్‌సింగ్ నమ్మకం. అలాగే నటనలో కూడా తన ప్రత్యేకత చూపించగలనని సందీప్ పాటిల్ నమ్మకం బెట్ 'స్ వెయిట్ అండ్ సీ...

## మరో హక్కుల చిక్కు !

భాగ్యరాజ్ తమిళ చిత్రం 'తూరల్ నిన్ను పోచ్చి' (తెలుగులో పెళ్లిచూపులు) హక్కుల చిక్కుల్లో పడింది. ఈ చిత్రం హిందీలో నిర్మించాలని ఒక బొంబాయి నిర్మాత తమిళ చిత్ర నిర్మాత వద్ద హక్కులు కొన్నాడు. ఇంతలో మరో బొంబాయి నిర్మాత భాగ్యరాజ్ వద్ద అదే చిత్రం హిందీలో నిర్మించడానికి హక్కులు కొన్నాడు. ఇప్పుడు హక్కులు నావంటే నావని బొంబాయి నిర్మాతలు ఇద్దరూ ఘర్షణ పడుతున్నారు. బొంబాయి నిర్మాతలు మద్రాసు చిత్రాల హక్కులు కొనడానికి ముందు అసలు అమ్మడానికి ఎవరికి సరైన హక్కులున్నాయో తెలుసుకొని మరీ కొనడం మంచిదని . బెట్ దెమ్ రియలైజ్.











# మహిమలను అంగీకరించడం శాస్త్రీయమేనా?

డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు

అనంతంగా కొనసాగిపోయే మానవజాతి వికాసంలో విజ్ఞానశాస్త్ర పరిణామం అత్యంత ప్రతిభావంతమైందన్న సత్యాన్ని అందరూ అంగీకరిస్తారు. భూమి గుండ్రంగా ఉందని చెప్పినప్పుడు గేలిచేసిన అహంభావమే నేడు నిజాన్ని ఒప్పుకుంటున్నది. సూర్యుని చుట్టూ భూమి తిరుగుతున్నదని తెలియజేసినప్పుడు పరిహసించిన అజ్ఞానమే నేడు వాస్తవాన్ని గుర్తిస్తున్నది. మనిషి కోతినుంచి క్రమేణా పరిణతి పొందుతూ ఆవిర్భవించాడని అన్నందుకు గుర్రుమన్న వానర స్వభావమే నేడు విజ్ఞాన శాస్త్రాన్ని ఆదరిస్తున్నది. అనంతమైన ప్రకృతిని అర్థం చేసుకోవడానికి చరిత్ర, సాహిత్యం, శాస్త్రం — ఇలాంటి వెన్నో వెలుగులోకి వచ్చాయని తెలుసుకోవడమే శాస్త్రీయత. ఏ విషయంలోనైనా పిడివాదం మంచిది కాదు. విజ్ఞానం అనేది ఎప్పటికప్పుడు మారుతూ ఉంటుందని, ప్రకృతి ప్రభావ ఫలితంగా కాలానుగుణ్యంగా ఎన్నోమార్పులు అనివార్యంగా అనంతంగా వస్తూనే ఉంటాయని తెలుసుకొని, ప్రతిక్షణం సత్యం కోసం అన్వేషించాలి. అదే విశిష్టమైన మనస్తత్వం. ఆ తత్త్వంలో మాత్రమే నూటికి నూరుపాళ్ల శాస్త్రీయత ఉంటుంది. అంతేకాని కేవలం పదార్థ విశ్లేషణా పరిజ్ఞానమే విజ్ఞానమని భ్రమపడరాదు. ఈ విశ్లేషణకు కూడ అంతం ఉండదని గుర్తించుకోవాలి. అర్థంలేని ప్రకృతి విశ్లేషణ అజ్ఞానమనే పిలువబడుతుందని ఎర్విన్ చార్ గాఫ్ అభిప్రాయపడడం సమంజసమైనదే.

ముఖ్యంగా ఈనాటి సైన్స్‌కు మతపరమైన భావనకు మొదటినుంచీ చుక్కెదురే. ఈ రెండింటి మధ్యా ఎక్కడో తప్పనిస్తే పొంతన అనేది సాధారణంగా కనిపించదు. మతంలో విశ్వాసం ప్రధాన పాత్రధారి. అయితే సైన్స్‌లో విశ్వజనీనంగా నమ్మశక్యమైన ఆధారం కావాలి. కారణం తెలియకపోయినా జరిగిన కార్యాన్ని కాదనడం శాస్త్రీయమని అనిపించుకొంటుందా అని మత ప్రవక్తలు కొందరంటారు. ఈ తెలియని కారణం దివ్యశక్తి ప్రభావమని వారి భావం. అది నిజమేనని అంగీకరించవలసి వస్తుంది. ఎందుకంటే నిర్దుష్ట ప్రాతిపదికలను ఆధారంగా చేసుకొని హేతుబద్ధంగా సమస్యను పరిశీలించినా సైన్స్‌కు అందుబాటులో లేని విషయాలు ఎన్నో ఉన్నాయన్న మాట వాస్తవ దూరమైనది కాదు. ముఖ్యంగా మత ప్రవక్తలు చూపే మహిమలు, మహత్తులు సైన్స్‌కు అందుబాటులో లేవు. అన్ని మతాలలోనూ



పోర్చుగల్‌లోని లడెయిర్ దో ఫిన్‌హెరోకి చెందిన మరీయాదాకోన్‌సెయికోవ్ అద్భుతాలు చేసి చూపించగలరుట. రోగాలు నయంచేసుకోవటానికి ఆమెని ఎందరో వచ్చి చూసి వెడుతూ ఉంటారు. ఆమె తనకి ఏసుక్రీస్తు, మేరీమాత కనిపించారని అంటారు. ఆమె నుదురుమీద శిలువ చిహ్నం కనపడుతుందని కొందరంటారు. ఆమె తరుచు స్వర్గ, నరకలోకాలకి వెళ్లి వస్తూ ఉంటారని కొందరి నమ్మకం...

ఈ విధమైన మహత్తులు, మహిమలు ఉండడం విశేషం. ప్రపంచవ్యాప్తంగా మనుష్యుల సంస్కృతులు భిన్న భిన్నంగా ఉన్నా మానవభావంమాత్రం ఒకే విధంగా ఉండడం ఏకోదర జన్యుసంబంధ బాంధవ్యాన్ని సూచిస్తుంది. ఆ జన్యు అనుబంధం నిమ్న జాతి జంతువులనుంచే అనూచానంగా పరిణామపరంగా సంక్రమించి ఉంటుందన్నా అతిశయోక్తి కాదు. అందువల్లే వానరుడు నరుడుగా వెలువడ్డాడని డార్విన్ అనగలిగాడు!

మహిమలు చిత్రాతిచిత్రంగా ఉంటాయి. తల బద్దలుకొట్టుకొన్నా అర్థంకావు. చనిపోయిన ఏసుక్రీస్తు మళ్లీ నడచివచ్చినట్లు బైబిల్ కథనం. శిలువ రక్తంలో తడిపిన రకరకాలరోగులకు స్వస్థత చేకూరడం మరీ విచిత్రం! మహమ్మదు చెట్టుక్రింద కూర్చొంటే ద్రాక్షపళ్లు అవంతట అవే నడచివచ్చేవట! రాఘవేంద్రా అని మూగవాడు అరచినట్లు

## ఇద్దరూ జంతు శాస్త్రజ్ఞులే!



డా. జయదేవ్‌బాబు



డా. రమేష్‌బాబు

ఈ వ్యాస రచయిత, దానికి బొమ్మలు వేసిన చిత్రకారుడు ఇద్దరూ జంతు శాస్త్రంలో పరిశోధన చేసి డాక్టరేట్ (పి. హెచ్. డి.) తీసుకున్నవారే!

రచయితగా డా. గుమ్మనూరు రమేష్‌బాబు, కార్టూన్ చిత్ర రచయితగా డా. ఎస్. జయదేవ్‌బాబు పాఠకులకి సుపరిచితులు.

డా. రమేష్‌బాబు ప్రస్తుతం తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని జంతుశాస్త్ర విభాగంలో ఉన్నారు. డా. జయదేవ్ మదరాసులో సర్ త్యాగరాయ కళాశాలలోని పోస్టుగ్రాడ్యుయేట్ విభాగంలో ప్రొఫెసర్‌గా ఉద్యోగం చేస్తున్నారు. —సం.

మంత్రాలయ మహత్యం. పుట్టపర్తి సత్య సాయి బాబాను తలచుకొంటే సాంబ్రాణిపొగలు, విభూతి వాసనలు కొట్టొచ్చినట్లు గదంతా నిండుకొంటాయని ఒక వార్త! ఇలాంటివి రకరకాలు, ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. ఈ మహిమలు కట్టుకథలు కావు. వాటిని కళ్లారాచూచిన సాక్ష్యులున్నారు. శాస్త్ర వేత్తలున్నారు. అయితే వాటిని వివరించడమనేది అంత త్వరగా తేలిపోయే సమస్యకాదు. అసాధ్యమని చెప్పలేకపోయినా కష్టసాధ్యంతో కూడుకొన్న పని.

బైబిల్ తలమీదపెట్టి మెళ్లో సిలువవేసి తలబరు వెక్కిందా ? కళ్లు బైర్లు క్రమ్ముతున్నాయా ? అని అడిగినవెంటనే దెయ్యం ఒంటిమీదికి రావడం, ఎప్పుడు ఎక్కడ ఎలా ఎందుకు పట్టింది సవిస్తరంగా తెలియజేయడం నేను కళ్లారా చూచిన దృశ్యం. దెయ్యం ఒంటిమీద ఉన్నప్పుడు



ప్రాదెపియో ఎక్కడ ఉంటే అక్కడ కొన్ని అద్భుతాలు జరుగుతాయట. ఆయన దేహం మీదనే 'దైవచిహ్న' లనతగినవి కొన్ని కనపడుతూ ఉంటాయట. అందుచేత ఆయన ఒక ''సెయింట్'' అని నిర్ణయిస్తున్నారుట...
[ఈ ఫొటో న్యూ సయింటిస్ట్‌లో పడినది]

బైబిల్ సాహిత్యంతో నిండిఉన్న పుస్తకాలతో ఎడా పెడా కొట్టడం, కాస్సేపటికి ఆ దెయ్యం వదలిపోవడం జరిగింది. మెలుకువవచ్చాక బాగాకొట్టామే! దెబ్బలు తగిలాయా ? అని అడిగితే నా కేమీ తెలియదని బదులుపలకడం ఆశ్చర్యాన్ని కలిగించింది. ఇక్కడ కేవలం బైబిల్‌మీద ఉన్న విశ్వాసం మాత్రమే రంగ ప్రవేశం చేసింది. అంతకుమించీ వేరే ఏ ఇతర అంశాలూ పరిగణనలోకి రావు. మరి దీనికి సైన్స్ ఏ వివరణను ఇస్తుంది ? ఇలాంటివి ఎన్నో దృష్టాంతాలు ప్రపంచ పర్యంతంగా ఉన్నాయి. అన్నింటినీ వివరించడం సాధ్యపడదు.

రామకృష్ణపరమహంసకు పూనకం రావడం హిస్టీరియా అని మానసిక సంబంధమైన వ్యాధివల్ల అని కొందరు సైకియాట్రిస్టులు వ్యాఖ్యానించడం సాహసం. చదువురాని ఒక వ్యక్తికి పూనకమొచ్చి




అనర్గళంగా ఇంగ్లీషు మాట్లాడడం నాకు తెలిసిన సంఘటన. సైన్స్ విభాగాలైన సైకాలజీ, సైకోట్రానిక్స్, టెలిపతీ, క్లైయిర్ వోయిన్స్, హిప్నాసిస్ కొంతవరకు కొన్ని సంఘటనలను మాత్రమే వివరించవచ్చు. అన్నింటినీ వివరించడం సాధ్యం కాదు. అందువల్లనే శాస్త్ర చర్చలో అసందర్భమనిపించినా" అధిభౌతిక సిద్ధాంతాలు అనివార్యమై కూర్చొంటాయని కార్ల్‌పాపర్ అనడం. మనశ్శక్తిని ఆత్మశక్తిని గురించి ఇటీవల సైన్స్ బాగా తరచి తరచి చర్చిస్తున్నది. ప్రకృతి శక్తైనా ఈశ్వర శక్తైనా విశ్వమంతా అజ్ఞాత శక్తి నిండి ఉన్నదన్న వాదంతో అందరూ అంగీకరిస్తున్నారు. సైకోట్రానిక్ శక్తి అని, బయోప్లాస్మిక్ శక్తి అని శాస్త్రీయపరమైన నామకరణాలు కూడ చేయడం జరిగింది. జీవిలో అంతర్గతంగా ఉండే శక్తికి, బయటిశక్తికి మధ్య ఉండే ఆకర్షణ శక్తి యొక్క స్థాయినిబట్టే, శక్తులపరంగా కొనసాగే వికిరణ సామర్థ్యాన్నిబట్టి—మహిమలూ మహత్తులూ ఆధారపడి ఉంటాయని వివరణను ఇచ్చుకొన్నా, ఈ వివరణే సరియైనదని చెప్పడం మళ్లీ శాస్త్రీయమనిపించుకోదు. ఇంకా తెలుసుకోవలసింది చాల ఉందని అనుకోవచ్చు.

ఏది ఏమైనా శాస్త్రపరమైన విజ్ఞానానికిగాని, మతపరమైన విశ్వాసానికిగాని – సాక్ష్యం మాత్రమే కాదు, హేతుబద్ధమైన ఆధారం కూడ ఉంటేనే తప్ప పరిణితి ఉండదని తెలుసుకోవాలి. ★





# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "కళ్యాణ వీణ"లో తీరిన సరదా!

రాయుడు (నూతన్‌ప్రసాద్) చెట్టు నీడన మంచం మీద కూర్చొని మందుకొడుతున్నాడు. అతని వెన్ను పడుతున్న పోలాయ్ "దొరా! పాయసంలో షుగరూ, పడుచుపిల్లలో పొగరూ ఎంత ఎక్కువగా ఉంటే అంత రుచని తమరొకసారన్నారు. గుర్తుందా, దొరా?" అన్నాడు.

"నీకాసందేహ మిప్పుడెందుకొచ్చింది?" అన్నాడు రాయుడు.

ఇంతలో రాజీ (అరుణ) అక్కడికి రావడం చూసి, "దొరా! ఎతుకుతున్న తీగ కాలికి తగిలింది," అన్నాడు పోలాయ్.

తల మీది మోపును కిందపడేసి, వొయ్యారంగా నిలుచొనున్న రాజీని చూస్తూ, "ఏంటా యెదవ పోలిక? నా పూర్వజన్మ సుకృతం పసువులంగా కట్టుకుని పక్కకొచ్చి నిల్చుంది... ఒరేయ్! నువ్వా కుప్ప చాటుకెళ్లి కాసేపు మాటాడకుండా కూర్చో!" అన్నాడు రాయుడు. పోలాయ్ వెళ్ళిపోగానే "అబ్బా! అబ్బా! ఈ వేళ పొద్దునలేచి ఎవరి మొహం చూశానో... ఆహా!" అంటూ మోపులోని కొంత గడ్డిని మంచంమీద వేసి, మందు మరో గుక్కెడు తాగాడు రాయుడు.

రాజీ పక్కకు వెళ్ళి, దురదగుంటాకు మొక్క తీసుకొచ్చి తమాషాగా ఆడించింది.

"ఆహా! నువ్వు రంభవి. నేను దేవేంద్రుడ్ని. ఈ తోటే స్వర్గమనుకో. రా!" అంటూ రాయుడు; రాజీ చెయ్యి పట్టుకోబోగా ఆమె అతన్ని మంచంమీద తోసింది. దానికి రాయుడు "ఆ... సరసమంటే అలా ఉండాలి," అంటూ ఉప్పొంగిపోయాడు.

రాజీ మంచం మీద కూర్చొని, "తొందర పడకండి. మీ సరదా నేను తీరుస్తాగా?" అంటూ దురదగొండి మొక్కను రాయుడి ముఖానికి, చేతులకు సుతారంగా రాస్తూ, గిలిగింతలు పెట్టింది

"అబ్బా! అబ్బా! ఆహా! ఆహా!" అని లొట్టలు వేస్తున్న రాయుడు కాస్సేపటికి ఒళ్ళంతా దురదలు రేగడంతో "అమ్మా! అమ్మా! ఏమిటీ దురద?" అన్నాడు.

దురదగుంటాకును మళ్ళీ పూస్తూ, "దురద కాదు; సరదా... పూర్తిగా తీరాలిగా?" అంది రాజీ.

"రాజీ! ఆపు! నేనిక తట్టుకోలేను," అని రాయుడు ఒళ్ళంతా గోక్కుంటూ, మంచం మీద నుండి దిగి, "ముందిక్కడ్నుంచి వెళ్ళు!" అన్నాడు.

"చూడూ... ఇంకెప్పుడైనా ఇలాంటి యెధవ వేషాలేశావో— దురదగొండితో కాదు; బురదగుంటలో తొక్కుతాను. జాగ్రత్త!" అంటూ రాజీ వెళ్ళిపోయింది,

తిక్క కుదిరిన రాయుడు పోలాయ్ కోసం ఇటు అటు చూశాడు.

సుమన్, అరుణ కవిత, నూతన్‌ప్రసాద్, సుధాకర్, అన్నపూర్ణ, శుభ, రమణమూర్తి, సిహెచ్. కృష్ణమూర్తి నటించిన మల్లెమాల క్రియేషన్స్ "కల్యాణవీణ" చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు మల్లెమాల రాశారు. గిరిధర్ దర్శకత్వంలో ఎం. ఎస్. రెడ్డి నిర్మాత.

'సిరిపురం మొనగాడు'లో జయప్రద



## అభినయా మూవీస్ చిత్రం

"మేనెలలోనే షూటింగ్ దాదాపు పూర్తయిపోతుంది;" అన్నారు ఏలూరి దుర్గాప్రసాద్. ఈయనసమర్పించే పై సంస్థ చిత్రం షూటింగ్ మద్రాసులో నిర్విరామంగా జరుగుతోంది. సత్యనారాయణ, రంగనాథ్, నూతన్‌ప్రసాద్, రాజేష్, బాలాజీ, రమణమూర్తి, వీరభద్రరావు, జీవా, చిట్టిబాబు, తులసి, అత్తిలి లక్ష్మి, కాంచన, పుష్పలత, రాగిణి పాల్గొంటున్నారు. ఆత్రేయ మాటలు, వేటూరి పాటలు రాశారు. చక్రవర్తి, కె. ఎస్. ప్రసాద్, రంగారావు, గౌతమ్‌రాజు, శేషు, ప్రసాద్, బి. ఎస్. రెడ్డి. పరుచూరి సాంబశివరావు, శివరాజు, పి. శివాజీ, వై.రామకృష్ణారెడ్డి తెరవెనుక కృషిచేస్తున్నారు. జూన్‌లో విడుదల చేయదలచినట్లు నిర్మాతలు జె. అక్కిరెడ్డి, జి. తిరుపతిరావు తెలిపారు. ఈ చిత్రానికి ఎస్. రవీంద్రరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలను వహిస్తున్నారు.



సుహాసిని 'ముక్కుపుడక'

## పూర్తయిన మాదాల "స్వరాజ్యం"

"మన పెద్దలు ఎంతో శ్రమపడి సాధించిన స్వరాజ్యం నేడు కొందరికే హక్కు భుక్తమై ఉంది స్వరాజ్యం అందరికీ సుస్వరాజ్యం కావాలి. సగటు మనిషి మన దేశపు స్వరాజ్య విలువను, తన జీవన హక్కును అర్థం చేసుకొని బతకాలి. నేడు అస్తవ్యస్తంగా ఉన్న సమాజం మారి, సామరస్యం నెలకొనాలి. సామాన్యుని సమస్యలకు ఒక పరిష్కార మార్గం లభించాలి. ఈ లక్ష్యంతోనే ప్రజాజీవితాలలోని ఘటనలకు, సంఘటనలకు రూపకల్పన చేయగలిగాను. నా చిత్రాలన్నిటిలోకీ ఇది భారీ చిత్రం. సమస్యలు, వాటికి పరిష్కారమార్గాలే కాక చక్కని నృత్యాలున్నాయి. చక్రవర్తి శ్రావ్యమైన సంగీతంతోపాటు అప్పల అప్పారావు పాత్రతో సున్నితమైన హాస్యాన్ని అందజేశారు," అన్నారు తెలుగు చిత్ర జగతిలో ఒక విప్లవాత్మకమైన పరిణామానికి కర్త అయిన మాదాల రంగారావు. మే 1, 2 తేదీలలో ఖమ్మం వద్ద పతాక సన్నివేశాల చిత్రీకరణతో నవతరం ప్రొడక్షన్స్ "స్వరాజ్యం" చిత్రం షూటింగ్ పూర్తయింది. ముస్లిమ్ యువకుడుగా అద్భుతంగా నటించిన మురళీమోహన్ సరసన కె. విజయ, మాదాల రంగారావు సరసన శ్యామలగౌరి నాయికలు ఇంకా వంకాయల, జీవా, ఎం పి. ప్రసాద్, నర్రా వెంకటేశ్వరరావు, చలపతిరావు, ఓమేశ్వరరావు, నల్లూరి వెంకటేశ్వరరావు, బాబూరావు, అత్తిలి లక్ష్మి, కల్పనారాయ్, పుష్పకుమారి, నవనటుడు శశిమోహన్ పాత్రధారులు. ఆర్ రామారావు ఛాయతో 'నవతరం' దర్శకత్వం నెరపిన ఈ చిత్రంలో కాగడా శర్మ సంభాషణలు అదనపు ఆకర్షణ.



"మగ మహారాజు"లో జయమాలిని



కవిత, మోహన్‌బాబు "మూగవాని పగ"

# సినిమా

## జూన్‌లో "మానసవీణ"

"కొందరు కొత్త తారలను పరిచయం చేస్తున్నాం," అన్నారు రామా అరంగణ్ణల్. ఈయన లోగడ "బొమ్మా-బొరుసా, అంతులేని కథ, మరోచరిత్ర" చిత్రాలను నిర్మించారు. ఇప్పుడీయన కథ రాసి, నిర్మించే ఆండాళ్ కంబైన్స్ "మానసవీణ" చిత్రానికి జూన్ మొదటి వారంలో పాటలు రికార్డు చేయబడతాయి. ఆత్రేయ మాటలు, పాటలు రాస్తున్నారు. ఎం. ఎస్. విశ్వనాథన్ సంగీత దర్శకుడు. "జూన్ చివరివారం నుంచి విశాఖపట్టణం, విజయనగరం, అరకులోయ ప్రాంతాలలో షూటింగ్ జరుగుతుంది," అన్నారు ఈ చిత్ర దర్శకుడు రేలంగి నరసింహారావు.

## శోభన్‌బాబు చిత్రానికి కొత్త దర్శకుడు

"హిందీలో హిట్ అయిన 'అవతార్' చిత్రంలో రాజేష్‌ఖన్నా పాత్రను శోభన్‌బాబు ధరిస్తారు," అన్నారు తారకప్రభు ఫిలిమ్స్‌వారి చిత్రానికి తొలిసారిగా దర్శకత్వం నెఱపే రమణబాబు. ఈయన దాసరివద్ద పలు చిత్రాలకు సహకార, సహ దర్శకుడుగా పనిచేశారు. ['అవతార్' చిత్రాన్ని పద్మాలయ సంస్థ శివాజీగణేశన్‌తో సి. వి. రాజేంద్రన్ దర్శకత్వంలో తమిళంలో నిర్మిస్తుంది.]

"ఆ సీటు టికెట్ కూడా అతనే కొన్నాట్ట!"



చరిత చిత్ర

THE GAINT OF A MOVIE

జూన్

3

విడుదల!
ఉదయం ఆటతో

# ఇద్దరు కిలాడీలు

నిర్మాత: తమ్మారెడ్డి.వి.కె + స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: రేలంగి నరసింహారావు

సంగీతం: జాయ్ కెమెరా: కోటేశ్వరరావు

నైజాం: ద్వారకా తిరుమల సీడెడ్: భాస్కర్ పిక్చర్స్



లక్ష్మీ చిత్ర



"త్రివేణీ సంగమం"లో పవిత్రశ్రీ, సుమన్

## "రోజులు మారాయి"లో మనుషులు మారాలి

గుడిలోనికి పోబోతున్న పూజారి (సాక్షి రంగారావు)ని ఎలమంద (గుమ్మడి) చూశాడు. "అయ్యా! పూజారయ్యా! డబ్బున్నోళ్ళలోనే దేవుడుంటాడని సెప్పావ్ కదా? యియ్యాల సదువుకున్నోళ్లలో దేవుణ్ని సూసేనయ్యా!"

పూజారి గుడ్లు మిటకరించాడు. "ఏం జరిగింది?"

"ఏం జరిగిందని సన్నగా అడుగుతారేంటి? మా రావిచెట్టు పొలంలేదూ? ఆ పొలం తనదన్నాడుగా కామందు? యియ్యాల నా కొడుకు కామందుగార్ని, మునసబుగార్ని పట్టుకొని దుమ్ముదులిపేసేడనుకో!"

"ఏమిట్రా, ఎలమందా? కామందుగారిని నీ కొడుకు ఎదురుతిరిగాడని సంబరపడిపోతున్నావా? ప్రమాదాన్ని కోరి వరిస్తున్నావ్ సుమా!"

"దేవుడుకంటే ఆయన గొప్పోడు కాదులెండి."

"అవుననుకో. అయినా— మనకీ పూజ్యో ఆ గుళ్ళో ఉన్నాయన ప్రాణంలేని దేవుడు. మరి ఆ కామందు ప్రాణంవున్న దేవుడు."

"యిదిగో, పూజారిగారూ! ఆ మాటకొస్తే నాకు పేణం వుందిగా? నా వొంటిమీద దేవుడి వచ్చబొట్టుందిగా? మరి అట్టయితే దేవుడు బతికుండట్లేగా?"

"ఆవుకి మాంసం పెట్టినంత మాత్రాన అది పులయిపోతుందట్రా?"

"నాకు అవన్నీ తెల్వదండి. నమ్ముకున్నోళ్ణ్ణి కాపాట్టానికి ఆ దేవుడు దిగొస్తాడుగా? అంతే."

"అంతేలే... ఎవరి నమ్మకం వారిది." పూజారి వెకిలిగా నవ్వుకుంటూ గుళ్ళోకి ప్రవేశించాడు.

వేజెళ్ళ సత్యనారాయణ దర్శకత్వంలో ఆనం గోపాలకృష్ణారెడ్డి సమర్పించే శ్రీ విజయసారధి ఆర్ట్ పిక్చర్స్ "రోజులు మారాయి" చిత్రానికి వై. కేశవరెడ్డి నిర్మాత,



"ఆనంద భైరవి" మాళవిక.

## ''ఆకలీ నీకు జోహారు''లో కలికాలం కుర్రాళ్లు!

గూడెం... గుడిసె బయట సుబ్బయ్య (ప్రభాకరరెడ్డి) నులక మంచంమీద పడుకొని, చుట్ట పీలుస్తున్నాడు. కొద్ది దూరంలో వంట చేస్తోన్న అతని భార్య వెంకటసుబ్బి (విజయబాల) ''వోరయ్యా! మత్తయ్యను ఏనుగంత సదువు సదివించినావుగందా? యే వుద్యోగం వత్తాదం టావ్?'' అంది కుతూహలంతో.

''ఆడేమో కలకటేరు అవతానంటాడు. ఆడు ఆ పని సేయటం నాకిట్టంలేదే,'' అన్నాడు సుబ్బయ్య.

''మరే పనివత్తే బావుంటది?''

''మనూరి పోలీసోడయితే బావుండే. మొన్న సూసినాను — మనూరి పోలీసోడు సెంటర్లో నిలబడి సేతులూపుతూ — కలకటేరు బండిని, పెశడెంటుగారి బండిని, మనూరి రైస్ మిల్ వోనర్ బండిని అట్టా అట్టా సేయిసూపి ఆపేత్తే, లటుక్కుమని ఆగిపోయినయ్. నువు సెప్పే! కలకటేరు గొప్పా, పోలీసోడు గొప్పా?''

సుబ్బి సంబరపడిపోతూ, ''అబ్బో... అయితే, పోలీసోడే!'' అంది.

ఇంతలో వాళ్ళ కొడుకు మత్తయ్య(వెంకట్) వచ్చాడు.

''నూరేళ్ళురా కొడకా, మాటల్లో వొచ్చినావు.'' సుబ్బయ్య సంతోషంతో లేచి కూర్చొని, ''నీవు దొరబాబులా యింగిలీసు మాట్లాడితే సూడాలనివుందిరా. వొరే... యేదిరా... వొక్క యిదిలింపు యింగిలీసులో యిదిలించు,'' అన్నాడు.

''ఆయామ్ వెరీ వెరీ సారీ!'' అన్నాడు మత్తయ్య.

''అబ్బో! అబ్బో — యిన్నావంటే.'' అని తెగ మురిసిపోయిన సుబ్బయ్య ''య్యేట్రా, నీకాడేదో వాసన గుప్పుమంటోంది?'' అన్నాడు.

మత్తయ్య కంగారును కప్పిపుచ్చుకుంటూ, ''అదా?... అది... బీరని... బలానికి తాగుతారయ్యా. అది తాగాను... అయ్యా! ఈ రోజు ఉద్యోగానికి అప్లికేషన్ పంపాలి. పాతిక రూపాయలు కావాలి,'' అన్నాడు.

''యెదవది — పాతికేట్రా? యాభై రూపాయలట్టుకెళ్ళు. నీ అమ్మ మందుకని వుంచాను. పట్టుకెళ్ళు... వొరే, అదేటి?... ఆఁ... ఆఁ.. బీరు అన్నావు సూడు — ఒక సీసా కాకపోతే పది తాగవయ్యా — నువ్వు బలంగా వుండాలి... అంతే!''

డబ్బు చేతిలో పడ్డమే తరువాయి ''వస్తానయ్యా,'' అంటూ తుర్రుమన్న మత్తయ్యవంకే మూస్తూండిపోయాడుసుబ్బయ్య. ''ఏందయ్యా, అట్టా సూపు నిలిపేసినావు?'' అంది సుబ్బి.

''నా సందమామకు రంగులువేసి సూసుకుంటున్నానే,'' అంటూ సుబ్బయ్య తన కొడుకు మీద పెంచుకున్న ఆశల్ని ఊహించుకుంటూండి పోయాడు.

షాట్ ఓ–కే అయ్యాక ''కూలీ నాలీ చేసి అష్టకష్టాలూపడి కన్న బిడ్డల్ని పెంచి పెద్ద చేసి గొప్ప చదువులు చదివిస్తే, చివరికి ఆ బిడ్డలవల్లే అన్యాయం జరిగితే? ఆ తల్లి దండ్రులు ఎంతగా క్షోభ పడిపోతారు? నేటి యువతరానికి కనువిప్పు కలిగించే ఇతివృత్తం,'' అన్నారు బిందూ ఎంటర్ ప్రైసెస్ ''ఆకలీ నీకు జోహార్లు'' చిత్ర దర్శకుడు ఎన్. రామచంద్రరావు. యు. త్రినాధకుమారి, యు. జయశ్రీ నిర్మాతలు.

## హాలివుడ్ చిత్రంలో మన తారలు

పీటర్ హంట్ దర్శకత్వంలో రూపొందే ''సాన్ టు కింగ్ త్రీ'' హాలివుడ్ చిత్రంలో శశికపూర్, సాల్మా ఆగా నటిస్తారు. ★

## ఇ'వేమన' పద్యాలు




మంచి రుచులనుగోరు మంచి స్త్రీలనుగోరు
మనసు చెడ్డదెట్టి మనసోగానీ
యించుకంతయైన నేలనిపించదు
విశ్వదాభిరామ వినుర వేమ.

# కొత్తగొంతులు

— టి.యల్.కాంతారావు

పిట్టల్లా
పిట్టల గొంతులు వీడిన పాటల్లా
పాటలు చేరిన గాలుల్లా
గాలుల్లో విహరించే పిట్టల్లా
ఎగిరే స్వేచ్ఛ నా జీవితేచ్ఛ

## —కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ

కవిత్వం రాయటం హాబీకాదు. అట్లాగే చదవటం కూడా. ఈ విషయాన్ని గ్రహించిన ఈ తరం చాలా కొద్ది మంది కవుల్లో సత్య శ్రీమన్నారాయణగారొకరు. కవి అయిన వాడికి ఒక అనుభవం, ఒక సంఘటన, ఒక దృశ్యం ఏదైనా గాఢమైన అనుభూతిగా పర్యవసిస్తుంది. ఆ అనుభూతే తత్కాలంలోనో, ఆ పిమ్మటో కవిత్వంగా ఆవిష్కరింపబడుతుంది. కేవలం అభిప్రాయం ప్రకటనే కవిత్వం అయితే మనకు కవుల దరిద్రం ఏమీ లేదు. నిజమైన కవి తనలో తాను లయింపబడి ప్రపంచ అస్తిత్వంలో, వ్యక్తిత్వంలో తన అస్తిత్వాన్ని, వ్యక్తిత్వాన్ని లయింపచేసుకుంటాడు. ఇందులో కవి తన ఇచ్ఛని, స్వేచ్ఛని పోగొట్టుకొనవలసిన అవసరం లేదు. కవిత్వం కవిదే అయినా, దాని పఠనం. అనుభవం సమాజానిది. కనుకనే కవి అనుభూతి వైయక్తిక పరిహద్దులను అధిగమించి విశ్వజనత వైపుగా ప్రయాణం చేస్తుంది. ఈ ప్రయాణంలో సుఖం ఉంది; దుఃఖం ఉంది. వేదన ఉంది; సౌందర్యం ఉంది. వీటి సమాహారమే జీవితం. ఆ జీవితాన్నే అనుభూతి కాన్వాస్‌మీద, అక్షరాల బ్రష్‌తో కవిత్వపు రంగుల్ని పూస్తాడు కవి. నిజ జీవితంలో అనేక అనుభవాలు కలుగుతాయి; అనేక దృశ్యాలు కనబడతాయి; అనేక జీవితాలు దర్శనమిస్తాయి. ఆ అనుభవాలే, ఆ దృశ్యాలే, ఆ జీవితాలే కవిత్వపు రంగులో జ్ఞాన నేత్రానికి కనిపించి మనఃఫలకంపై ముద్ర పడినపుడు మనిషిలో కదలిక ఆరంభమవుతుంది. ఆ కదలికే మనిషిని మనిషిగా ఆలోచింపచేస్తుంది. అట్లాంటి శక్తి కవిత్వానికుంది. ఆ శక్తే శ్రీమన్నారాయణగారిని మంచి కవిగా చేసింది.

ఈనాటి కవుల్లో చాలామందికి అర్జంటు కీర్తి కావాలి. ఆ కీర్తిని సంపాదించటానికి ఏ ఎంగకా గొడుకు పడతారు; ఏ గాలి వీస్తే ఆ గాలి వెంబడి పోతారు. కవిత్వంలోనూ, జీవితంలోనూ కూడా నిజాయితీ అనే మాటకు ఇట్లాంటివాళ్ళకు అర్థం తెలియదు; తెలియక పోవటం నేరం కాదుగాని మరొకరు చెప్పినా వినిపించుకొనకపోవటం మహాఘోరం. శ్రీమన్నారాయణగారు కవిత్వంమీద తనకున్న అభిప్రాయాన్ని చెప్పేతీరులో కనిపిస్తున్న నిజాయితీని ఏ ఒక్కరూ శంకించవలసిన అవసరం లేదు. "అనంతత్వంవైపు వెళ్ళడానికి ఒకే ఒక నిట్టనిలువు దారి – నేల బారుదార్లకే అడ్డదార్లుంటాయి. అందుకే అడ్డదార్లు తొక్కుతూ పైకి రావడమనేది ఉంటుందా! అనిపిస్తుంది." అయితే తాత్కాలికమైన కీర్తి మీదికి వెళ్ళితేనో, లేక ఎవరైనా ఎగదోస్తేనో జరిగితే కాలం ఊరుకుంటుందా! ఊరుకోదు. అందుకే నిజమైన కవి ఒకరి జాలిమీదో, ఒకరి దయాభిక్షమీదో ఆధారపడకూడదనిపిస్తుంది." అని అంటారాయన.

సత్యశ్రీమన్నారాయణగారు 1971 నుండి 74 వరకూ రాసిన కవితాఖండికలను ఏర్చి వెలుతురు పిట్టలు.కావ్యంగా అచ్చువేసారు. కవిత్వ రచనా ప్రారంభకాలంనాటికే ఆయన కాకినాడలో ఇంజనీరింగ్ విద్యార్థి. స్వస్థలం రాజమహేంద్రవరం. ఈనాడు తన చదువుకు తగిన ఉద్యోగం. ఇంజనీరింగ్ విద్యార్థి గొప్ప కవిత్వం రాయడం ఆశ్చర్యం ఏమీకాదు. ఇవ్వాళ తెలుగు కవిత్వాన్ని రక్షిస్తున్న.వాళ్ళలో చాలామంది తెలుగు డిగ్రీలు ఉన్నవాళ్ళు మాత్రంకాదు. అట్లాగే శ్రీమన్నారాయణగారు. ఆయన కవిత్వానికి దివ్య చైతన్య స్రవంతీ మంజుల నినాదంతో స్థితిని కల్పించటానికి బృహత్ ప్రయత్నం చేసారు సోమసుందర్ గారు. సౌందర్యారాధన, స్వేచ్ఛాపిపాస, తత్వచింతన వారి కవిత్వానికి వెన్నెముక అని ఎపిలోగ్‌లో హనుమయ్యగారు చెప్పారు.

మేధకు సంబంధించిన సర్కస్ ఫీట్లతో కవిత్వాన్ని అస్పష్టపు ఎడారిగా మార్చటం ఈయనకు గిట్టదు. పువ్వులు చెట్లనుంచి, పసిపిల్లల మాటలు హృదయంలోంచి వచ్చినట్లు



గానే కవి నుంచి కవిత్వం స్వచ్ఛంగా రావాలని ఈయన ఆశయం. మహాకవులు ప్రవహించే నదుల్లాంటి వాళ్ళు. ఎక్కడో పడిన భావాల చినుకుల్ని కూడా తమ వైపు ఆకర్షించుకునే శక్తి వాళ్ళకుంది. కనుక ఆ ప్రవాహాల్లో పేరు, ఊరులేని జలబిందువుగా మారటం శ్రీమన్నారాయణగారికి ఇష్టం లేదు. ఎంతటి మహాకవినైనా సరే అనుసరించో, అనుకరించో నామరూపాల్లేకుండా పోవటం కంటె తనదైన వ్యక్తిత్వాన్ని తాను నిలుపుకొనటం కవికి ఆవశ్యకమని వీరు కంఠోక్తిగా చెబుతున్నారు ఇది శ్రీమన్నారాయణ గారి కవిత్వపరమైన వ్యక్తిత్వానికి మచ్చుతునకైన ఉదాహరణ మాత్రమే. తాను రాసిన కవితా కుసుమాల విత్తనాలు పాఠకుల హృదయ క్షేత్రాల్లో నాటుకుని మళ్ళీ పూలు పూయాలని వీరి కవిత్వాశయం. ఆ ఆశయసిద్ధి కోసమేనేమో వారి కవిత్వంలో ఎక్కడా అస్పష్టత అనేది కనపడదు. నీరు జారే చిరుసవ్వడులనూ, అగ్ని జ్వాలల రోదలనీ తన కవిత్వంలో వినిపిస్తానని చెబుతున్నారీయన. కీర్తి ఎప్పుడూ పాదాన్ని తాకుతూ నేలమీదుండే నీడలాగ ఉండాలని, అది తన తలనుమించి పెరిగే వట వృక్షం కాకూడదని వీరి అభిప్రాయం.

శ్రీమన్నారామయణగారు కవిత్వంలో అందించే భావచిత్రాలు సారూప్యాలైనా, నైరూప్యాలైనా కవి హృదయాన్ని పాఠకునికి సూటిగా సాక్షాత్కరింపచేస్తాయి. దిగుమతి చేసుకున్న సరుకు కాకపోవటంవల్ల ఆయన భావచిత్రాలు, రూపకాలు, ఉపమలు, ఉత్ప్రేక్షలు అన్ని నైసర్గిక స్వభావాన్ని పొందాయి. ప్రకృతి, దాని వికృతి; చేదు, తీపి; ఆనందం, విషాదం; ఉండటం లేకపోవటం; బలం కలిగినవాడు బలం లేనివాణ్ణి దగావెయ్యటం, ప్రేమ, ద్వేషం సమస్తమైన ద్వంద్వాలు వీరి కవితలో రూపాన్ని పొందాయి. పరిమితినుండి, అపరిమితికి; వ్యష్టినుండి సమిష్టికి ప్రయాణంచేస్తున్నాడాయన. బాధామయమైన ఒంటరి జీవితంలోంచి, ఏకాంత మానవుని వేదనలోంచి ఆర్ద్రత, ఆప్యాయత, స్నేహం ఆయుధాలుగా. ఆధునిక మానవుడు గతాన్ని పూడ్చి, వర్తమానాన్ని అధిగమించి భవిష్యత్తుని నిర్మించుకోవాలని వీరి వెలుతురు పువ్వులు చెప్తున్నాయి.

స్నేహితులారా!
మనం స్నేహితులం
మన మధ్యనే ఒక సింహాసనం
వేసుకుందామనుకుంటే
చెల్లాచెదురైపోతాం!
మళ్ళీ కనిపించం
సిలువెక్కగలిగినవాడే
సింహాసనానికి అర్హుడు.



# ఆప్కోవారి వేసవి ప్రత్యేక ప్రదర్శన మరియు అమ్మకం

ఈ వేసవికి ఆప్కోవారి చేనేత ప్రదర్శన మరియు అమ్మకంలో కొనుగోలు చేసి 20% మరియు అంతకు పైగా తగ్గింపు పొందండి. ఈ సదుపాయం ఆప్కో వారి అన్ని షోరూముల్లో, జిల్లా కేంద్రాల్లో 16 మే నుండి 18 జూన్ వరకు వినియోగించుకోండి.

16 మే నుండి
18 జూన్ '83 వరకు
20% మరియు
అంతకుపైగా
తగ్గింపు




చేనేతలు




ఆప్కో
చేనేతలు కొనండి

kiron/apco/83

సీరియల్

# అతడు అడవిని జయించాడు

డా. కేశవరెడ్డి

( గత పంచిక తరువాయి )

తో టిగువ్వ తీం(టపాదమీద కూర్చుని అరుస్తూ ఉంది. 'అలా అరుస్తూ ఉంటే దానికి విసుగులేదేమోగాని వినడానికి నాకు విసుగ్గా ఉంది' అనుకుంటూ ముసలివాడు తల తిప్పు కున్నాడు.

అతడలా తల తిప్పుకున్నప్పుడు మరపరాళ్ళ లోయలో అతనికొక గుంటనక్క కనిపించింది.

''ఆ ! నక్కపోతుగాడొచ్చేసినాడు!' అన్నాడు ముసలివాడు.

లోయలో రెండు మరపరాళ్ళ మధ్య గుంట నక్క నిలుచుని ఉంది. మోరను పైకెత్తి గాలిలో వాసన పట్టుతున్నది. అలా కొంతసేపు వాసన పట్టి ఒక దృఢనిశ్చయానికొచ్చినట్లుగా బయలు దేరింది. లోయమధ్య పారుతున్న సెలయేరును చెంగునదాటింది. అది లోయను ఎక్కుతున్నప్పుడు కాసేపు ముసలివానికి కనిపించలేదు. గట్టుఎక్కాక మళ్ళీ కొంతసేపు గాలిలో వాసనచూసి,అడుగులో అడుగేసుకుంటూ తీం(టపాద వైపు బయలు దేరింది.

''ఓరినీయమ్మ ! లోబినాకొడకా. లిబ్బి పూడ్చిపెట్టు నేరుగ వస్తాఉండావుగదరా'' అను కున్నాడు. అతడు దానిపోకడలన్నీ గమనిస్తున్నాడు. ''తెలివిలో గుంటనక్కను మించిందిలేదు. గాలిలో వాసన పట్టుతూనే నూరామడల కవతల ఏమి జరుగుతున్నది అది (గ్రహించగలదు. యుక్తులలో దాన్ని పడగొట్టేవాడే లేడు'' అనుకున్నాడతడు.

నక్క యుక్తులను 'గురించి అతనికి తుణ్ణంగా తెలుసు. అది నం(డకాయల బొరియ లలో తోకను జొనిపి తిప్పి, నం(డకాయను బయటకు రప్పించే వైనం. పొలం వద్దకాపలా ఉన్న రైతులను ఏమార్చి ■యుకు గడలను, వేరు శనగ కాయలను కాజేసే వైనం, అవసరమొచ్చి నప్పుడు అది తన శరీరాన్ని గుం(డాలు పరిమాణం లోకి కుదించుకుని సాగేటి బొలులో దాగుకునే వైనం అతనికి బాగా తెలుసు.

'యుక్తులను అడ్డం పెట్టుకుని బతకమనే (బ్రహ్మదేవుడు దాని నుదుట రాశాడు.' అను కున్నాడతడు.

గుంటనక్క బిలిబి(తిచెట్ల మధ్య నడుస్తూ తీం(ట పాదవైపు సాగుతున్నది. పొద సమీపించేకొద్దీ అది మెల్లగ అడుగులో అడుగేసు కుంటూ నడుస్తున్నది.

'రారా లోబి నా కొడకా. ఎక్కడ పుట్టి ఎక్కడ పెరిగితివో? ఈ తీం(టపాద దగ్గర నీకు చావు రాసిపెట్టి వుంది.' అనుకుంటూ ముసలివాడు ఈటెను కుడిచేతిలోనికి తీసు కున్నాడు. గుంటనక్క తన కళ్ళను తీం(ట పొదపైన నిలిపి ఏ మా(త్రం చప్పుడు చేయ కుండా నడుస్తూ పొదను సమీపిస్తున్నది. శరీరాన్ని విల్లులాగవంచి, కండరాలన్నిటినీ బిగించి పొదలోకి దూకటానికి సిద్ధమవుతున్నది. 'దేవుడ్ని తలుచుకోరా లోభి నాకొడకా.' అనుకుంటూ ముసలివాడు ఈటెను పైకెత్తి దాని రొమ్ముకు గురిచూ.. వదలబోయాడు. ఇంతలో సుక్క పంది పొదలో ఛెంగుమని మెరపుతీగవలె ఎగిరింది. పొదలో ఎగిరిన ఎగురు నక్కవీపు మీద దిగింది. దిగీ దిగగానే తన కోరలను దాని జబ్బలలోనికి దించింది. నక్క మోకాళ్ళను వంచి నేల గూలింది. సుక్క పంది తన భయంకరమైన కోరలను దాని మెడ చుట్టూ దించి పీక తెంచే సింది. కంఠం నుండి రక్తం నలువైపులకు చిమ్ముతుండగా గుంటనక్క గడ్డిమీద దొర్ల సాగింది. అందిన చోట్లల్లా దానిని తన కోరలతో చీలుస్తూ సుక్కపంది వీరవిహారం చేయసాగింది.

సుం(కేసు చెట్టుమీద కూర్చుని ఉన్న ముసలివాడు ''అదిరా సుక్కలం... ! అదీ !!'' అనరచి వికటాట్టహాసం చేస్తూ నవ్వసాగాడు.

చచ్చిపడిఉన్న నక్కచుట్టూ సుక్కపంది మొరుస్తూ కొంతసేపు చూసింది. దాని తల వద్ద ఆగి తన ముట్టెమీదున్న నెత్తురును నాలుకతో తుడుచుకుంటూ నిలుచున్నది. నక్క కదలడం జరుగుతుందేమోనని కొంతసేపు నిశితంగా, (క్రూరంగాచూసి వెనకకు తిరిగి తీం(ట పొదలోకి వెళ్ళిపోయింది.

చెట్టుమీదున్న ముసలివాడు ఇంకా నవ్వు తూనే ఉన్నాడు. నవ్వును ఆపుకోవాలనే స్పృహ గానీ, ఆపుకోవలసిన అవసరంగాని అతనికేమీ లేదు. అతడు సుఖదుఃఖాలకు అతీతుడుకాడు. ఓటమికలిగినప్పుడు దుఃఖపడకుండా ఉండడము, విజయం కలిగినప్పుడు సంతోషపడకుండా ఉండ డము అతనికి చేతకాదు. నవ్వితే నవ్వినంతచేటు కలుగుతుందని ఆలోచించడానికి అతడు నిరాశా వాదికాడు. ఈ ఆనందం క్షణికమని జ్ఞాపకం చేయడానికి, ఈర్ష్యతో ముఖం ముడుచుకోవ డానికీ ఈ అడవిలో మరొక మానవుడు లేడు. పైగా ఈ శకునాలను, శాస్త్రాలను గురించి, ముందు వెనకలను గురించి ఆలోచించుకునేందుకు అనువైన స్థితిలో అతడు లేడు.

తొడలమీద గాయాలకన్న ఎక్కువగా పొత్తి కడుపుమీది కండరాలు నొప్పి పెట్టేవరకు అతడు నవ్వాడు. నవ్వును సమాళించుకుంటూ ఈటెను పక్కకొమ్మమీద ఉంచాడు.

నీటిమట్టం తీసిపోయాక కొలను అడుగున ఉన్న రాళ్ళు బయటపడినట్లు, ముసలివాని వికటాట్టహాసాలు ఆగిపోయాక తోటి గువ్వ అరుపులు వినిపించసాగాయి.

''ఎక్కడున్నావురా తోటోడా ?'' అను కుంటూ ముసలివాడు చుట్టూ చూశాడు. కను చూపుమేరలో ఎక్కడా ఆ పిట్ట కనిపించలేదు. కాని దాని అరపులు మా(త్రం యధా (ప్రకారం వినిపిస్తున్నాయి.

''సుక్కపంది నడిపిన భీభత్సాన్ని చూసి తోటివాడు జడుసుకుని ఎక్కడో దాక్కున్నాడు గాబోలు. ఎంత భయపడినాసరే నాలుకను కత్తిరించి పారేసినాసరే అరవడం మా(త్రం

**జరిగిన కథ — 4 :** ముసలివాడు ఆజానుబాహుడు. అతని ఆస్తి పందులు. అతని మనుమడు మేతకై పందుల్ని తోలుకొనిపోయి తిరిగి రానందుకు ఆందోళన చెందాడు. వెతుక్కుంటూ బయలుదేరిన అతనికి పిల్లవాడు, పందులు రావడం కనుపించింది. కాని వాటిలో ఈనడానికి సిద్ధంగా ఉన్న సుక్కపంది కనుపించలేదు. దాన్ని వెతుక్కుంటూ అడవివైపు నడవసాగాడు. గత కాలంలో జరిగిన కొన్ని అనుభవాలను మననం చేసుకుంటూ సుక్కపందికై అడవంతా గాలించసాగాడు. కుందేలు మాంసంతో కడుపు నింపుకుని ఆ రా(త్రంతా వెతకను నిశ్చయించుకున్నాడు ముసలివాడు. చివరకు తీం(టపొదలో సుక్కపంది ఈనినట్లు తెలుసు కున్నాడు. సుక్కపంది మనిషి అలికిడి పసిగట్టి ముసలివాడిపైకి విజృంభించింది. ఎలాగో దాని బారినుండి తప్పించుకొని చెట్టెక్కి కూర్చున్నాడు ముసలివాడు. చెట్టుమీద ముసలివాడు సుక్కపందిని, సలుగులను పదే పదే తలచుకుంటూ పారవశ్యం చెందుతూ ఉంటాడు. ఆ రా(త్రికి సలుగులు నక్కలపాలు కాకుండా కాపాడాలని నిశ్చయించుకుంటాడు.



మానదు. నేో సుక్కపందిని తీసుకుని అడవి వదలి వెళ్ళిపోయేవరకు అరుస్తూనే ఉంటాడు. వాని పుటకే అంత'' అనుకున్నాడు ముసలివాడు.

తీంట్రపాద దాపున నక్కశవం పడి ఉన్నది. ప్రేవులు బయటికొచ్చి పచ్చగడ్డి మీద పడి ఉన్నాయి. తెగిన కంఠం నుండీ వచ్చిన రక్తపు నురగ ఎత్తుగా కనిపిస్తున్నది. నురగలోని బుడగలు ఒక్కటొక్కటే గాలికి పగులుతున్నాయి.

ఇంతటి భీభత్సాన్ని నడిపిన సుక్కపంది తీంట్రపాదలో నిర్మలంగా పడుకుని ఉంది. పలుగులు తన శరీరాన్ని తొక్కుతూ రొమ్ములను పీకుతుండగా, మోరను నేలపైన పడవేసుకొని అరెమోడ్పు కన్నులతో పడుకుని ఉన్నది, అప్పుడప్పుడు నాలుకతో ముట్టెను తుడుచుకుంటున్నది. ''చూడడానికి అది ప్రశాంతంగా పడుకుని ఉన్నదేగాని దాని ఎదలో ఉద్రేకం పొంగుతున్నది. రాక్షసుని సంహరించిన నరసింహునివలె అది జ్వలిస్తున్నది. కాని ఉద్రేకాన్ని గాని, ఏ వికారాన్ని గాని అది పైకి తెలియనియ్యదు. సముద్రం వెలె, భూమి వలె, పర్వతం వలె, మేఘం వలె అది గంభీరమైనది. ఆ గంభీరతయే దాని సొగసు, దాని హంగు'' అనుకున్నాడు ముసలివాడు.

సుక్కపంది డొక్కలు మెల్లగ కంపిస్తున్నవి. దాని కళ్ళలో నీళ్ళు, ముఖంలో దైన్యము కదులాడినట్లుగా ముసలివానికి అనిపించింది. 'తాను నెరపిన హింసాకాండను తలచుకుని సుక్కపంది పశ్చాత్తాప పడుతూందేమో. కాని అది జరిపింది హత్య కాదు. యజ్ఞం.' అనుకున్నాడతడు.

సుక్కపంది చెవులను టపటపలాడించింది.

'నంద్రకాయలను తిని బతికే లోభి వెధవ నిన్ను దోచుకోవటానికి వస్తే నువ్వు ఊరుకుంటావా ? నువ్వు వాని పీకను తెంచకుండా ఉంటే, వాని పేగులు తియ్యకుండా ఉంటే నేను గొంతు పిసుక్కుని చచ్చి ఉందును. నువ్వు వానికి లొంగిపోయి ఉంటే ఆ భీమసేనుడు. మేఘాలు, పర్వతాలు, పలిపిడుగు అన్నీ అవమానంతో చిన్నబోయి ఉందును.' అనుకున్నాడతడు.

నల్లమందు నాటుపెట్టి కాల్చగా గండశిల ఎగిరినట్లు సుక్కపంది తీంట్ర పాదలో నుండి ఎగరడం, మెరపు వలె నక్కమీద దూకడం, చలి







పిడుగు భూమిని చీల్చినట్టు అది తన కోరలతో నక్కను చీల్చడం అతడు మననం చేసుకున్నాడు.

అతడు మెచ్చికోలు దృఃఖులతో సుక్కపంది వైపు చూస్తూ, 'నీకేదైనా పారితోషికం ఇవ్వాలని ఉంది. ఏమి కావాలో కోరుకో.' అనుకున్నాడు. సుక్కపంది మౌనంగా పడుకుని తోకను నేలమీద కొడుతున్నది. 'నీకు ఏమి కొరత ఉన్నది గనుక. చందమామల వంటి సలుగులు పది ఉన్నాయి నీకు. ఇంత నిండార్లుగ వరాలు పొందిన ఈ భూప్రపంచంలో మరిలేదు'' అనుకున్నాడతడు.

అతడు తన చూపులను సుక్కపంది మీద నుండి మరల్చుకోలేదు. 'నీలో లీనమైపోవాలని ఉంది. నీ చెంతకొచ్చి కూర్చుని నా చేత్తో నీ శరీరాన్ని తడమాలని ఉంది. కాని నువ్వు నన్ను దరిజేరనియ్యవు. నువ్వు మూర్ఖుడవు. తన, పర అని తెలుసుకోలేని అజ్ఞానివవు. కాని నీవు వీరుడవు. మెరపువలె ఎగరగలవు. పిడుగువలె చీల్చగలవు' అనుకున్నాడతడు.

అతడు దీర్ఘంగా నిట్టూర్చి, 'నీకు కానుకలేవీ ఇవ్వలేకపోయాను గనుక, నిన్ను నా చేత్తో నిమరలేకపోయాను గనుక నిన్ను గురించి ఒక పాట పాడతాను' అనుకుని ముఖాన్ని ఆకాశానికెత్తి పాటను జ్ఞాపకం చేసుకోసాగాడు. అతనికి పాటలేవీ జ్ఞాపకం రాలేదు. 'ఉహూం. నిన్ను గురించి ఎవరూ పాట రాయలేదు. నెమళ్ళను గురించి రాశారు. హంసలను గురించి రాశారు. కాని నిన్ను గురించి రాయడానికి ఎవరికీ పట్టకపోయింది. ఇప్పటికిప్పుడు పాట అల్లే చాతుర్యం నాకు లేదు' అనుకున్నాడతడు.

తీంట్రపొదలో సుక్కపంది అలిగి మూల కూర్చున్న ఇల్లాలు వలె మూతి ముడుచుకుని ఉంది.

'ఫరవాలేదు. భీమసేనుని గురించి లెక్కలేనన్ని పాటలున్నాయి. పద్యాలున్నాయి. పలు కతలున్నాయి. ఆ పాటలు పాడతాను. భీమసేనుని గురించి పాడితే నిన్ను గురించి పాడినట్టే' అనుకున్నాడతడు.

## అతడు అడవిని జయించాడు

అతడు ఈటెను పక్కకొమ్మమీద ఉంచి, గొంతు సవరించుకుని, గుండెల నిండా గాలి పీల్చుకుని వీధి నాటకపు పాట పాడసాగాడు—

''వలలుడ లేరా
గుడ్డోని బిడ్డలను
గొడ్డలితో నరుక
వలలుడ లేరా ... ...''

గాయాలమూలాన తొడలు నొప్పిపెట్టినట్లు, మితిమీరి నవ్వినందువల్ల పొత్తికడుపు మీది కండరాలు నొప్పిపెట్టినట్లు, గొంతు ఎండిపోయి నొప్పిపెట్టేదాక అతడు పాడుతూనే ఉన్నాడు. తన పాటకు తానే వంతపాడుతూ, పాడిన చరణాన్ని మళ్ళీ పాడుతూ అతడు మైమరచిపోసాగాడు.

అతడు గొంతుమీద తీడుకుంటూ, 'గొంతు ఎండిపోయింది. గుక్కెడు నీళ్ళు దొరికితే బాగుండును. భుజాలకు రెండు రెక్కలుంటే ఆ తోటివానిలాగ ఎగురుతూ వెళ్ళి కుంటలో నీళ్ళు తాగి వద్దును.' అనుకున్నాడు.

అతడు కొమ్మమీద అననుకూలమైన భంగిమలో చాలసేపటినుండి కూర్చుని ఉండటంవల్ల

> **మరమనుషులు**
>
> పనుల కోసం విదేశాల్లో
> మరమనుషులను తయారుచేస్తున్నారు.
> వాటి మీటలను నొక్కి
> టక్కున పని జరిపించుతున్నారు
> మనవాళ్ళు తీసిపోకుండా
> నిజం మనుషులనే మరమనుషుల్లా
> లిటిగేషన్ స్విచ్‌లతో వాడుతున్నారు
> కిమ్మనకుండా పనులు చేయిస్తున్నారు
>
> — పి. పి. సర్వేశ్వరశర్మ

అతని పాదాలు రెండూ తిమ్మిరెక్కినాయి.

కొమ్మమీద బాపన చీమలు తిరుగుతున్నాయి. 'ఈ బాపన చీమలు పగలంతా ఎక్కడుంటాయో బ్రహ్మదేవునికిగూడా తెలియదు. రాత్రిపూట మాత్రం ఎక్కడ చూసినా ఇవే కనిపిస్తాయి.' అనుకున్నాడు ముసలివాడు.

బాపన చీమలు అతని పాదాలమీదుగా, కాళ్ళ మీదుగా, తొడలమీదుగా పరుగెత్తుతున్నాయి. ఒక్కొక్కటి తుంటి పైకెత్తుకుని ఎక్కడో రాచకార్యాలు వెలిగించనున్నట్టు గుడుగుడుమని పరుగిడుతున్నాయి. ఆకులద్వారా ప్రసరిస్తున్న వెన్నెలలో ముసలివాడు వాటిని గమనిస్తున్నాడు.

'ఈ బాపన చీమలకు కుట్టడమూ తెలియదు, కొరకడమూ తెలియదు. ఎలాబతుకుతాయో ఏమో' అనుకున్నాడతడు. అవి తన శరీరంమీద ప్రాకుతుంటే ఆప్తులెవరో తనను ఆలింగనం చేసుకున్నట్లు అతడు అనుభూతి చెందసాగాడు.

కొంత సేపటికి అతడు తన తలపైన ఉన్న కొమ్మను ఆధారంగా పట్టుకుని లేచి నిలబడి మూత్ర విసర్జన చేశాడు.

## 16

ఆ సన్నటి కొమ్మమీద వొదిగి కూర్చుని ఉండడం చాల కష్టంగా అతనికి తోస్తున్నది. ఇలా ఎంతసేపు కూర్చొని ఉండటం ? తెల్లవారేదాకా ఇలా ఉండవలసిందేనా ?

'మరయితే కష్టపూరితం కానిదేది ? శ్రమతో, బాధతో ప్రమేయం లేకుండా అవలీలగా ఏది మాత్రం వాన గూడుతుంది. కడుపు పగిలేట్టు కల్లు త్రాగి ఈత చెట్ల కిందే పడి మూలగడం అవలీల. ముక్కుదాక కతికి అటక మూలపడి గుర్రుపెట్టడం అవలీల. సుక్కపందినీ, దాని సలుగులనూ క్రూరమృగాల పాలు జేసి గుడిసెకు వెళ్ళిపోవడం అవలీల. కాని బాధ్యతలను గుర్తించని వాళ్ళకు, లోయలోని మరప రాళ్ళకూ ఏమితేడా ?' అనుకున్నాడు ముసలివాడు.

కొమ్మ మీద సర్ది కూర్చుంటుండగా

అతనికి ఆవులింత వచ్చింది 'ఛీ. ఇది చాలా అవమానకరం. చేతినిండ పని ఉంచుకుని విసుగును, అలసటను దరిజేరనియ్యడం చాల అవమానకరం.' అని అతడు తనను తాను నిందించుకున్నాడు. 'కాని ఈ ఆవులింత శారీరకమైనది. నేను శారీరకంగా నిజంగానే అలసి ఉన్నాను.' అనుకున్నాడతడు.

'నేను కాటికి కాళ్ళు చాపుకుని ఉన్నవాడ్ని. ఒక్కసారిగ ఇన్ని గాయాలు తినడం, ఇంత నెత్తురు పోగొట్టుకొనడం నాబోటివానికి లాయకీ కాదు.' అనుకుంటూ అతడు తన తొడల వైపు చూసుకున్నాడు. 'కాని అలసి ఉన్నది నా శరీరం మాత్రమే. నా మనోధైర్యం చెక్కు చెదరలేదు: ధైర్యం సడలవలసిన అగత్యం మాత్రం ఏమొచ్చింది. అదిగో. నా శత్రువు కడుపు తెగి పేగులు బయట వేసుకుని పడి ఉన్నాడు. సుక్కపంది దాని సలుగులతో తీంట్రపొదలో సురక్షితంగా ఉంది.' అనుకున్నాడతడు.

ఇంతలో అకస్మాత్తుగా గాలి దిశమారి. వీచసాగింది. గాలిపాటుకు చెట్లకొమ్మలు కీచుకీచుమంటూ ఒకదానికొకటి రాచుకొనసాగాయి. ముసలివాడు కూర్చుని ఉన్న సుంకేసు కొమ్మ ముందుకు, వెనకకు, పైకి, కిందకు ఊగసాగింది. పండి ఉన్న సుంకేసు ఆకులు నిశ్శబ్దంగా తొడిమలు వీడి అంతకన్న నిశ్శబ్దంగా భూపతనమవుతున్నాయి.

గాలి ముసలివానిని చికాకు పరచింది. అతడు తల తిప్పి గాలి వీస్తున్న దిశగా చూశాడు. లోయలో అతనికి నాలుగు గుంటనక్కలు కనిపించాయి. క్షణకాలంపాటు తనువెల్లా కొయ్యబారిపోయినట్లు అతనికి అనిపించింది.

మునుపటి నక్కవలె ఆ నాలుగు గుంట నక్కలు కూడా లోయలో మరపరాళ్ళ మధ్య నిలుచుని ఉన్నాయి. ఈశాన్య దిక్కుగా తిరిగి ఒకే భంగిమలో నిలుచుని ఉన్నాయి. మోరలను ఆకాశంవైపు తిప్పి కొంతసేపు గాలిలో వాసన పెట్టి తలలు దించుకున్నాయి. వేటగాడు తన దృష్టికి అడ్డువచ్చిన సాలెగూడును లాగివేసినట్లు అవి తమ ముందరికాళ్ళతో ముక్కులమీదున్న చెమటను తుడుచుకుని మళ్ళీ మోరలెత్తి గాలిని పరిశీలించాయి. తమ పరిశోధన ఫలించింది గాబోలు అవి ఈత పట్టలవంటి తమ తోకలను నేలమీద జీరాడించాయి. తరవాత నాలిగింటికీ కలిసి ఉమ్మడిగా ఒకే ఆత్మ, ఒకే హృదయం, ఒకే తనువు ఉన్నట్టుగా అవి తామున్న తావు నుంచి కదలి బయలుదేరాయి.

"సుక్కపంది తీంట్రపొదలో పురుడు పోసుకుని ఉన్న విషయం ఈ నక్కలకు ఎలాగ తెలిసింది?" అనుకున్నాడు ముసలివాడు. 'పురిటి వాసనద్వారా తెలుసుకుని ఉంటాయి. అడవి మృగాల ఘ్రాణేంద్రియాలకు అతీతమైనదేదీ లేదు. శత్రువుల ఆగమనాన్ని, ఆహార పదార్థాల ఉనికిని, ఆడజంతువులు వలమై ఉన్న వైనాన్నీ-సర్వస్వాన్ని అవి వాసనద్వారానే గ్రహించుకోగలవు. పైగా తోటోడు గొంతు చిరిగిపోయేలాగ అరుస్తూ తను కనుగొన్న వింతను చాటుతూనే ఉన్నాడు" అనుకున్నాడతడు.

ఇంతవరకు అదృశ్యంగా ఉండిన తోటగువ్వ ఇప్పుడు తీంట్ర పొదమీద కూర్చుని అరుస్తూ కనిపించింది. నల్లని దాని ఆకృతి, పదునైన దాని కంఠం ముసలివానిలో అసహ్యాన్ని రేకెత్తిస్తున్నాయి. 'ముప్పు తెచ్చి పెడుతున్నావు గదరా తోటోడా. నువ్వు ఇలా రచ్చచేస్తూ నాకు కీడు కలిగిస్తున్న విషయం బహుశ నీకు తెలియదేమో' అనుకున్నాడతడు.

ఇంతలో ఆ నాలుగు నక్కలు లోయగట్టున ప్రత్యక్షమయ్యాయి. ఉజ్జ్వలమైన కాంతి ప్రసరించగా కనుపాప సంకుచించినట్టుగా అతని చేతివేళ్ళు ఈటె చుట్టూ బిగుసుకున్నాయి.

గుంటనక్కలు తీంట్రపొదవైపు సాగుతున్నాయి. ఎర్రని నాలుకలను బయటవేసుకుని, తోకలను పైకెత్తుకుని నడుస్తున్నాయి. పొద దగ్గరవుతున్నకొద్దీ వాటి ఆతురత, నడక వేగము హెచ్చుతున్నాయి.

తీంట్రపొద దాపున చచ్చిపడి ఉన్న నక్కను చూసి అవి టక్కున ఆగిపోయాయి. ముందుకు వేయడానికై ఎత్తిన కాళ్ళను వెనకకు తీసు

కున్నాయి. నాలుకలను లోపలకు తీసుకుని తోకలను దించుకున్నాయి. కొంతసేపు అవి అలాగే నిలబడి తరవాత మెల్లగ నడిచి శవం చుట్టూ నిలుచుని పరిశీలించసాగాయి. దాని కంఠం తెగి ఉన్నది. కడుపు చీల్చబడి పేగులు బయటపడి ఉన్నవి. శరీరమంతా గాయాలతో నిండి ఉంది.

తమ పరిశీలనను ముగించి ఆ నాలుగు నక్కలు ఒక దాని ముఖం మరొకటి చూసు కున్నాయి. ఒకదాని చెవిలో మరొకటి గుసగుస లాడుకోసాగాయి.

ముసలివాడు ఈటెను గురి చూసి ఉంచు కున్నాడేగాని ప్రయోగించలేదు. ఒకసారి ఈటెను ప్రయోగించానంటే మరి నేను నిరా యుధుడనై పోతాను. అనవసరంగా నిరాయుధు డనై పోవడం నాకు యిష్టం లేదు. పైగా ఈటెను వదల వలసిన అవసరం గూడ కలిగేట్టు లేదు. పేగులను బయట పడవేసుకుని చచ్చిపడి ఉన్న తమ సోదరుడిని చూసిన తరువాత ఆ నాలుగు నక్కలు ఇక ముందుకు సాగవు. వాటి గుండె నీరైపోయి ఉంటుంది. తోకలను తొడల సందున ఉంచుకుని వచ్చిన దారిని పట్టుతాయి.' అనుకున్నాడతడు. అతడు నక్కల పోకడలను ఆసక్తితో చూడ సాగాడు.

అవి నాలుగు అక్కడ నుండి కదిలి దిక్కు కొకటిగా వెళ్ళిపోయాయి. అలా కొంతదూరం వెళ్ళి, వెనుకకు మళ్ళి, తూర్పునుంచి ఒకటి, పడమరనుంచి ఒకట, ఉత్తరంనుండి ఒకటి, దక్షిణం నుండి ఒకటి తీంట్ర పొదను కొల్ల గొట్టడానికి రాసాగాయి.

'నక్కకు తెలియని యుద్ధతంత్రమా!' అనుకున్నాడు ముసలివాడు. 'నాలుగు ఒకే దిక్కు నుంచి వెళితే పంది దగ్గర మిగిలిరావటం కుదర దని తెలుసుకున్నాయి. నాలుగూ నాలుగు దిక్కు నుంచి వస్తే పందితో ఉప్పర పట్టే ఆడవచ్చు ననుకున్నాయి.' అనుకుంటూ అతడు ఈటెను సరి చేసుకున్నాడు.

కప్పను మింగిన పామువలె మందగమనం తోను, చంద్రుని మింగనున్న రాహువు వలె దృఢనిశ్చయంతోను ఆ నక్కలు తీంట్ర పొద వైపు సాగుతున్నాయి.

అవి పొదకు నాలుగు బారల దూరంలోకి వచ్చేసరికి సుక్కపంది పీడకలలు కంటూ ఉండి నట్లు త్రుళ్ళిపడి లేచింది. ఒక్కటొక్కటిగా నాలుగు నక్కలు దాని కంటబడ్డాయి. అది జల్లికట్టులో ఆబోతు వలె తమున్న చోటునే పొదలో గిరగిర తిరిగింది.

ముసలివాడు ఈటెను భుజానికి పైగా ఎత్తిపట్టుకుని గురిచూశాడు. 'ఈ గుంటనక్కల ఆటలు ఇక్కడ చెల్లవు. సుక్కపంది చలిపిడుగు

వల దుమికి శత్రువును హతమార్చగలదు. పైగా నా చేతిలో ఈటె ఉన్నది. దాని మొన ఇదివరకే లెక్కలేనన్ని జంతువుల తలలు చీల్చింది.' అనుకున్నాడతడు.

ఇంతలో సుక్కపంది సివకలించి ఎగిరి తూర్పు వైపు నుంచి వచ్చిన నక్క దావున దూకింది. నాలుగు కాళ్ళపైన దృఢంగా నిలుచుని ముట్టెతో నక్క కడుపు కింద బలంగా కుమ్మింది. నక్క కీచుమని అరుస్తూ గాలిలోకి నిట్టనిలువుగా ఎగిరి దబ్బున వెల్లకిల పడింది. అది వెల్లకిలాపడి నాలుగు కాళ్ళు కొట్టుకుంటూ పైకి లేవడానికి ప్రయత్నిస్తుండగా సుక్కపంది దానిమీద నిలుచుని తన భయంకరమైన కోరలతో కాటు వేసి ముట్టెతో పేగులను తీసి పచ్చిక మీద పడ వేసింది. కాళ్ళను, జబ్బలను, మెడను, మూతిని నంజర నంజరగా కొరకసాగింది.

ఇంతలో పడమర వైపు నుంచి వచ్చిన నక్కతోక పైకెత్తుకుని, నోరు ఇరకల కట్టె వలె తెరచుకుని తీంట్ర పొదలోకి దూకపోయింది. ముసలివాడు ఈటెను గురిచూసి దాని మీదకు వదిలాడు. అది రయ్యిమని పోయి దాని రెండు కండ్లమధ్యన దూరి ముచ్చిలి గుంతలో బయట కొచ్చింది. నక్క రెండు బారల ఎత్తు ఎగిరి కిందబడి గిలగిల కాళ్ళు కొట్టుకుంటూ ప్రాణం వదిలింది.

సరిగ్గా అప్పుడు ఉత్తరంనుంచి, దక్షిణం నుంచి వచ్చిన రెండు నక్కలు వలసపోయిన ఊర్లోకి దొంగలు జొరబడినట్టు పొదలోకి దూకాయి. చెరొక సలుగును నోటికి కరిపించుకుని అవి పరుగు పుచ్చుకున్నాయి. సలుగుల్ని నోట కరిపించుకుని పరుగిడుతున్న నక్కలను చూడగానే ముసలివాడు కడుపుమీద రోకలిపోటు తగిలిన నిండు చూలాలివలె అరచాడు. ఎవరో వేటగాడు వదిలిన బాణాలు మోకాళ్ళలోకి గుచ్చుకున్నట్లు అతడు అలాగే కొమ్మమీద మోకరిల్లి కూర్చున్నాడు. విషపూరితమైన ముండ్లు దిగినట్లు అతని శరీరం తీవ్రమైన బాధతో వణక సాగింది. సూర్యుడులేని ఉదయాన పట్టిన పొగమంచువలె వేదన అతనిని ముమ్మరంగా ఆవరించింది.

అతడు బాధాక్రాంతమైఉన్న ముఖాన్ని పైకెత్తి చూశాడు. పొదలో సుక్కపంది తన సలుగులను ముట్టెతో దగ్గరకు తోసుకుంటూ ఉంది. దాని ముట్టె రక్తశిక్తమై ఉంది. దాని వీపుమీద నాలుగడ్డేళ్ళ పొడవున్న గాయం విచ్చుకుని కనిపిస్తున్నది. గాయంనుండి రక్తం జబ్బ వెంబడి, కాలివెంబడి కారుతున్నది.

ముసలివాడు గబ గబ సలుగులను లెక్క పెట్టాడు. ఎనిమిది మాత్రమే ఉన్నాయి. ''రెండు సలుగుల్ని పోగొట్టుకుంటి.'' అన్నాడు. అతని కంఠం గద్గదమైఉండి మాటలు సరిగా వెలువడడంలేదు. ''పాపిష్టి ముండాకొడుకును.

## అతడు అడవిని జయించాడు

రెండు సలుగుల్ని పోగొట్టుకుంటి'' అంటూ అతడు కొమ్మమీద లేచి నిల్చున్నాడు. నిఠారుగా నిలబడి సలుగులను నోటగరిపించుకొని రెండు నక్కలు పారిపోయిన దిశగా తేరిపార చూశాడు.

పిండారబోసినట్లుగా వెన్నెల కాస్తున్నది. గాలి తన ఉరవడిని కోల్పోయి సడిచప్పుడులేకుండా వీస్తున్నది. అడవి నిశ్శబ్దంగా ఉన్నది. నక్కల పొలకువగాని, అలికిడిగాని ఎక్కడా తోచలేదు. దట్టమైన పొదలు, నోర్లు తెరుచుకుని ఉన్న గుహలు కనిపిస్తున్నాయి. 'లోభినాకొడుకులు ఆ పొదల్లో ఎక్కడో దాగుకొని ఉంటారు. ఆ నక్కలు, వాటికి ఆశ్రయమిచ్చే పొదలు, గుహలు అన్నీ సర్వనాశనమై పోవుగాక!' అనుకున్నాడతడు.

అతనిలో ఉక్రోషం హెచ్చుగా రేగింది. పరుగిడుతున్న నక్కల నోళ్ళనుండి వ్రేలాడుతుండిన సలుగులు అతని తలపుకు వచ్చాయి.

### సత్యం

ప్రశంస కన్న
సద్విమర్శయే మిన్న!
ఈ ప్రబల సత్యాన్ని
గుర్తించేదెవరన్నా?

— బొర్రా పాండురంగ శాస్త్రి

ఆ పొదలలో, గుహలలో సలుగులిప్పుడు ఏగతి పట్టి ఉంటాయోనని అతడు ఊహించుకున్నాడు.

తన మెదడులోని ఊహలను, తలపులను వెలికి నెట్టడానికి ప్రయత్నిస్తూ అతడు శ్వాస ఆడని ప్రాణివలె గిలగిల కొట్టుకున్నాడు. అశ్రువులతో అతని కనుకొలకులు నిండాయి. నిస్తేజమైన సూర్యుడు పడమటి కొండమీద చతికిలబడనట్లు అతడు కొమ్మమీదకూర్చున్నాడు

'నేను చెట్టుదిగి ఈటె చేతబట్టుకుని పొదచెంత నిలబడి ఉంటే ఈ ఘోరం జరిగేది కాదు. కాని సుక్కపంది నన్ను చెట్టుదిగనివ్వదు. దాని మొరటుతనమే దాని అందం, దాని హంగు. ఈ సృష్టిలో మొరటుతనం అనే గుణం ఉన్నన్నాళ్ళు ఆ గుణం సుక్కపందిని అంటి పెట్టుకునేఉంటుంది. కాదు. కాదు. సుక్కపంది బతికి ఉన్నన్నాళ్ళు అది మొరటుతనాన్ని పోషిస్తూ ఉంటుంది' అనుకున్నాడు ముసలివాడు.

'నాగరకుడైన ఒక మానవుని సుఖదుఃఖాలు ఒక మొరటు జంతువుపైన ఆధారపడి ఉండడం ఎంత విచిత్రం! జీవితం నానా విధాలైన వైరుధ్యాలతో నిండి ఉంది' అనుకున్నాడతడు.

నక్క తలలో గుచ్చుకుని నిఠారుగ నిలుచుని ఉన్న ఈటెమీద తోటిగువ్వ కూర్చున్నది. తన కంఠాన్ని ఏ మాత్రం తగ్గించకుండా, మార్చకుండా అవిరామంగా అరుస్తున్నది. అప్పుడప్పుడు తలను వంచి గాజు పెంకుల వలె ఉన్న నక్క కళ్ళను చూస్తున్నది. అది మృతదేహానికి ఇంత సమీపంగా ఇదివరకెప్పుడూ రాలేదేమో! విపరీతంగా గొంతుపెంచి అరవ సాగింది.

'ఈ తోటివాడు నాకు తోడ్పడటానికి వచ్చాడో లేక నా కొంప ముంచడానికి వచ్చాడో తెలియకుండా ఉంది. తానొక వింతను కండ్ల జూసినంత మాత్రాన అంతూ పొంతూ లేకుండా అరుస్తూ ఉండడమేనా? బహుశ ఈ తోటి వానికి గూడు లేదేమో. ఒకవేళ గూడు ఉన్నా అందులో భార్యా, పిల్లలు లేరేమో. వీడు గూటికి వచ్చినా రాకపోయినా పట్టించుకునే వారెవరూ లేరేమో. కాని ఈ వెకిలి వెధవ నా సుక్కపంది ఉన్న పరిసరాల్లో అరుస్తూ గోల చేస్తుండడం ఇక నేనెంతమాత్రం సహించను' అనుకున్నాడు ముసలివాడు.

తోటిగువ్వ ఆ ప్రాంతంలోని నిశ్శబ్దాన్ని చిన్నాభిన్నం చేస్తూ రావిడి చేస్తున్నది. తానొక తపస్సు ఆచరిస్తున్నట్లు దీక్షగా, శ్రద్ధగా అరుస్తున్నది.

'ఇది ఇలా అరుస్తూ ఇంకొకసారి నక్కల దాడిని తెచ్చి పెడుతుందేమో.' అనుకున్నాడు ముసలివాడు. ఆ తలపు రాగానే అతని మనసు భగభగ మండింది. ఇంతవరకు కన్నీటి పొరచేత కప్పబడి ఉండిన కనుగుడ్లు ఎర్రనయ్యాయి. 'వీలు లేదు. ఇప్పుడు మిగిలి ఉన్న ఎనిమిది సలుగులలో ఒక్కటి గూడా కనుగందడానికి వీలు లేదు. అవసరమైతే ఈ అడవినంతటినీ భస్మం చేస్తాను.' అనుకుంటూ అతడు మొలలో నున్న కత్తిని తీసి తోటి గువ్వమీదకు గురిచూసి వదిలాడు. పిట్ట విసురుగా వెళ్ళి అంత దూరాన పచ్చికమీద పడి రెక్కలను కొట్టుకోసాగింది. ఇప్పుడు దాని అరపులకు బదులు దాని రెక్కల తపతపలు వినిపించసాగాయి. అది తన రెక్కలతో ఇసుక రేణువులను ఎగరగొడుతూ కొంతసేపు గిలగిల తన్నుకుని గాలిలోకి లేవబోయి రెండు పల్టీలు వేసి పెడరెక్కలు వేసుకుని గబాలున కిందబడి ప్రాణం విడిచింది.

కొమ్మమీద కూర్చుని ఉన్న ముసలివాడు పండ్లు కరచుకుని కసిగా చూస్తున్నాడు.

తోటి గువ్వ చనిపోవడంతో ఆ ప్రాంతాన్ని నిశ్శబ్దం ఆవరించింది. గాలి తగ్గిపోయి ఆకు అల్లాడకుండా ఉంది. నల్లని మేఘాలు నిశ్శబ్దంగా చంద్రుని కడ్డంగా పయనిస్తున్నాయి. మిణుగురుల-వలె, నక్షత్రాల వలె అసంఖ్యాకంగా ఉన్న బిలిబిత్రిపూలు వాసనలను వెదజల్లుతున్నాయి.

[ఇంకా వుంది]




## భవాని — మచిలీపట్నం

నాకు ఒక పట్టాన ఎవరూ నచ్చరు. ఎవరేనా ఇష్టం అయితే నా గురించి వాళ్లకంతా చెప్పేస్తాను. మధ్యలో వారిని · కొంచెము మాట్లాడనిస్తా. వారు వెళ్లాక 'ఎక్కువ మాట్లాడాను' అని నాలో నేను బాధపడతాను. దీనికి పరిష్కారం చెప్పండి ?

★ ఏంలేదు చిట్టితల్లీ. బలవంతంగానేనా— వినడం అలవాటు చేసుకోవడమే !

## పి. వి. టి. - పువాబేడ

రామారావుగారిపై మీకున్నది అభిమానమా ? దురభిమానమా ?

★ అభిమానమే. దురభిమానం దేనికి ?!

ఈ మధ్య నటి స్మిత యిచ్చిన స్టేట్‌మెంటుపై స్త్రీగా మీ కామెంట్ ప్లీజ్ ?

★ ఆమె వ్యాపారిగా మాట్లాడిందేగాని స్త్రీగా నూ కాదు. నటిగానూకాదు. దాన్ని పెద్దగా పట్టించుకోకూడదు.

## వి. యు. — ఘంటసాల

పి. జి.లు చేసి రోడ్డుపైబడు రోమియోల లాగా ప్రవర్తిస్తారుగాని సంస్కారయుతంగా ఒక్కడూ వుండడు. మరి కొంతకాలానికి క్రాఫ్ పెంచినందుకు, హైట్ పెరిగినందుకు, మీసం పెద్దసైజులో పెంచినందుకు, తెలుపురంగు అయినందుకుకూడా ఆడపిల్ల తల్లితండ్రుల దగ్గిరనుండి కట్నం వసూలు చేస్తారా ? భయంగా వుందండీ...

★ మీ భయంలో అర్థంలేకపోలేదు ! పరిస్థితులు చూస్తూవుంటే అలాగే వున్నాయి. పిల్లల తల్లితండ్రులే కళ్ళుతెరచి చూడాలి -- అమ్మాయిల మనస్సులు ఎలా బాధపడుతున్నాయో... పెళ్ళి ముఖ్యమేగాని ఇంత తక్కువతనం ఫీలవడం పిల్లలకీ — పెద్దలకి తగదు.

## హెచ్. వి హెచ్-హనుమాన్ జంక్షన్

చదువుకున్నవాడికి చదువుకోనివాడికి తేడా?

★ ఏం లేదు — చదువు తప్ప !

## ఎం. వి. కె. — ఉరవకొండ

జీవాత్మ, పరమాత్మ, అంతరాత్మ అంటే ఏమిటి ?

★ మనిషిగా ఆలోచించేది,
మనిషిగా చేయవలసింది,
మనిషిగా చేయతగ్గది — బోధించేది.

## కె.ఎమ్.ఆర్. — హైదరాబాదు

దేశభాషలందు తెలుగులెస్స అన్నాడొకనాటి చక్రవర్తి. అదే నిజం అయితే ఈనాడు రూపాయి మీద మన భాష అతి క్రిందుస్థానం ఆక్రమించుకుంటుంది ఎందుకు ?

★ రూపాయి విలువెంత ? యిక దానిపై భాషల స్థానాన్ని గురించి చింతించడానికి ! మీరుట్టి వెర్రివారిలా వున్నారు ?

## కె.పి ఎఫ్. — కొత్తగూడెం

మీ ఫొటో ప్రశ్నావళి పక్కన ప్రతివారం ప్రచురిస్తే బాగుంటుంది.

★ దడుసుకొని పేజీ తిప్పేస్తారని నా భయం — కొండముది నన్ను ధీరగంభీర అన్నారేగాని బ్యూటిక్వీన్ రచయిత్రి అనలేదే !

మీకెంతమంది పిల్లలు ?

★ ముగ్గురమ్మాయిలు.

మీరు గయ్యాళి అని కొందరు కాదని కొందరు...

★ గయ్యాళినే. లేకపోతే ఎలా బ్రతకడం— ఈ అమాయకులమధ్య ?!

## పి.యు.ఎమ్. - కాశీబుగ్గ

అక్కయ్యా, ప్రేమ గుడ్డిది అయితే, పెళ్ళో ?

★ చేతి కర్ర !

## ఎ. ఎస్. - వాయుడుపేట

జీవితంలో మీరు ఏమి సాధించాలనుకొన్నారు ?

★ అందాకా 'సాధించడం'తో తృప్తిపడుతున్నట్టుగా తోస్తూంది !

## వై.హెచ్.ఎచ్.ఆర్. - దోర్నకల్

నేటి సమాజిక వ్యవస్థలో సాహితీమూర్తులు వరకట్న నిర్మూలనకు ఎలాంటికృషి చేస్తున్నారు?

★ తాము పుచ్చుకోకుండా వుండడంచేస్తే చాలు. ఇక రచనలంటారా ! సాహితీమూర్తుల రచనలలో సాంఘిక సమస్యల చర్చలే వుంటే - చదివే పాఠకులు ఎంతమంది ?!

## యు.యు.యు. — ఎమ్మిగనూరు

నిజానిజాలు తెలుసుకోకుండా నిందలు వేశారు నా స్నేహితులు. నేను కనపడ్డప్పుడు చిరునవ్వు నవ్వుతారు. నేనటువెళ్లగానే గుసగుసలు... వీరిని స్నేహితులని ఎలా నమ్మమంటారు ?

★ ఇది కలికాలం ఉరుకుందం గారూ, స్నేహితులే గోతులు తవ్వి పడతామా లేదా అని చూసే రోజులనిపిస్తున్నాయి. ఒకవేళ పడితే మంచి పనైందని అంటూనే సానుభూతిలాంటిది ప్రకటిస్తారు. పడలేదూ ? బాధపడతారు. మీరేం దిగులు పడకండి — చేతనైతే మీరూ రెండు నాల్కల మనిషిలా ప్రవర్తించి స్నేహితుల్ని నిలబెట్టుకోండి. లేదా ? మీరేం అనుకుంటున్నదీ తెలియనివ్వకండి !

## జి. వి. — హైద్రాబాదు

స్నేహితుల విలువ — సంఖ్య బలంలోనా ? సారబలంలోనా ?

★ సారబలమే ప్రధానం వెంకటేశులు గారూ, స్నేహితుల సంఖ్య తగ్గినకొద్దీ — స్నేహం విలువ అర్థం అవుతూవుంటుంది. నిజమైన స్నేహితులు — వేళ్లమీద లెక్కించ కల్గినవాళ్లే వుంటారు. నాకైతే — ఒక చేతి వేళ్ళు చాలు ! !









చదువుతున్న పుస్తకం పక్కనపడేసి బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు శ్రీకాంత్. రెండు గంటల నుంచి ఏకబిగిని చదువుతున్నాడేమో తల దిమ్ముగా వుంది. తల విదిలించి టైము చూసుకున్నాడు. అయిదు గంటలవుతోంది. బెడ్‌రూమ్‌లోకి నడిచి నిద్రపోతున్న రత్నని కుదిపాడు, ''మొద్దు ! లే ! ఎంతసేపు నీ నిద్ర ! గాడిదలా ఈ పగలు నిద్రేమిటి ? ''

మూసుకుపోతున్న కళ్ళని టపటపలాడిస్తూ లేచి కూర్చుంది రత్న. ''నిద్రపోకుండా నే చెయ్యాల్సినపన్లేం మురిగిపోవటంలేదుగ ! మాట మంచి లేకుండా మీరు పుస్తకం పట్టుక్కూర్చుంటే నేను మీకేసి చూస్తూ కూర్చోవాలా?''

చీరె సవరించుకుని వంటింట్లోకెళ్ళబోయింది టీ చెయ్యటాన్కి. ఆమె వెనుకే నడుస్తూ అడిగాడు శ్రీకాంత్ ''సినిమాకెళ్దామా ?''

ఉత్సాహంగా భర్త వైపు తిరిగింది, ''యమగోల'' కెళ్దామండీ ! క్రిందటిసారి వచ్చినపుడు చూడటం కుదరలేదు. ఇప్పుడు మళ్లీ ఆడుతోందట.''

''డవెన్ అండ్ డర్ద్ వాటర్ ఫాక్స్''కి వెళ్దాం. ఎంటర్ టెయినింగ్‌గా వుంటుంది.''

''అయితే మీరొక్కళ్లేవెళ్లి ఆనందించండి. నాకు ఇంగ్లీషు సినిమాలు అర్థమవ్వవని తెలిసీ మీ పంతం విడవరు. అర్థంలేని కాల్చుకోవటాలు పేల్చుకోవటాలు. ముద్దులు పెట్టుకోవటం వెర్రిమొహం వేసుకుని చూడటంలో నాకు ఆనందంరాదు తలనొప్పి వస్తుంది. నేను రాను'' ఉక్రోషంగా అంది రత్న.

''నీకు టేస్ట్ వుండి ఏడిస్తే కదా ! నిన్నని ప్రయోజనమేమిటి ! ఇలా అవుతుందని తెలిసీ సినిమా ప్రపోజల్ పెట్టటం నాది బుద్ధితక్కువ. త్వరగా టీ చెయ్యి. డిపార్ట్ మెంట్ కైనా పోతాను.''

కోపంగా డ్రెస్ చేసుకోసాగాడు శ్రీకాంత్ ! అంతకంటే కోపంగా టీ చేసి అతనికి అందించింది. తాగేసి వెళ్లిపోయాడు. పరధ్యాన్నంగా వంట మొదలెట్టింది రత్న.

* * *

ఎనిమిది గంటలవుతుండగా తిరిగివచ్చాడు శ్రీకాంత్. ''భోంచేద్దాం రండి'' పిల్చింది రత్న.

డ్రెస్ మార్చుకుని డైనింగ్ టేబుల్ దగ్గరకి వచ్చికూర్చున్నాడు. మౌనంగా వడ్డించ సాగింది రత్న. అన్నీ వడ్డించి తినడానికి ఉపక్రమించబోతుండగా శ్రీకాంత్ కంఠం చిరాగ్గా వినిపించింది.

''ఎప్పుడూ ఇవే కూరలు దోసకాయ పచ్చడి, వంకాయ కూర, బెండకాయ వేపుడు. తినీ తినీ విసుగొస్తోంది. కొత్త రకాలేమైనా చెయ్యలేవూ ! ఎన్ని కుకరీ బుక్స్ వున్నాయి ఇంట్లో ! అస్తమానం నిద్రపోదామని తప్ప మరో ధ్యాస, ఆసక్తి లేదు నీకు.''

విసురుగా అంది రత్న ''అవన్నీ ఇంగ్లీషులో వున్నాయని మీకు ఎన్నిసార్లు గుర్తు చెయ్యాలి ! నేను చెయ్యనన్లేదుగా ! అంత తినాలని వుంటే మీరు చదివి ఎలా చెయ్యాలో నాకు చెప్పొచ్చు కదా !''

''చెప్పటమేం ఖర్మ నేనే చేస్తాను'' ముఖం చిట్లించి అయిష్టంగా అన్నం కలుపుకోవడం మొదలెట్టాడు శ్రీకాంత్.

''చెప్పటాన్కి మీకు ఓపిక ఉండదు. తీరిక ఉండదు. చేసినది తినటానికి విసుగు. పోనీ ఒక పని చేద్దాం. వంటమనిషిని కుదర్చండి. మీరు నాకు పెట్టే తిండి మరీ వృధా అవ్వించకుండా వుండటానికి పనిమనిషిని మాన్పించి ఆ పని నేను చేస్తాను.''

తుమ్మముళ్ళలా గుచ్చుకున్నాయా మాటలు శ్రీకాంత్‌కి ''అయామ్ సారీ రత్నా'' గొణిగినట్లుగా అనేసి తలవంచుకుని గబగబా అన్నం తినసాగాడు. మౌనంగా భోజనాలు ముగిశాయి. రత్న ఏదో పుస్తకం తీసుకుని మంచంమీద వాలింది. శ్రీకాంత్ రేడియో ముందు కూర్చున్నాడు.

ఇంగ్లీషులో వార్తలు వస్తున్నాయి. ఉన్నట్లుండి శ్రీకాంత్ ఎగిరి గంతేశాడు. దాంతోపాటే ''హుర్రే'' అని గట్టిగా కేక.

రత్న ఖంగారుగా పరుగెత్తుకొచ్చింది ''ఏమయిందండీ'' అంటూ.

ఆమెని పట్టుకుని గిరగిర తిప్పాడు. ''నా ఎక్స్‌గైడ్‌కి నోబెల్ ప్రైజు వచ్చిందోయ్ !''

''అంటే ?'' అమాయకంగా అడిగింది రత్న.

పొంగుతున్న పాలపై నీళ్ళు చిలకరించినట్లయింది శ్రీకాంత్‌కి.

''అంటే... అంటే ప్రపంచంలో అన్నిటికంటే గౌరవప్రదమైన బహుమతి అన్నమాట. గౌరవమే కాదు. లక్షా ఎనభై వేల డాలర్లు అంటే దాదాపు పదహారు లక్షల రూపాయల డబ్బు కూడా.'' రత్నకి అర్థమయ్యే భాషలో చెప్పగల్గానన్న గర్వంతో కాలరు సర్దుకున్నాడు.

రత్నకి డబ్బు సంగతి బాగానే అర్థమయింది. కానీ శ్రీకాంత్ ఎందుకు గెంతుతున్నాడో అర్థం కాలేదు. అది అడగబోయేలోపునే ఆమెను వదిలేసి ఫోన్ దగ్గర కూర్చున్నాడు. ''ఆయనకి ఫోన్‌చేసి కంగ్రాట్యులేషన్స్ చెప్పాలి'' అంటూ—

''ఇప్పుడు ఆ మాట చెప్పటాన్కి అమెరికా ఫోన్ చేస్తున్నారా?'' వింతగా అడిగింది రత్న.

''అవును. ఏం ?''

''ఊళ్ళో పెళ్ళికి కుక్కల హడావిడి అని మీలాంటి వాళ్ళని చూసే అని వుంటారు. ఆయన కెవరికో వస్తే మీకేదో ఒరిగి ఒళ్ళో పడ్డట్లు హడావిడి. రెండువందల రూపాయలు తగలేసి అమెరికాకి ఏదో ముంచుకుపోయినట్లు ఫోన్ చేయటమా!''

ఆమె చెంప ఛెళ్ళుమన్పించాలనే కోరికను అతి కష్టంమీద నిగ్రహించుకున్నాడు.

''పల్లెటూరి గబ్బిలాయివి. అంతకంటె ఏమంటావు?'' రత్న కోపంతో ఒళ్ళు మరచిపోయింది. ''మాటమాటకీ పల్లెటూరి మొద్దు పల్లెటూరి గబ్బిలాయి అనటాన్కి మీకు సిగ్గులేదు! 'చేసేది పట్టణవాసం మేసేది పల్లెల గ్రాసం' అని ఎవరన్నారోకాని వూరికే మాత్రం అన్లేదు. పల్లెటూరి గబ్బిలాయిలందరూ మీలాగే మడత నలగని బట్టలేసుకుని కడుపులో చల్ల కదలని వుద్యోగాలు చెయ్యటానికెగబడితె మీవంటి వాళ్ళందరూ తినాల్సిందే గడ్డి'' మితిమీరిన కోపంతో సన్నగా వణుకుతోందామె.

ఇంకా గట్టిగా అరవబోయిన శ్రీకాంత్ కాలింగ్‌బెల్ మోగటంతో ఆగిపోయాడు. ముఖం ప్రసన్నంగా చేసుకోవటానికి ప్రయత్నిస్తూ తలుపు తీశాడు.

ఎదురింటి జంట. మిసెస్ బెనర్జీ ఆవిడ వెనకే మిస్టర్ బెనర్జీ. ఆవిడ శ్రీకాంత్ కొలీగ్. ఆయన ఇంజనీరు. వస్తూనే నవ్వుతూ అందావిడ ''హాయ్ శ్రీకాంత్ ! కంగ్రాట్స్ ! ఇప్పుడే న్యూస్ విన్నాము. మీ బాస్‌కి నోబెల్ ప్రైజ్ వచ్చింది కదా ! ఫోన్ చేస్తున్నారా ?''

''థ్యాంక్యూ ! కూర్చోండి ! జస్ట్ డయల్ చెయ్యబోతుంటగా మీరొచ్చారు. కాల్ బుక్ చేసేసి...''

''ష్యూర్ ! గో ఎ హెడ్'' కుర్చీల్లో కూర్చున్నారు. ఆవిడ రత్న వంక చూసి చిరునవ్వు నవ్వింది. వాళ్ళు బెంగాలీలు. శ్రీకాంత్ వాళ్ళుంటున్న యూనివర్శిటీ కాంపస్‌లో చాలామంది ఆంధ్రేతరులే ! ఇంటికి ఎవరొచ్చినా ఇంగ్లీషులోనే సంభాషణ. రత్నకి ఒక ముక్కా అర్థం కాదు. బొమ్మలా కూర్చుని తన లోకంలో

తానుంటుంది. వాళ్ళందరూ ఇంగ్లీషులో మాట్లాడుకుంటూ నవ్వుకుంటుంటే ముఖంలో ఏ భావం లేకుండా అందరివంకా చూస్తూ కూర్చోవటం రత్నకి ప్రాణసంకటంగా, చాలా చిన్నతనంగా వుంటుంది. శ్రీకాంత్ తిడ్తాడని కాని లేకపోతే లోన కూర్చుని పుస్తకం చదువుకోవటమో పని చూసుకోవటమో చేసేది. పెళ్ళయిన కొత్తల్లో అలాగే చేసేది. ఒకసారి శ్రీకాంత్ తీవ్రంగా కోప్పడ్డాడు.

''ఇంటి కెవరైనా వస్తే మంచీ మర్యాదా లేకుండా అలా లోన కూర్చుంటే వాళ్ళేమనుకుంటారు? పొగరూ, టెక్కూ అనుకుంటారు.''

''మీతో వచ్చి కూర్చుని నేనేం చెయ్యాలి ? మీరు మాట్లాడుకునేవి నాకు అర్థమవుతాయా? ఏమన్నానా ? వంగతోటలో గుడ్డివాడి సామెతగా మీరు నవ్వినప్పుడల్లా నేనూ నవ్వనా ?''

''ఏం చేస్తానో నా కనవసరం! అంతఃపురంలో ఘోషా స్త్రీలా లోనమాత్రం కూర్చోకు.''

అప్పట్నుంచీ అందరిలో కూర్చునే తన లోకంలో తనుండటం నేర్చుకుంది.

కొంచెంసేపు మాట్లాడి బెనర్జీస్ వెళ్ళిపోయారు.

ఆ రాత్రి రత్న మంచానికి ఓ చివరగా ముడుచుకుని పడుకుంది. శ్రీకాంత్ మెల్లగా ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

''కోపం వచ్చిందా?'' మృదువుగా అడిగాడు.

''లేదు'' ముక్తసరిగా అనేసి కళ్ళు మూసుకుంది.

''సారీ రత్నా ! నాకు కోపం వచ్చినపుడు ఒళ్ళుపై తెలియదు. ఏమంటున్నానో అనే స్పృహలేకుండా మాట్లాడేస్తాను. అవన్నీ నీవు మనసులో పెట్టుకోకూడదు.''

''చెంపదెబ్బ కొట్టి సారీ అంటే నొప్పి పోతుందా?'' ఆవేశంగా అంది రత్న లేచి కూర్చుంటూ. ''ఏమండీ ! మిమ్మల్నో మాట అడుగుతాను చెప్పండి ! పెళ్ళి చేసుకునే ముందు నేను చదువురానిదాన్ననీ పల్లెటూరి మొద్దుననీ మీకు తెలిసే చేసుకున్నారు కదా! మేమేమీ దాచిపెట్టలేదే ! మిమ్మల్ని బలవంత పెట్టలేదే ! మరి ప్రతిరోజూ మాటలతో నన్నెందుకిలా హింసిస్తున్నారు? ఈ వేళ ఒక్క రోజులో మూడుసార్లు ఘర్షణ. చదువుకోనంతమాత్రాన అర్థం చేసుకునే శక్తి లేకపోతుందా ? నాకు అర్థంకాని విషయాలు విడమర్చి చెప్పవచ్చుకదా! పల్లెటూరిదాన్నయినంత మాత్రాన బాధపడే మనసుండదా? మాటలతో చిత్రవధ చేస్తారా!''

మరి మాట్లాడలేక మోకాళ్ళమీద తల పెట్టుకుని ఏడవసాగింది.

''రత్నా ! ప్లీజ్ వూరుకో ! నన్ను క్షమించు రత్నా! సాధ్యమైనంతవరకూ నాకోపం అదుపులో పెట్టుకోవడానికి ప్రయత్నిస్తాను. నిన్ను



## జీవితం నేర్పిన పాఠం

నొప్పించకుండా వుండటాన్కి కూడా ! ఏడవకు! వూరుకో రత్నా వూరుకోవా ?''

ఆమెను దగ్గరగా హత్తుకుని మీద చెయ్యేసి పడుకున్నాడు. ఇద్దరికీ నిద్ర రావటం లేదు. ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు.

రత్నావళి తణుకు దగ్గర దువ్వ అనే చిన్న పల్లెటూళ్ళో భూస్వాముల యింటి బిడ్డ. వూళ్ళో స్కూలున్నా ఆమె చదువు ఆరోతరగతి దాటలేదు. అయినింటి ఆడపిల్ల రజస్వలానంతరం 'మగపిల్లలుండే బళ్ళో చదువు కోవటమా ?' అని తల్లీ తండ్రీ స్కూలు మాన్పించేశారు. శ్రీకాంత్ సంబంధం కుదిరే వరకు చింతగింజలు, పచ్చీసు ఆడుకుంటూ, అట్లతద్ది, ఉండ్రాళ్ళతద్దీ, వరలక్ష్మీవ్రతం వంటి పండగలన్నీ శ్రద్ధగా జరుపుకుంటూ కాలం గడిపేసింది. ఆ పల్లెటూళ్ళో చదువు రాక పోవటం ఒక పెద్ద లోపంగా తోచనేలేదామెకి.

శ్రీకాంత్ అమెరికాలో డాక్టరేట్ చేశాడు. ఫారెన్ రిటర్న్డ్ కుర్రాడని సంబరంగా అతనికే మాత్రం ఆస్తి లేకపోయినా ఇరవై ఎకరాలు చెరుకుపొలం కట్నంగా ఇచ్చి వైభవంగా పెళ్లి చేశారు. శ్రీకాంత్‌కి చదువుకున్న అమ్మాయిని చేసుకోవాలన్పించినా, సంవత్సరానికి ఎంతలేదన్నా ఎనభై వేలు నికరాదాయాన్నిచ్చే చెరుకుపొలం, ఇంట్లోకి కావలసిన సమస్తం ప్రతిఏటా పల్లె నుంచి వస్తాయనే ప్రలోభం రత్నని చేసుకునేలా చేశాయి. ఈరోజుల్లో డబ్బుకిచ్చిన గౌరవం, చదువుకీ, విజ్ఞానానికీ ఇవరిస్తున్నారు ?

ఆస్తిపరుడైతే అయ్యాడుకాని అందుకు కారణభూతురాలైన రత్న సహచర్యం శ్రీకాంత్‌కే మాత్రం సంతృప్తి నివ్వటంలేదు. తన కెరియర్ లోని ఒడిదుడుకులను ఆమెతో చర్చించి సాంత్వన పొందలేదు. తన స్నేహితులతో సరదాగా కలిసి పోలేదు. తనకి నచ్చిన రీతిగా అలంకరించుకోదు. తను మెచ్చే రుచులతో వండి పెట్టలేదు.

ఇంక రత్న సమస్యలు మరోరకం. శ్రీకాంత్ వర్క్ చేసే యూనివర్శిటీ కాంపస్‌లో క్వార్టర్స్‌లో మకాం కావటంతో రత్న ఒడ్డునపడ్డ చేపలా గిల గిల లాడింది. కాంపస్‌లో చాలావరకు ఇతర రాష్ట్రాల వాళ్ళు. ఉన్న తెలుగు వాళ్ళలో లక్షా తొంభై కీచులాటలు, పార్టీలు, రాజకీయాలు. ఒకళ్ల ముఖం ఒకళ్లు చూసుకోరు. పెళ్లయ్యే వరకూ ఇంటినిండా మనుషుల మధ్య మసలటం అలవాటయిన రత్నకి లంకంత ఇంట్లో ఒంటరిగా రోజు గడవటం కష్టంగా వుండేది. శ్రీకాంత్‌కీ రత్నకీ అలవాట్లలో అభిరుచుల్లో హస్తిమశకాంతరం. శ్రీకాంత్‌కి ముక్కుమీద కోపం. గారంగా పెరిగిన రత్నకి అమితమైన అభిమానం, ఫలితంగా తరచు కీచులాటలు.

పెళ్ళయిన కొత్తలో వైస్ ఛాన్స్‌లర్ శ్రీకాంత్‌పై వున్న అభిమానం మూలంగా శ్రీకాంత్ రత్నలకీ డిన్నర్ ఇచ్చారు. ఆ పార్టీకి మరికొంతమంది ముఖ్యుల్ని కూడా పిలిచారు. పార్టీకి తయారైన రత్న ముస్తాబు చూసి శ్రీకాంత్ మండిపోయాడు. జరీ కొంచెం ఎక్కువ మోతాదులో వున్న పట్టుచీర కట్టు కుంది. జడకుచ్చులు పెట్టుకుని పెళ్ళికి చేయించిన బంగారు సంపెగల జత జడలో పెట్టుకుంది. రెండు చేతులకీ రాళ్ళ గాజులు-మెడలో రాళ్ళ నెక్లెస్.

మెచ్చుకుని ముద్దు పెట్టుకుంటాడను కొన్న రత్నకి శ్రీకాంత్ అరుపులు ఏడుపు తెప్పించేయి.

''గంగిరెద్దులా ఏమిటా వేషం ? నిన్నిలా వెంటేసుకెళ్తే నా పరువుండాలా ? వూడాలా ? ఎంబ్రాయిడరీ చేసిన గులాబీ రంగు అమెరికన్ జార్జెట్ చీరె కట్టుకో ! ఆ నెక్లెస్ తీసేసి నల్లపూసలు వేసుకో. బంగారపు ఫ్ఫ్రాలు నీకున్నాయని అందరికీ తెలియక్కర్లేదు. గులాబీ ఒక్కటి పెట్టుకో. జడకుచ్చులు తీసెయ్. ఆ గాజులన్నీ తీసేసి ఎడంచేతికి వాచీ, కుడిచేతికి రెండు బంగారు గాజులు, వాటిమధ్య నాలుగు గులాబి రంగు గాజులు. అయిదు నిమిషాల్లో రావాలి !''

''పార్టీకి నేను రాను'' అనే మాటలు రత్న నాలుక చివరివరకూ వచ్చి ఆగిపోయాయి. ఇంకా శ్రీకాంత్ దగ్గర రత్నకి కొత్తపోలేదు. భయం తగ్గలేదు. శ్రీకాంత్ ప్రతి విషయానికీ ఓర్పు లేకుండా విసుక్కోటంతో కొత్త, భయం పోయి ఎదురు మాట్లాడటం నేర్చుకుంది. అవును మరి ! నాలుగు గోడల మధ్య బంధించి హింసించడం ప్రారంభిస్తే పిల్లికూడా ఎదురు తిరిగి కళ్ళు పీకుతుందట.

ఆ సంవత్సరం శ్రీకాంత్ స్నేహితులంతా కలిసి ''న్యూ ఇయర్ నైట్'' సెలెబ్రేట్ చేసుకోవాలని నిర్ణయించుకున్నారు. హాట్ డ్రింక్స్‌తో పాత సంవత్సరానికి వీడ్కోలూ, కొత్త సంవత్సరానికి స్వాగతమూ పలకటం విద్యాధికులకు ఈ రోజుల్లో పెద్ద ఫ్యాషనై పోయింది.

పార్టీ శ్రీకాంత్ స్నేహితుడింట్లో రాత్రి తొమ్మిది గంటలకి మొదలయింది. రత్న శ్రీకాంత్ అభీష్టంమేరకు అలంకరించుకుని వెళ్ళింది. అందరూ నవ్వుతూ తుళ్ళుతూ మాట్లాడు కుంటున్నారు. మగవాళ్ళందరూ బీరు, జిన్, విస్కీ ఎవరికి కావలసినవి వాళ్ళు తాగుతున్నారు. ఆడవాళ్ళలో కొంతమంది ఫ్రూట్‌జ్యూస్, కొంతమంది జిన్ తీసుకుంటున్నారు. రత్నకి ఎవరో పైనాపిల్ జ్యూస్ అందించారు. అది చేతిలో పెట్టుకుని రికార్డ్ ప్లేయర్‌లో వస్తున్న వెస్టర్న్ మ్యూజిక్ వింటూ కూర్చుంది.

రత్న ఇదివరకెన్నడూ హాట్ డ్రింక్స్ చూసి

# వేడి మీ శక్తిని పిండి పీల్చేస్తున్నప్పుడు...



ఇది మీరు నమ్మిన గ్లూకోజ్-డి యొక్క కొత్త పేరు

# గ్లూకోన్-డి Ⓣ తీసుకోండి

**అదనపు శక్తి కోసం—అలా మీకు కావలసినప్పుడల్లా.**

అలసట కలిగించడంలో వేడిని మించిందిలేదు. అలా వేడి వాతావరణంలో పనిచేస్తున్నప్పుడు అలసట, దాంతో పాటే నీరసం వచ్చేస్తుంది. అప్పుడే మీకు కావాలి ఉత్సాహాన్నిచ్చే, చల్లదనాన్నిచ్చే గ్లూకోన్-డి. అది మీకు అదనపు శక్తిని ఇస్తుంది. అలా మీకు కావలసినప్పుడు.

గ్లూకోన్-డి, లక్షలాది మంది 30 ఏళ్ళుగా విశ్వసిస్తూ వస్తున్న గ్లాక్సోజ్-డికి కొత్త పేరు. పళ్ళరసం, పాలు, టీ, కాఫీ, నీళ్ళు—దేనిలోనైన అలా దాన్ని కలుపుకు తాగండి లేక దేనితో కలపకుండా అలాగే తాగండి. శక్తి అలా ఉరకలు వేస్తూవచ్చే అనుభూతిని పొందండి.

గ్లూకోన్-డి మీ కుటుంబంలో నివారందరి కోసం. పనుల్లోనూ, ఆటల్లోను వారికి చురుకుదనం కోసం. గ్లూకోన్-డి—అందరికీ పరిచయమున్న అదే పచ్చ ప్యాక్‌లో వస్తుంది.






**విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్ తో బలపరచబడిన అసలైన గ్లూకోజ్ పౌడర్ – గ్లాక్సో సమర్పణ**

HTB-GLL-6737-TC

ఎరగదు. చాలాసేపటివరకూ మగవాళ్ళంతా ఏం తాగుతున్నారో అర్థం కాలేదు. పార్టీ మధ్యలో శ్రీకాంత్ ఆమె దగ్గరగా వచ్చి "ఏమైనా కావాలా ?" అని అడిగాడు.

అతని నోట్లోంచి వాసన. రత్న గబుక్కున చిరాకొంగులో ముక్కు మూసుకుంది. "మీ గ్లాసులో ఉన్నదేమిటి ?" అనుమానంగా అడిగింది.

"విస్కీ" అతిమామూలుగా సమాధాన మిచ్చాడు.

రత్నకి ఒక్కసారిగా తాగివచ్చి భార్యని చావగొట్టే తాగుబోతులూ, కొండంత ఆస్తిని తాగుడుతో హారతికర్పూరంలా కరిగించే వ్యసనపరులూ ఇత్యాది కథలన్నీ గుర్తొచ్చాయి. భయంతో నిలువెల్లా కంపించింది వెనువెంటనే కోపం. పరిసరాలు మరిచిపోయింది. "మీకు తాగుడు అలవాటుందని పెళ్ళికి ముందు ఎందుకు చెప్పలేదు ? ఎంత మోసం ! ఇంకేమేం వ్యసనాలున్నాయి మీకు ? అబ్బ ! ఇంతమంది తాగుబోతుల మధ్య ఇంతసేపట్నుంచీ కూర్చున్నానా ? ఇంకొక్క క్షణంకూడా ఉండను. మీరు మీ ఇష్టమొచ్చినపుడు రండి!" గబుక్కున కుర్చీలోంచి లేచి బయటికి పరిగెత్తింది. అందరూ ఆశ్చర్యంగా కుతూహలంగా ఇటే చూస్తున్నారు. శ్రీకాంత్‌కి భరించలేనంత చిన్నతనంగా అన్పించింది. ఎలాగో అందరికీ క్షమాపణలు చెప్పేసి ఆమె వెనుకే పరుగెత్తుకెళ్ళాడు. ఇంట్లోకి వెళ్ళగానే ఆమె చెంపలు టపటప వాయించేశాడు.

"యూ కంట్రీ బ్రూట్ ! ఎన్నడైనా తాగివచ్చి తందనాలాడానా ? తెలియని దానివి తెలియనట్టుండక వెధవ వేషాలూ నువ్వూనూ. అడవి మృగాన్ని నాగరిక ప్రపంచంలోకి తెస్తే ఎలా ప్రవర్తిస్తుందో అలాగే ప్రవర్తించావు."

రత్న గబగబ బట్టలు సర్దుకోవడం ప్రారంభించింది. ఎంత త్వరగా వచ్చిందో అంత త్వరగానూ పోయింది శ్రీకాంత్ కోపం. తనదే పొరపాటు. రత్న ఆకుచాటు పిందెలా బయటి ప్రపంచం ఎలా వుంటుందో తెలియకుండా పెరిగింది. పార్టీకి వెళ్ళేముందే పార్టీ ఏమిటో ఎలా వుంటుందో విడమర్చి చెప్పాల్సిన బాధ్యత తనది. మోతాదు మించకుండా అప్పుడప్పుడూ డ్రింక్స్ తీసుకోవటం వ్యసనంకాదనీ, నాగరికులు అలవర్చుకోవలసిన వింత అలవాట్లలో ఒకటనేది రత్నకెలా తెలుస్తుంది ! రత్నని బుజ్జగించి ప్రసన్నం చేసుకునేసరికి కొత్త సంవత్సరం నాలుగు గంటల పాతదైపోయింది.

ఇలాంటివే మరెన్నో సంఘటనలు.

* * *

రోజులు అతి మెల్లగా గడుస్తున్నాయి రత్నకి. ఒకరోజు సాయంత్రం శ్రీకాంత్ చాలా ఉత్సాహంగా వచ్చాడు ఇంటికి. రత్న తలుపు తియ్యగానే ఆమెను కౌగిట్లో బంధించాడు. "ఏమిటి విశేషం?" రత్న నవ్వుతూ అడిగింది. రత్న అల్పసంతోషి. భర్త ఎంత కోపగించుకున్నా ఎన్ని మాటలన్నా ఆప్యాయంగా పలకరించగానే అవన్నీ మరచిపోయి కళకళలాడే మొముతో బదులిస్తుంది. రత్నలోని ఈ గుణమే శ్రీకాంత్‌ని తన పొరపాటు గుర్తించి క్షమాపణ కోరుకునేలా చేస్తుంది.

శ్రీకాంత్ సంతోషంగా సమాధానమిచ్చాడు. "ఇంకో రెండు మూడు నెలల్లో మనకి రెక్కలొస్తున్నాయోయ్. అమెరికా వెళ్ళబోతున్నాం."

శ్రీకాంత్ ఆశించినట్టు రత్న సంతోషంగా డాన్స్ చెయ్యలేదు సరికదా, ఆమె ముఖం సీరియస్‌గా అయిపోయింది. నెమ్మదిగా భర్త చేతుల్ని వదిలించుకుని సోఫాలో కూలబడింది. ఆమె పక్కనే కూర్చున్నాడు శ్రీకాంత్ "ఏమిటి రత్నా ! అలా అయిపోయావు ? నీకు సంతోషంగా లేదా ? లేక ఇప్పట్నుంచే మీ వాళ్ళ మీద బెంగగా వుందా ?

"ఏవండీ ! మీకోమాట చెప్తాను మధ్యలో అడ్డు రాకుండా వింటారా ?"

"చెప్పు."

"మన దేశంలో నాలాగా చదువుకోని ఆడపిల్లలు కోకొల్లలు. వాళ్ళందరి మధ్య బతుకుతూ కూడా, మీరు నాకొక్కదానికే చదువు రానట్టు, ఇంగ్లీషు రానట్టు భావిస్తు నన్ను కించపరుస్తూ, నేను మీ భార్యనైనందుకు మిమ్మల్ని మీరు కించపరుచుకుంటున్నారు. కనీసం రోజుకోసారైనా పోట్లాడుకుంటున్నాము. ఇంక అమెరికా వెళ్తే అక్కడి పరిస్థితిని బట్టి నిజంగానే నన్ను వింత మృగంలా చూస్తారేమో!

### అల్ట్రాసోనిక్ కత్తులు!

వైద్యశాస్త్రంలో ఉపయోగించేందుకు జపానులోని సుమిటిమో బేకలైట్ కంపెనీ వారు కొత్త అల్ట్రాసోనిక్ ఆపరేషను కత్తులను తయారు చేశారు. ఇవి శరీరంలో కేన్సరు, ఇతర అవాంఛనీయ పెరుగుదలను సులభంగా తొలగిస్తాయి. ఇంతకు ముందు ఇటువంటి కత్తులను అమెరికాలో తయారు చేశారు. విద్యుచ్ఛక్తి, లేసరు కత్తులకంటే ఇవి ఎంతో సురక్షితమైనవి. ఇవి రక్తనాళాలకు, నరాలకు ఎటువంటి ప్రమాదం కలుగనివ్వవు. వీటిని ఉపయోగించటం తేలిక. పైగా చౌక కూడాను. జపానులో కొన్ని ఆస్పత్రులలో వీటిని ఉపయోగించి, ఇవి అద్భుత ఫలితాలనిస్తున్నాయని తెలియచేశారు.

"A **MASS ENTERTAINER** WITH A TOUCH OF MESSAGE"




నిర్మాత: **క్రాంతికుమార్** దర్శకత్వం: **ఎ. కోదండరామిరెడ్డి** సంగీతం: **చక్రవర్తి** మాటలు: **సత్యానంద్** కెమెరా: **వెంకట్**

(ఆంధ్ర): శ్రీ సాయి కంబైన్స్ ; నైజాం: యస్.యన్.ఏ.పి. సీడెడ్: వి.యం.సి.






బులుసు వేంకటరమణయ్య

# అడ్డుపుల్లలు

ఏదైనా ప్రాంతానికిగాని, గ్రామానికి గాని అభివృద్ధి కార్యాన్ని తలపెట్టినపుడు అనుకూల శక్తులతోపాటు ప్రతికూలశక్తులుకూడ బహిరంగంగానో, తెరచాటునో పని చేస్తూనే ఉంటాయి—కేవలం అధికారం చెలాయిస్తూ, పనిచెయ్యడానికి వెనకతీసేవారిని కార్యక్రమంలో కలుపుకోకపోతే,వారే ఏవో అడ్డుపుల్లలువేస్తూ ఉంటారు. వాదవివాదాలు చెలరేగుతాయి. పార్టీలు ఏర్పడతాయి. ప్రజా క్షేమం అనే విషయం విస్మృతిపథంలో పడుతుంది. పార్టీలు బలాబలాలు చూసుకుంటారు. కోర్టులకు ఎక్కడమే ఆతర్వాత జరిగేపని. కోర్టులసంగతి తెలియనిదేమున్నది? వాయిదాలమీద వాయిదాలు పడుతూ వారాలు, నెలలు, సంవత్సరాలు తిరిగి పోతున్నా వ్యవహారం తేలదు. ఇది మనకు అనాదిగా వస్తున్న సంప్రదాయం గదా! ఈ లోపున కొంతవరకూ నడచిన పని ఆగిపోయి, క్రమంగా పాతబడి, ఆనవాలయినా లేకుండా అంతరించి పోతుంది. లక్షల, కోట్ల వ్యయంతో ప్రారంభమయిన పనులు ఈ స్థితికి రావడం మనం కళ్లారాచూస్తూనే ఉన్నాము. వ్యవహారం తేలి, అనుకూల పరిస్థితి ఏర్పడితే— పునః ప్రారంభం కావలసి ఉన్నది. అడ్డుపుల్లల వల్ల కలిగే అనర్థం ఎలాటిదో గమనించండి!

కార్యం సానుకూలంగాజరగడానికి వ్యక్తిగత విభేదాలను పిడిచిపెట్టి,గౌరవమర్యాదలుచూసుకోకుండా సమైక్యంగా ప్రయత్నం జరగాలి. అడ్డు పుల్లలు పడకుండా చూచుకోవాలి! అడ్డు పుల్ల వెయ్యడంవల్ల కలిగిన సంఘటనకు ఒక ఉదాహరణ :— ఒక సామాన్య సంసారికి అత్యవసరంగా అయిదు వందల రూపాయలు కావలసివచ్చింది. ఒక ఋణదాతను ప్రార్థించగా, అతడు — అయిదు వాయిదాలుమించకుండా తీర్చేషరతుమీద అప్పు ఇవ్వడానికి సమ్మతించాడు. ప్రామిసరీ నోటు వ్రాయడం జరిగింది. తాను ఋణం చేస్తున్నందుకు కారణం అందులో చెప్పాలిగదా! అప్పు తీసుకునేవాడు "నా చిల్లర అప్పులు తీర్చుకొనేనిమిత్తం" అని అందులో వ్రాశాడు. ఇక సాక్షి సంతకాలు కావలసి ఉన్నది— తెలిసిన తగు మనిషిని సాక్షి సంతకం చెయ్యవలెనని కోరగా— అతడు పత్రాన్ని ఎగా, దిగా చూచి "బాగుంది, చిల్లర అప్పులుతీర్చుకోడానికి ఈ ఋణం అన్నమాట! పెద్ద అప్పులువేరే ఉండవచ్చునుగదా!" అని అన్నాడు. ఆ మాట విని ఋణదాత నిర్ఘాంతపోయాడు. ప్రతిగ్రహీత కొయ్యబారిపోయాడు. ఆ అడ్డుపుల్లప్రభావం వల్ల ఆ ఋణం పుట్టలేదు.

అడ్డు పుల్లల వల్ల అనర్థం కలుగక తప్పదు. ★

---

అది మీరు భరించగలరా? ఆ జీవితం తల్చుకోవటానికే నాకు భయంగా వుంది." కొంచెంసేపాగి మళ్లీ అంది. "మీరు మీతో సమంగా చదువుకున్న అమ్మాయిని చేసుకోవల్సింది. పోనీండి. అయిపోయిన పెళ్లికి బాజాలెందుకు? జరిగిందేదో జరిగిపోయింది. మీరు నాతో సంతృప్తి పడలేరు. మీకు తగిన అమ్మాయిని చూసి చేసుకుని అమెరికా తీస్కెళ్లండి. "నేను మా నాన్నకి బరువయిపోను. కట్నం సంగతి తల్చుకొని సంకోచించకండి. ఆ ఆస్తి లేనంత మాత్రాన మా నాన్నకొచ్చే నష్టమేమీ లేదు. ఒకవేళ నేను చచ్చిపోయి మీరు రెండో పెళ్లి చేసుకుంటే మా నాన్న మీకిచ్చిన కట్నం తిరిగి తీసేసుకోడుకదా!"

మూగబోయి వింటున్న శ్రీకాంత్ చప్పున ఆమె నోరు మూశారు. "రత్నా..." మంటల్లో నిల్చోబెట్టినట్లు విలవిలలాడాడు.

రత్న కళ్ళల్లో నిండిన నీళ్ళు చెంపలపైకి జారాయి. కన్నీళ్లతో తడిసిన ఆ ముఖాన్ని పదేపదే ముద్దు పెట్టుకున్నాడు.

ఏవేవో మాటలు గొంతుదాటి బైటకి

## జీవితం నేర్పిన పాఠం

దూకాలని ఆరాటపడుతున్నాయి. గరగరలాడే కంఠం సహాయ నిరాకరణ చేస్తోంది. చివరికెలాగో గొంతు పెగుల్చుకుని అన్నాడు—

"నిజంగానే నిన్ను కట్నం కోసమే పెళ్ళి చేస్కున్నాను రత్నా! నా చదువు నాకు ఆత్యాశ కూడదని నేర్పలేదు. కాని జీవితం నేర్పింది. నా తప్పుకి నిన్ను శిక్షించి మరింత మూర్ఖుణ్ణవనా? నీ మనసింత బాధ పడుతోందని అర్థం చేసుకోలేకపోయాను రత్నా! దేన్నయినా వదులుకుంటానుగాని నిన్ను వదులుకోలేను."

భార్యని దగ్గరగా మరింత దగ్గరగా హత్తుకున్నాడు. కంఠం చెప్పలేని భావాలన్నీ కౌగిలి చెప్పాలనే ఆరాటం! ఎంతసేపున్నారో అలా! రత్న ముఖాన్ని పైకెత్తి అన్నాడు శ్రీకాంత్ "నేను అర్జెంట్‌గా చెయ్యాల్సిన పన్లు రెండున్నాయి. నువ్విలా నన్ను కట్టిపడేస్తే ఎలా?"

"ఏమిటో అవి?"

"మొదటిది నీ పేర్నవున్న పొలం మీ నాన్నగారి పేర రిజిస్టర్ చేయించటం. రెండు నిన్ను స్పోకెన్ ఇంగ్లీషు కోర్సులో జాయిన్ చెయ్యటం."

"అంటే?"

"ఇంగ్లీషు మాట్లాడటం నేర్పుతారన్న మాట. ఆ కోర్సు పూర్తయ్యేలోగా మనం వెళ్ళాల్సొచ్చినా ఫరవాలేదు. అమెరికాలో కూడా అటువంటి కోర్సులు వుంటాయి. అక్కడ కంటిన్యూ చెయ్యొచ్చు."

"ఎక్కడికో పంపించే బదులు మీరే నేర్పొచ్చుగా! నాకు ఈ బస్సుల్లో తిరగాలంటే భయం బాబూ!"

నీవు పుస్తకాలు ముందేసుకుని బుద్ధిమంతురాలైన విద్యార్థినిలా నాముందు కూర్చుంటే నాకు పాఠం చెప్పాలన్పించదు. నిన్నేమేమో చెయ్యాలన్పిస్తుంది.

"అయితే రోజూమీరుయూనివర్శిటీలో..."

కళ్ళు విప్పార్చి అడుగుతున్న రత్న చెంప గిల్లాడు.

"అక్కడ నీలా ముద్దొచ్చే ముద్దబంతులుండరోయ్!"

"కవిత్వం కూడా!" నవ్వుతూ అతని గుండెమీద ముఖం వాల్చింది ముద్దబంతి. కాదు కాదు. రత్నావళి. ★

# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వేంకట దుర్గాప్రసాద్



### (జోనాథన్ డైరీ తరువాయి భాగం)

"పదండి, క్షణం ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు" అన్నాను. అందుకు వాన్‌హెల్సింగ్ కదలలేదు. మెల్లగా అన్నారు.

"పికడిల్లీ ఇంట్లోకి ఎలా వెళతాం ?"

"ఎట్లాగయినా సరే; తలుపులు బద్దలు కొట్టయినా సరే" అన్నాను.

"అట్లా చేస్తే పోలీసులు వస్తారు. వాళ్లకి ఏం సమాధానం చెపుతాం ?"

నేను వెనక్కి తగ్గాను. కానీ ఆలస్యం చేస్తున్నకొద్దీ డ్రాకులా లాభం పొందుతాడు. అందుకే మెల్లగా అన్నాను.

"ఇట్లా ఆలోచిస్తూ కూర్చోవద్దు. నాకు ఎంత బాధగా వుందో అర్థం చేసుకోండి"

"నాయనా ! నాకు తెలుసు. మీ బాధను ఎక్కువ చెయ్యటం నాకిష్టంలేదు. కానీ ఆలోచించి చేద్దాం. ఆ ఇంట్లోకి వెళ్లటానికి మన దగ్గర తాళంచెవి లేదు అవునా ?"

అవునని తలూపాను.

"మీరే ఆ ఇంటి యజమాని అనుకోండి. తాళంచెవి మీ దగ్గర లేదు. తలుపులు బద్దం కొట్టే ఆలోచన మీకు లేదు. అప్పుడు ఏం చేస్తారు ?" వాన్‌హెల్సింగ్ అన్నాడు.

"అప్పుడు తాళాలు బాగుచేసేవాడ్ని తీసుకొచ్చి తాళంచెవి తయారుచేసిపెట్టమని అడుగుతాను."

### ( గత సంచిక తరువాయి )

"అప్పుడు పోలీసులు జోక్యం కలుగ జేసుకోరా !"

"వాళ్లు రారు. యజమాని తాలుకు మనిషి అనుకుంటారు."

"అయితే అట్లా చేద్దామా ? కానీ అతని తాలుకు మనిషిలా నటించగలగాలి. లేకపోతే పోలీసులతో చిక్కువస్తుంది. ఇప్పుడో చిన్న చదివిన కథ చెపుతాను. ఒకాయన లండన్‌లో ఓ యిల్లు కొన్నాడు. వేసవిలో స్విజర్లాండువెళ్లి కొన్ని నెలలు వున్నాడు. ఆ సమయంలో ఒక దొంగ దొడ్డివేపు కిటికీ అద్దాలు పగలగొట్టి లోపలికి జొరబడ్డాడు. తర్వాత అన్ని తలుపులు కిటికీలు తెరిచాడు. వీధిలో పోలీసులు తిరుగుతూనే ఉన్నారు. అతను ఆ యింట్లో వస్తువుల వేలం ఏర్పాటు చేశాడు. దాన్ని గురించి పత్రికల్లో ప్రకటనలు వేయించాడు. ఇంటి ముందు నోటీసు బోర్డు పెట్టాడు. ఒక రోజున అన్నీ వేలంవేసి డబ్బు చేసుకున్నాడు. తర్వాత ఇళ్లు కట్టేవాడి దగ్గరికెళ్లాడు. తలుపులు కిటికీలు, కట్టడానికి పనికొచ్చేవి అన్నీ ఇల్లుకూలగొట్టి తీసుకెళ్లే విధంగా ఆ ఒక్కడికి అమ్మేసాడు. పోలీసులు కూడా పాపం ఎంతో సాయం చేసారు తెలీక. చివరకు అసలు యజమాని స్విజర్లాండు నుంచి తిరిగి వచ్చేసరికి ఏవుందక్కడ ? ఒట్టి ఖాళీ స్థలం. ఇదంతా చట్ట ప్రకారం జరిగినట్టుగా జరిగింది. మనం కూడా అలాగే చెయ్యాలి. అందుచేత ఇప్పుడే తొందరపడి వెళ్లొద్దు. పది గంటల తర్వాత వెళ్దాం. అప్పుడు జనం బాగా వుంటారు. జనం వున్నప్పుడే చేస్తే, అనుమానం రాదు పోలీసు వాళ్లకు." అన్నారు వాన్‌హెల్సింగ్.

ఆయన చెప్పింది సబబుగానే వుంది. అప్పటి వరకు నిరాశగా వున్న మినా మొహంలో కాస్త ప్రశాంతత ఏర్పడింది. వాన్‌హెల్సింగ్ మళ్ళీ చెప్పటం మొదలెట్టాడు.

"ఆ ఇంట్లో మనకు కొంత సమాచారం తెలియవచ్చు. అయినా అక్కడ ఒకరు వుండాలి, మిగతావాళ్ళు బెర్మాండ్‌సీ, మైలెండులో వెతుకుతారు."

ఆర్థర్ వెంటనే లేచాడు "మా మనుషులకు టెలిగ్రాం ఇచ్చి కొన్ని గుర్రబ్బళ్ళను పంపించమని చెప్తాను. అవి మనకు చాలా అవసరం అవుతాయి" అన్నాడు.

దానికి మోరిస్ అన్నాడు "భలే చెప్తున్నావు. అట్లా చేస్తే అందరి కళ్ళల్లో పడతాం. అట్లా కాకుండా బాడుగ బళ్ళు ఉపయోగించి, వీలయితే ఇళ్ళకు దూరంగా దిగి, నడిచివెళ్లాలి."

"క్విన్సీ మోరిస్ చెప్పింది నిజం. ఎట్లాగయినా అతనిది గొప్ప బుర్ర" వాన్‌హెల్సింగ్ మెచ్చుకున్నాడు.

మినాలో చురుకుదనం ప్రవేశించింది, మా సంభాషణ విన్న తర్వాత. రాత్రి జరిగిన భయంకరమైన అనుభవం లోంచి తేరుకున్నట్టుంది. ఆమె మొహం బాగా పాలిపోయింది. పెదాలు విడిపోయి వున్నాయి. వాటి మధ్య పళ్ళు కనిపిస్తున్నాయి. ఆ సమయంలో, డ్రాకులా లూసీ రక్తాన్ని రుచి చూసిన తర్వాత, లూసీ ఏమయిందో గుర్తుకు వచ్చేసరికి నా శరీరం చల్లబడింది. కానీ మినా పళ్ళు సూదిగా లేవు. కొంత వరకు భయం. అయినా, ఆ భయం మాత్రం వదల్లేదు నాకు.

మా చర్చ అయిన తర్వాత ఒక సందేహం వచ్చింది. మొదట పికడిల్లీ ఇంటికి వెళ్లే ముందు

**జరిగిన కథ—31 :** వాన్‌హెల్సింగ్, మోరిస్, జోనాథన్ డ్రాకులా ఇంటి తాళం తీసారు. ఆ ఇల్లు సకల రోగాలతో ఉన్నట్లు, రక్తపు వాసనలతో పరమ రోతగా ఉంది. అక్కడ యాభయికి బదులు తొమ్మిది పెట్టెలు మాత్రమే ఉన్నాయి. అక్కడ ఉన్న వేనకువేల ఎలుకలను కుక్కల సహాయంతో తోలేసారు. డ్రాకులా ఇంటిలో ఏం జరిగిందో మినా తెలుసుకోవాలనుకుంటుంది. జోనాథన్ శామ్ బ్లోగ్జామ్ ద్వారా మాయమయిన తొమ్మిది పెట్టెల ఆచూకి తెలుసుకుంటాడు. డ్రాకులానే అక్కడక్కడ పెట్టెలు సర్ది పెట్టేస్తున్నాడని తెలుసుకుంటాడు. రెన్‌ఫీల్డ్‌కు ఆత్మలంటె భయమని డ్రాకులాను అతను కలిసేఉంటాడని, ఏదో కొత్త పథకం ఉందని అనుకుంటాడు డాక్టరు సెవార్డ్. డాక్టర్ సెవార్డ్, డాక్టర్ వాన్‌హెల్సింగ్, ఆర్థర్, క్విన్సీమోరిస్‌లకు మిస్టర్ రెన్‌ఫీల్డు తన కల గురించి చెపుతాడు. డాక్టర్ సెవార్డ్, డాక్టర్ వాన్‌హెల్సింగ్, ఆర్థర్, క్విన్సీమోరిస్ మినా గదిలో జోనాథన్ క్రిందపడి ఉండటం చూస్తారు. మినా చేత తన రక్తాన్ని త్రాగిస్తున్న డ్రాకులాను చూసి వీరందరు భయభ్రాంతులవుతారు. వాన్‌హెల్సింగ్ మినాను అసలు ఏం జరిగిందో అడుగుతాడు. ఆమె తనకు జరిగిన భయంకరమైన అనుభవాన్ని చెపుతుంది. రెన్‌ఫీల్డ్ నేలమీద కుప్పలాపడి ఉంటాడు. అతడు మంచంమీద నుంచి క్రిందపడి చనిపోయినట్లు సర్టిఫికేట్ ఇవ్వటానికి నిశ్చయించుకుంటాడు డాక్టరు సెవార్డు. అందరు కలసి పికడిల్లీలోని డ్రాకులా ఇంటిని వెదకాలని నిర్ణయించుకుంటారు.

దగ్గర్లోవున్న ఇంటి సంగతి చూడాలి అని నిర్ణయించాం.

కార్‌ఫాక్స్ ఇంట్లో పనిచూసిన తర్వాత, అందరం కలిసి పికడిల్లీ ఇంటికి వెళ్లాలన్నారు వాన్‌హెల్సింగ్. ఆయన, డాక్టర్ సెవార్డు, నేమా అక్కడ వుండిపోవాలి. ఆర్థర్, మోరిస్‌లు వాల్‌వర్తులోనూ, మైలెండులోనూ వున్న ఇళ్ళు కూలగొట్టిరావాలి. పికడిల్లీ ఇంటికి డ్రాకులా పగలు వచ్చే అవకాశంకూడా వుంది. అప్పుడు అతనితో తలపడటానికి సిద్ధపడివుండాలి, అన్నారు వాన్‌హెల్సింగ్.

నేనుకూడా బయలుదేరటానికి ఒప్పుకోలేదు. మినా దగ్గరేవుండి ఆమెకు అండగా వుండదలచాను. కానీ అందుకు మినా ఒప్పుకోలేదు. ఇటువంటి విషయాల్లో 'చట్టం' తెలిసిన మనిషి అవసరం ఎంతో వుంటుంది, వెళ్ళు. డ్రాకులాకు సంబంధించిన పత్రాలు చదవాల్సి



వుంటుంది. నీకు కొంత అనుభవం వుందికనుక, వాళ్లకి వుపయోగంగా వుంటావు అంది. మినాను కాదనలేకపోయాను.

"నా గురించి నాకు భయంలేదు. పరిస్థితులు బాగాలేవు అని నాకు తెలుసు. అయినా ఏదో ఆశవుంది. దేవుడేవున్నాడు. నువు వెళ్ళు" అంది మినా.

"ఇక తొందరగా బయలుదేరదాం పదండి. ఆలస్యం చేయకూడదు. మనకంటే ముందు డ్రాకులా ఆ పికడిల్లీ ఇంటికి చేరుకుంటే కష్టం" అని అరిచాను.

"అలా కాదు" అన్నారు వాన్‌హెల్సింగ్ తన చేతిని పైకెత్తి.

"ఎందుకని ?" అడిగాను.

"మర్చిపోయారా! రాత్రి అతను బాగా 'తాగాడు'. అంత తొందరగా లేవడు" అన్నారు చిన్నగా నవ్వుతూ.

మర్చిపోవటమా! ఎట్లా మర్చిపోతాం, ఎవరైనా అటువంటి దారుణమైన సంఘటనను మర్చిపోగలరా ? దీనికి మినా తట్టుకోలేకపోయింది. వెంటనే రెండు చేతుల్లో మొహాన్ని దాచుకుంది. మూగగా రోదించింది. మళ్లీ ఆమెకు గుర్తుచేయటం వాన్‌హెల్సింగ్ వుద్దేశం కాదు. కానీ ఆమె వునికి మర్చిపోయి తన ఆలోచన చెప్పారు. తను చేసిన పొరపాటు గ్రహించి ఆయన వెంటనే మినాను ఓదార్చటం ప్రారంభించారు.

"ఓ మేడమ్ మినా, అనుకోకుండా మళ్ళీ మీకు గుర్తుచేశాను. ముసలాడ్ని నాకు మరపు రాదు. నువ్వయినా మర్చిపో" అన్నారు వాన్‌హెల్సింగ్.

ఆమె ఆయన చేతిని అందిపుచ్చుకుని చెమ్మగిల్లిన కళ్ళతో "నేను మర్చిపోను. నాకు గుర్తు వుండటమే మంచిది. మీరు చెప్పినవన్నీ గుర్తున్నాయి. మీరు తొందరగా బయలుదేరండి. వెళ్ళేముందు కాస్త తిని వెళ్ళండి" అంది.

అందరం భోజనం దగ్గర కూర్చున్నాం, సంతోషంగా వుండటానికి ప్రయత్నిస్తూ. మా

## జీవన్ మృతులు

అందరికన్నా మినా చాలా సంతోషంగా కనిపించింది. భోజనం ముగించాక వాన్ హెల్సింగ్ లేచి నిలబడి—

"ఇక మనం బయలుదేరాలి. సాయుధులై బయలుదేరాలి. దయ్యాల్ని, మనుషుల్ని ఎదుర్కొనే విధంగా. ఆ రోజు రాత్రి ఎట్లా వెళ్ళామో అలా" అన్నారు. మేం తలూపాం.

"మంచిది, మేడమ్ మినా. సాయంత్రం మీకు ఎటువంటి ఆపదా రాదు. ఈలోపు మేం తిరిగివస్తాం. ఒకవేళ... లేదు తిరిగి వస్తాం. కానీ మీరు కూడా ఎటువంటి దానికైనా ఎదుర్కొనే విధంగా సిద్ధపడాలి. మీరు క్రింద వున్నప్పుడు మీ పడకగది నేనే ఏర్పాటు చేసి వచ్చాను. కాబట్టి అతను లోపలికి రాలేడు. అయినా మీకు కూడా రక్ష అవసరం. ఇదిగో దేవుని బొట్టుబిళ్ళ మీ నుదుటన వుంచుతున్నాను"

ఆమె నుదుట బొట్టు వుంచారు. అంతే. భయంకరంగా ఏడ్చింది మినా. మా గుండెలు జలదరించాయి. ఆమె మోకాళ్ళమీద కూలబడిపోయింది, విపరీతమైన బాధతో. జుట్టుతో తన మొహాన్ని కప్పుకుంది.

"నేను అపవిత్రురాల్ని. అపవిత్రురాల్ని. ఈ శరీరం కలుషితమయింది" అంది. నేను వెంటనే ఆమె ప్రక్కన కూలబడి, ఆమె చుట్టూ చేతులు వేసి పట్టుకున్నాను. కొన్ని క్షణాలు మా గుండెలు కలిసి కొట్టుకున్నాయి. వాళ్ళు అటుతిరిగి కన్నీళ్ళు తుడుచుకోటం గమనించాను. తర్వాత వాన్ హెల్సింగ్ ఇటు తిరిగి గంభీరంగా అన్నారు—

'మేడమ్ మినా! మనం తెలిసి చేసిన తప్పులేం లేవు. దేవుని చేతిలో మనం కీలుబొమ్మలం. మీరేమీ బాధపడవద్దు.''

కొద్దిసేపటికి అందరం తేరుకున్నాం. ఇక బయల్దేరాల్సిన వేళ అయింది. నేను మినాకు వీడ్కోలు చెప్పాను. ఇట్లాంటి వీడ్కోలు చెప్పే సంఘటనని జీవితంలో మర్చిపోలేను. ఆమెను వదిలి అందరం బయలుదేరాం.

మినా కూడా లూసీలా దయ్యమయిపోతుందా ? అట్లా జరగకుండా చూడాలి.

ప్రక్కనేవున్న కార్‌ఫాక్స్ ఇంట్లోకి అందరం అడుగుపెట్టాం. మేం మొదట వెళ్ళినప్పుడు ఎట్లావుందో, ఇప్పుడు కూడా అలాగే వుంది. ఆ ఇల్లు చూసి భయపడాల్సినంత అవసరం మొదటసారి ఎందుకు కలిగిందో మాకు అర్థం కాలేదు. మేమంతా కృతనిశ్చయంతో వున్నాం. మా బుర్రల్లో గతరాత్రి భయంకర సంఘటనలు గుర్తున్నాయి. అందువల్లనే పట్టుదలతో పని సాగించాం. ఆ ఇంట్లో కాగితాలు ఏమీ దొరకలేదు. పనికివచ్చే పత్రం ఏదీ కనపడలేదు. పెట్టెలు మాత్రం మేం మొదట చూసినసారి ఎట్లావున్నాయో ఇప్పుడూ అట్లాగే వున్నాయి. వాన్ హెల్సింగ్ ముందర అందరం నిల్చున్నాం. ఆయన అన్నారు —

"ఇక్కడ మనం చెయ్యాల్సిన పనివుంది. ఈ ప్రదేశాన్ని అతనికి అందుబాటులో లేకుండా చెయ్యాలి. ఇది పాత చర్చి. లోకాన్ని మోసగించటానికి దీన్ని ఎన్నుకున్నాడు. మనం కూడా దీన్ని వుపయోగించి అతని ఆట కడదాం. దీన్ని పవిత్రంగా తయారుచేద్దాం. పవిత్రమైన చోటుకి అతను రాలేడు. ఈ చర్చి పాడుపడిపోయి దయ్యానికి నిలయమైంది. దీన్ని దేవుని నిలయంగా తయారుచేద్దాం.''

అట్లా అంటూ చేతినున్న సంచీలోంచి స్క్రూడ్రైవర్, రెంచీ తీసారు. వాటితో ఒక పెట్టె మూతను తీసారు. బాగా బూజుపట్టి వాసనగొట్టింది. అయినా మేం పట్టించుకోలేదు. మేం వాన్ హెల్సింగ్ చేస్తున్నది చూడడంలో మునిగిపోయాం. సంచీలోంచి దేవుడి బొట్టు లేక ప్రసాదం లాంటిది నేలమీద మీద చల్లాడు. మళ్ళీ పెట్టెమూత వేసి స్క్రూ బిగించారు. అట్లా ఒక్కొక్క పెట్టె తెరిచి మళ్ళీ మూత వేసారు. మేం ఆయనకు సహాయం చేసాం.

వాన్‌హెల్సింగ్ గంభీరంగా అన్నారు "అంతా సవ్యంగానే జరిగింది. మిగతాచోట్ల కూడా ఇట్లాగే చెయ్యాలి. అప్పుడు మేడమ్ మినా నుదుట వున్న బొట్టు సంతోషంగా మెరుస్తుంది.''

పచ్చిక మైదానంలో నడుస్తూ స్టేషన్ వైపు దారి తీసాం. డాక్టర్ సెవార్డు ఆస్పత్రి ముందరభాగం కనపడింది. కాస్త ఆత్రుతగా మినాకోసం చూసాను. కిటికీదగ్గర మినా కనపడింది. చెయ్యి వూపాను. మా పని జయప్రదంగా ముగించాం అని సైగచేసి చెప్పాను. అర్థమయినట్టుగా ఆమె తల వూపింది. ఆమె కూడా చెయ్యి వూపింది. నా గుండె భారంగా వుంది, ఆమెను వదిలి వెళుతున్నందుకు. రైలు స్టేషన్‌లో బయలుదేరటానికి సిద్ధంగావుంది. ఈ డైరీని రైల్లో కూర్చుని రాసాను.

పికడిల్లీ, గం. 12—30 లు : ఫెన్‌చర్చి స్ట్రీట్ చేరుకునేముందు ఆర్థర్ ఇలా అన్నాడు.

"క్విన్సీమోరిస్, నేనూ, తాళాలు బాగుచేసేవాడ్ని తీసుకొస్తాం. మీరు మాతో రాకండి. తలుపు బద్దలుకొట్టినాకూడా ఇబ్బంది లేదనిపిస్తోంది. ఆ సమయంలో మీరు అక్కడవుంటే మీకు ఇబ్బంది. 'చట్టంగురించి బాగా తెలిసినవారు, మీరు ఇట్లా చెయ్యొచ్చా' అని అడుగుతారు. నా సంగతి ఫర్వాలేదు. 'ప్రభువు' అనే బిరుదు వుంది. దానితో తాళాలు బాగుచేసేవాడ్ని, పోలీసును వశపరుచుకోగలను. మీరు, వాన్ హెల్సింగ్‌తోనూ, జాన్‌తోనూ కలిసి అక్కడ దగ్గర్లోవున్న గ్రీన్‌పార్కులో కూర్చోండి. తాళాలు బాగుచేసేవాడు వెళ్ళగానే, నేను తలుపు తెరవగానే మీరు వచ్చేయండి. మీకోసం చూస్తూవుంటాం.''

మీ సూచన బాగుంది' అన్నారు వాన్ హెల్సింగ్. ఇక ఎవరూ ఏమీ మాట్లాడలేదు. మేం వెళ్ళి గ్రీన్‌పార్కులో కూర్చున్నాం. అక్కడ్నించి ఆ ఇల్లు కనబడుతోంది. దాన్ని చూస్తుంటే గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. మా ఆశలన్నీ ఆ ఇంటిమీదే వున్నాయి. పార్కులో ఓ బెంచిమీద కూర్చుని, సిగార్లు కాల్చడం మొదలెట్టాం, వూర్కే కూర్చుంటే జనానికి అనుమానం వస్తుందని. అట్లా నిముషాలు గడిచిపోయాయి.

ఆ ఇంటిముందు ఓ నాలుగు చక్రాలబండి ఆగటం చూసాం. అందులోంచి ఆర్థర్, మోరిస్ ఎంతో హుందాగా, నెమ్మదిగా దిగారు. తర్వాత ఓ బక్కపల్చటి మనిషి చిన్న పరికరాల పెట్టెతో దిగాడు. బండివాడికి మోరిస్ డబ్బులిచ్చి పంపేశాడు. ఇద్దరూ ఇంటిముందర మెట్లుఎక్కారు. ఆ మనిషితో చెయ్యవలసిన పని చెపుతున్నాడని అర్థమయింది. ఆ తాళాలమనిషి మెల్లగా తన కోటువిప్పి అక్కడున్న ఒక మేకుకు తగిలించాడు. అప్పుడే అటువేపు వచ్చిన పోలీసుతో ఏదో మాట్లాడాడు. పోలీసు తలూపి వెళ్ళిపోయాడు. కొంతసేపు వెతికిన తర్వాత ఆ తాళాలవాడు కుదురుగా కూర్చుని పని మొదలెట్టాడు. తర్వాత లేచి తలుపు తాళం కన్నంలోంచి లోపలికిచూసి, వాళ్ళతో ఏదో అన్నాడు. దానికి ఆర్థర్ చిన్నగా నవ్వాడు. ఆ తాళాలవాడు తాళాలగుత్తిలోంచి ఒక తాళంచెవిని తీసుకుని, తలుపు తాళం తీయటం ప్రారంభించాడు. ఒకటి రెండుసార్లు ప్రయత్నించాడు. మూడో ప్రయత్నంలో తలుపు మెల్లగా తెరుచుకుంది. ఆ తాళాలవాడు, ఇద్దరూ కలిసి లోపలికి వెళ్ళారు. మేం అట్లాగే కూర్చున్నాం. నా 'సిగారు' బాగా వెలుగుతోంది. వాన్‌హెల్సింగ్ సిగారు ఆరిపోయివుంది. ఆ తాళాలవాడు మళ్ళా బయటకు వచ్చి, తన సంచి చేతులోనికి తీసుకునే వరకు, వేచి చూస్తున్నాం. వాడు తలుపును కొద్దిగా తెరిచి పట్టుకు మోకాళ్ళమీద కూర్చుని చూసాడు. తలుపుకి తాళం చెవిపెట్టి చూసాడు. సంతృప్తిపడి దానిని ఆర్థర్‌కు ఇచ్చాడు. పర్సుతీసి ఆర్థర్ వాడికి కొంత డబ్బు ఇచ్చాడు. వాడు కోటువేసుకుని, తన సంచి తీసుకుని, చిన్న నమస్కారం చేసి వెళ్ళిపోయాడు. దీనిని ఎవరూ గమనించినట్టు లేదు.

తాళాల వాడు కనుమరుగవగానే, మేం ముగ్గురం రోడ్డుదాటి ఇల్లు చేరుకుని, తలుపు తట్టాం. వెంటనే క్విన్సీమోరిస్ తలుపు తీసాడు. ప్రక్కనే ఆర్థర్ సిగారు వెలిగించుకుంటూ నిలబడ్డాడు.

"ఇక్కడ బాగా కంపుగొడుతోంది.'' అన్నాడు ఆర్థర్. కార్‌ఫాక్స్‌లో వున్న పాత చర్చి ఇంటి మాదిరిగానే ఇక్కడా బాగా కంపుకొట్టింది.

డ్రాకులా దీన్ని తరచూ వాడుతున్నట్లుగా గ్రహించాం. అందరం దగ్గర దగ్గరగా వుండి ముందుకు నడిచాం, ప్రతిఘటనకు సిద్ధపడుతూ, డ్రాకులా చాలా బలవంతుడుగదా. అయినా డ్రాకులా ఇంట్లో వున్నాడో లేడో తెలియదు.

హాలు వెనుక భోజనాల గది వుంది. అక్కడ ఎనిమిది పెట్టెలు కనిపించాయి. తొమ్మిదికి ఎనిమిది పెట్టెలు కనిపించాయి. అయితే మా పని పూర్తి కాలేదు. ఆ మిగిలిన ఒక్క పెట్టె దొరికే దాక మా పని పూర్తికానట్టే లెక్క. ముందు కిటికీ రెక్కలు తెరిచాము. అక్కడ బయటకు చూశాం. రాళ్లతో కట్టబడిన గుర్రపుశాల కనిపించింది. ఒక్క కిటికీ లేదు.

పెట్టెలు ఒక్కొకటి తెరచి దేవుడి బొట్టు చల్లి మళ్లీ మూత పెట్టేశాం. అన్నీ ఖాళీ పెట్టెలు–కనుక డ్రాకులా అక్కడ లేడని రూఢీ అయింది. అతని తాలుకు మిగతా వస్తువులు దొరకకుతాయేమోనని వెతికాం.

ఇల్లంతా ఒకసారి కలియతిరిగాం. డ్రాకులా తాలుకు వస్తువులు భోజనాలగదిలో వుంటాయని అక్కడ వస్తువులు ఒక్కొక్కటీ జాగ్రత్తగా పరీక్షించటం మొదలెట్టాం. ఏవో కొన్ని వస్తువులు భోజనాల బల్లమీద వున్నాయి. ఆ ఇంటిని కొన్న తాలుకు పత్రాలు చిందర వందరగా వున్నాయి దానిమీద. మైలెండు, బెర్మాండ్‌సీ ఇళ్ళ తాలుకు పత్రాలు కూడా కనిపించాయి. కొన్ని తెల్లకాగితాలు, కవర్లు, కలాలు, సిరా కనిపించాయి. అవన్నీ దళసరి కాగితంలో దుమ్ముకొట్టుకు పోకుండా చుట్టేసి వున్నాయి. బట్టలను శుభ్రం చేసే బ్రష్, తల దువ్వుకునే బ్రష్, ఒక దువ్వెన, చిన్న నీళ్ళ కూజా, చేతులు కడుక్కోడానికి ఓ పాత్ర వున్నాయి. ఆ పాత్రలో నీళ్ళు చాలా అసహ్యంగా, రక్తం కడిగిన దానిలా వున్నాయి. తర్వాత తాళాల గుత్తులు, అన్ని రకాలవి కనిపించాయి. బహుశా అవన్నీ మిగతా ఇళ్ళకు సంబంధించినవి కావచ్చు. అన్నీ జాగ్రత్తగా పరిశీలించాక చివరకు కొన్ని చిరునామాలు దొరికాయి. అవన్నీ తూర్పు, దక్షిణం వేపు వున్న ఇళ్ళ చిరునామాలు. ఆర్థర్, క్విన్సీమోరీస్‌లు అవి నోట్ చేసుకోవటం ప్రారంభించారు. తాళాల గుర్తుల్ని తీసుకున్నారు. మిగతాచోట వున్న పెట్టెల సంగతి చూడటానికి బయలుదేరి వెళ్లారు, ఆ చిరునామాల ఆధారంతో. మిగిలిన వాళ్లం అక్కడ వుండిపోయాం, వాళ్ళు తిరిగి రాడటం కోసం ఎదురు చూస్తు. వాళ్ల కోసమా ? లేక డ్రాకులా రాక కోసమా ?

## డాక్టర్ సెవార్డు డైరీ :

అక్టోబర్, 3 : ఆర్థర్, క్విన్సీమోరిస్‌ల కోసం ఎదురు చూస్తూ కూర్చోడం చాలా కష్టమయి పోయింది. ఎంతసేపటికీ రారు. ప్రొఫెసర్ మమ్మల్ని మాటల్లో పెట్టాడు. వేచి వున్న సంగతి మరిపింపజేయటానికి ప్రయత్నిస్తూ, అప్పుడప్పుడూ జోనాథన్ని అతను గమనిస్తున్నాడు. పాపం అతను చాలా దిగులుగా కనిపించాడు. గత రాత్రి అతను చాలా ఉత్సాహంగా, సంతోషంగా, యవ్వనం, బలం నిండిన మోముతో కనిపించాడు. కానీ ఈ పూట బాగా వాడిపోయినట్టు. ముసలాడు అయిపోతున్నట్టు కనిపించాడు, పాపం అతను మినా గురించి ఆలోచిస్తున్నట్టు వున్నాడు. వాన్‌హెల్సింగ్‌కు ఈ విషయం అర్థమయిపోయింది. అందుకే అతన్ని మాటల్లో పెట్టడానికి చూస్తున్నాడు

"ఈ రాక్షసుడికి సంబంధించిన కాగితాలు నా చేతుల్లోకి వచ్చిన దగ్గర్నుంచి, వాటిని క్షుణ్ణంగా పరిశీలించటం ప్రారంభించాను. వాటిని పరిశీలిస్తున్న కొద్దీ, ఆరాక్షసుడ్ని తొందరగాతుద ముట్టించాలనిపించసాగింది. కానీ శక్తియుక్తుల్లో అతనిదే పైచేయిగా వుంది. బుడాపెస్ట్‌లో రిసెర్చిచేసే మిత్రుడు వున్నాడు. ఈ డ్రాకులా గురించి అతడు చెప్పాడు. డ్రాకులా మనిషిగా బతికున్న రోజుల్లో చాలా గొప్ప సైనికుడు. రాజకీయవేత్తట. సైన్సు గురించి కూడా బాగా తెలుసునట. అతనికున్న బుర్ర ఆ రోజుల్లో అసాధారణం అని అంటాడు. భయం - అన్నా, దిగులన్నా ఎరుగనివాడట. శారీరకంగా అతను చనిపోయినా, అతని మెదడు మాత్రం అన్నీ గుర్తుపెట్టుకున్నట్టు లేదు. ఒక్కోసారి చిన్న పిల్లాడిలా ప్రవర్తిస్తాడు. కానీ మెల్లమెల్లగా అతని తెలివితేటల్ని పెంచుకోగలుగుతున్నాడు. వాటిని తన కార్యక్రమాల్లో ప్రయోగిస్తున్నాడు"

జొనాథన్ బాధగా మూలిగాడు. "అవును. నా మినా వీడి ప్రయోగాలకు గురి అయింది. ఆ ప్రయోగాలు ఎట్లా చేస్తున్నాడో తనకి తెలిస్తే వాడ్ని వోడించవచ్చు."

"మొదట్నుంచీ, డ్రాకులా తన కెంత శక్తి వుందో పరీక్షించుకుంటూ వస్తున్నాడు, మెల్ల మెల్లగా. అతనికున్నశక్తి ఇప్పుడు శైశవదశలోనే వుంది అనుకోవాలి. లేకపోతే ఎప్పుడో మన శాస్త్ర పరిజ్ఞానాన్ని అధిగమించి వుండేవాడు" అన్నాడు వాన్‌హెల్సింగ్.

"మీ మాటలు అర్థం కావటంలేదు. కాస్త వివరం చెప్పండి దిగులుతో వుండటంవల్ల సరిగా అర్థంచేసుకోలేక పోతున్నాననుకుంటా" అన్నాడు జోనాథన్.

వాన్‌హెల్సింగ్ జోనాథన్ భుజం తడుతూ "అట్లాగే చెపుతాను. ఈ డ్రాకులా ప్రయోగాలు అర్థం కావటం లేదా? ఆ క్రిమికీటకాది భక్షకుడు రెన్‌ఫీల్డుని ఉపయోగించుకుని, అతని సహాయంతో డ్రాకులా, మన డాక్టర్ సెవార్డు ఆస్పత్రిలోకి జొరపడుతున్నాడు. ఒకసారిలోపలికి రానిస్తే, డ్రాకులా ఎప్పుడైనా రాగలడు, పోగలడు. మొదటిసారి ప్రవేశానికి ఒకరి సహాయం అతనికి వుండాల్సిందే. రెన్‌ఫీల్డును అందుకు ఉపయోగించుకున్నాడు. ఇక డ్రాకులాకు అతనితో పనిలేదనుకోండి. ఇకపోతే ఆ బరువైన పెట్టెల్ని ఎట్లా ఇతర్లచేత మోయించగలిగాడో చూసారా? మొదట తన శక్తిమీద తనకి నమ్మకం లేదు. అందువల్ల మొదట పెట్టెల్ని మోయలేదు. తర్వాత ఒకసారి సాయం పట్టాడు. ఇక తర్వాత తన శక్తి తెలుసుకున్నాక, తనే స్వయంగా పెట్టెల్ని అక్కడికి ఇక్కడికీ చేరవేయగలుగుతున్నాడు. అందువల్లనే ఆ పెట్టెలు ఎక్కడెక్కడ వున్నాయో బయటవాళ్లకు తెలీడం లేదు. పెట్టెల్ని అతను భూమిలో లోతుగా పాతిపెట్టినా పెట్టవచ్చు. కానీ జోనాథన్, మీరు నిరాశ పడకండి. అతనికి ఆ ఆలోచన రావటానికి టైం పట్టవచ్చు. అతను వున్న పెట్టె తప్ప, మిగతా అన్నిపెట్టెల్లోకి అతనికి ప్రవేశం లేకుండా ఏర్పాట్లు చేసాం. ఇక అతను మరో చోటుకి కదలటానికి వీలులేదు. సూర్యాస్తమయంలోపు మిగతా పని మనం పూర్తిచేయాలి. ఇప్పుడు ఒంటిగంటయింది. ఆర్థర్, క్విన్సీ మోరిస్ తిరిగివస్తూ వుండవచ్చు. రేపు మనకు అసలు పని. కాబట్టి జాగ్రత్తగా వుండాలి, ఏ విషయమూ మరచిపోకుండా" అన్నాడు.

మాట్లాడుతూ వుండగా, హాలు తలుపు కొట్టిన చప్పుడయింది. అది టెలిగ్రాం మెసెంజరు కొట్టిన చప్పుడు. అందరం హాల్లోకి వెళ్లాం. వాన్‌హెల్సింగ్ అందర్నీ నిశ్శబ్దంగా వుండమని సైగచేసాడు చేత్తో. తర్వాత తలుపు తీసాడు. టెలిగ్రాం అందుకుని తలుపువేసేసాడు. దాన్ని బిగ్గరగా చదివాడు.

"డ్రాకులా కోసం కనిపెట్టి వుండండి. ఇప్పుడే 12.45కు కార్‌ఫాక్స్ నుంచి వచ్చి, దక్షిణం వేపుకు హడావుడిగా వెళుతున్నాడు. అతను మీ కోసం వెతుకుతున్నట్టున్నాడు — మినా."

[ఇంకా వుంది]

## మైక్రో కార్ల తయారీ!

జపాను దేశం లక్షల సంఖ్యలో కార్లను విదేశాలకు ఎగుమతి చేస్తున్నప్పటికీ, చిన్న కార్లను మాత్రం దిగుమతి చేసుకుంటున్నది. జపానులో ప్రస్తుతం 550 సిసి ఇంజన్లుగల మినీకార్లను తయారు చేస్తున్నారు. కార్ల నిర్మాణ సంస్థలు సంయుక్తంగా 250 సిసి కార్లను తయారుచేయటానికి కృషి చేస్తున్నాయి. ఇవి త్వరలో అమ్మకానికి రాగలవని భావిస్తున్నారు. జపానులో అతిచిన్న 50 సిసి వాహనాల ఉపయోగంపై ఆంక్షలున్నాయి.

## అల్లాడి స్మారక నిధి

ఆంధ్రప్రదేశ్ మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి తమ తండ్రి, ఉమ్మడి మద్రాసు అడ్వకేట్ జనరల్ శ్రీ అల్లాడి కృష్ణస్వామి శత జయంతి సందర్భంగా ఆయన స్మారకార్థం స్థాపించిన ధర్మనిధికి ఉపరాష్ట్రపతి శ్రీ హిదాయతుల్లా మే 14న ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా శ్రీ హిదాయతుల్లా ప్రసంగిస్తూ, ఇటీవల న్యాయ వ్యవస్థ తీవ్రమైన ఆటుపోట్లకు గురి అయిందని, కనుక దానిని పటిష్ఠం చేయడానికి న్యాయశాస్త్ర విద్యాంసులు తీవ్రమయిన కృషి చేయాలని కోరారు. సామాన్య మానవునికి చాల తక్కువ వ్యయంతో న్యాయం చేకూరేందుకు న్యాయవాదులు, న్యాయమూర్తులు కృషి చేయాలని ఆయన కోరారు. శ్రీ స్వర్గీయ అల్లాడి కృష్ణస్వామి భారత రాజ్యాంగ రచయితలలో ఒకరని, మహా మేధావి అని, తక్కువ స్థితినుంచి గొప్ప స్థితికి వచ్చిన పరిశ్రమ శీలుడని, ఆయనను న్యాయవాదులు, న్యాయాధీశులు ఆదర్శంగా పెట్టుకోవాలని ఉపరాష్ట్రపతి కోరారు. శత జయంతి సభకు అధ్యక్షత వహించిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు ప్రసంగిస్తూ, శ్రీ కృష్ణస్వామి సంస్మరణ రాబోయే తరాల వారికి ప్రేరక శక్తిగా వుండగలదన్నారు. అశోకుడు, చంద్రగుప్తుడు, శివాజీ, జహాంగీర్, సోలమన్ మొదలయిన చక్రవర్తుల కాలంలో న్యాయ నిర్వహణను ముఖ్యమంత్రి ప్రస్తావించి, న్యాయం చేకూర్చడంలో మనం నిజంగా పురోగమించామా అని ఆత్మ విమర్శ చేసుకోవాలని సూచించారు. మనం చేస్తున్న చట్టాలు కేవలం కాయితాలమీదే వున్నాయని, హరిజన గిరిజనులకు, దోపిడీకి గురవుతున్న కార్మిక కర్షకులకు ఉపయోగపడడం లేదని ముఖ్యమంత్రి విచారం ప్రకటించారు. శ్రీ అల్లాడి కృష్ణస్వామి వంటి మేధావుల కృషివల్లనే మనకు ప్రాథమిక హక్కులు లభించాయని, భూమి సంస్కరణలు వంటి వాటిలో ఎదురవుతున్న సమస్యల పరిష్కారంలో న్యాయవాదులు ప్రభుత్వంతో సహకరించాలని ఆయన కోరారు. శ్రీ కృష్ణస్వామి గతకాలానికి చెందినవాడు కారని, వర్తమానానికి, భవిష్యత్తుకు కూడ చెందినవారని రాష్ట్ర గవర్నర్ శ్రీ అబ్రహాం ప్రశంసించారు. ప్రారంభంలో అల్లాడి కృష్ణస్వామి శత జయంతి సంఘాధ్యక్షుడు, సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి శ్రీ జగన్మోహన్‌రెడ్డి స్వాగతం చెప్పారు. రాష్ట్ర ప్రభుత్వం మాజీ ప్రధాన కార్యదర్శి శ్రీ ఓ పుల్లారెడ్డి, రాష్ట్ర హైకోర్టు మాజీ న్యాయమూర్తి శ్రీ గొల్లపూడి వేంకటరామశాస్త్రి, ప్రొఫెసర్ జి. సి. వి. సుబ్బారావు అల్లాడి కృష్ణస్వామి మేధస్సు గురించి, ఔదార్యాది గుణాలను గురించి ప్రశంసించారు.

# హైదరాబాదు నోట్‌బుక్

## రాష్ట్రాలకు స్వయం నిర్ణయాధికారం

ఉస్మానియా విశ్వవిద్యాలయం రాజకీయ శాస్త్ర విభాగం అధ్వర్యాన మే 15, 16, 17 లలో జరిగిన 42వ అఖిల భారత రాజకీయశాస్త్ర మహాసభకు ముఖ్యమంత్రి శ్రీ రామారావు ప్రారంభోత్సవం చేసిన సమయంలో ప్రసంగిస్తూ రాజ్యాంగంలో సూచించిన మేరకు రాష్ట్రాలకు స్వయం నిర్ణయాధికారం వుండాలని, ప్రజల రాజకీయ వాంఛలు తీరడానికి కేంద్రం నుంచి రాష్ట్రాలకు విశేషాధికారాలు లభించాలని కోరారు. వివిధ రంగాలలో దేశాభివృద్ధి జరుగడం కోసం రాజకీయ పరిజ్ఞానం శాస్త్ర సమ్మతంగా రూపొందించాలని ఆయన శాస్త్రజ్ఞులను కోరారు. అఖిల భారత రాజకీయశాస్త్ర సంఘం అధ్యక్షుడు, మదురై కామరాజ్ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు ప్రొఫెసర్ జి. రామచంద్రన్ ఈ మహాసభకు అధ్యక్షత వహించారు. రాజకీయ వ్యవస్థ నానాటికీ దిగజారుతున్నదని, ఈ విషయంలో శాస్త్రీయమైన ఆలోచనలు లేకపోతే పరిస్థితి మరింత క్షీణించగలదని ఆయన విచారం ప్రకటించారు. ప్రారంభంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ శ్రీ సైయద్ హాషిమలీ స్వాగతం చెప్పారు.

## శ్రీ నూకల అమెరికా ప్రయాణం :

హైదరాబాద్ సంగీత కళాశాల ప్రిన్సిపాల్, సుప్రసిద్ధ గాయకుడు, సంగీత శాస్త్రజ్ఞుడు, మహామహోపాధ్యాయ శ్రీ నూకల చినసత్యనారాయణ అమెరికా బయలుదేరారు. ఈయన వాషింగ్టన్‌లో మే 28, 29 లలో జరిగే ఉత్తర అమెరికా తెలుగు సంఘం నాల్గవ మహాసభలో పాల్గొన్నమీదట మూడు నెలలపాటు యునైటెడ్ స్టేట్స్, కెనడా, ఇంగ్లాండులలో పాటకచ్చేరీలు, సోదాహరణ సంగీత ప్రసంగాలు జరుపుతారు ఇంగ్లాండులో పర్యటనలో లండన్‌లోని యూనివర్శిటీ సర్క్యూట్ ఫర్ ఇండియన్ క్లాసికల్ మ్యూజిక్ సంస్థ శ్రీ నూకల ప్రసంగాలు ఏర్పాటు చేసింది. "సంగీతంలో వయోజన విద్యా"పద్ధతులనుగురించి, ఈ విషయంలో తాము రూపొందించి అమలుపరుస్తున్న పథకం ఫలితాలను గురించి ఆయన ప్రసంగిస్తారు.

## ఉపశ్రుతి :

"ఈ రాజకీయపక్షాలు తమలో తగాదాల్లేవని తరచు ప్రకటిస్తుంటారే. ఎందుకూ?" అనడిగారు నన్నొకరు. "రాజకీయ వాదులు, రమణులు ఒక కోవవారు. వారు లేదు అన్నారా ఉంది అని అర్థం. ఉంది అన్నారా, ఇక వారు రాజకీయవాదులే కాదు" అని వెనకటికి డాక్టర్ పట్టాభి సీతారామయ్య చెప్పిన సూక్తిని ఉదాహరించాను నేనతనికి.

— తిరుమల రామచంద్ర

ఇటీవల హైదరాబాద్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో శ్రీమతి సి. వేదవతి రచించిన 'సామెత' గ్రంథాన్ని శ్రీ దేవులపల్లి రామానుజరావు ఆవిష్కరించిన సందర్భంగా వేదికపై శ్రీమతులు సి. వేదవతి, రావి భారతి, శ్రీ వి.వి.ఎల్. నరసింహారావు, శ్రీ ఎం. ఎల్. నరసింహారావు గార్లని చూడవచ్చు.



## న్యూఢిల్లీ లేఖ

[6 వ పేజీ తరువాయి]

కాలంలో మరీను. జ్యోతిబసు బారిస్టర్ పట్టా పుచ్చుకున్న వ్యక్తి. ఆయనకి కంపెనీల చట్టం తెలియకపోతే ఎవరికి తెలుస్తుంది ?

కొనుగోళ్లు, కలుపుగోళ్లు కావాలని కోరేవాళ్లకి కొదువలేదు. బహుగుణ కంపెనీ యాజమాన్యం 100 శాతం విదేశీయులదే. ఇప్పుడు ఈ కంపెనీ ఒక భారతీయ సంస్థగా మారిపోబోతోంది. ఎవరితో ? శరద్‌పవార్ ఎండ్ కంపెనీతో – ఇది ఒక భాగస్వామ్య సంస్థ. అంతూలే ఎండ్ కంపెనీ ఈ కంపెనీని వ్యాపారం నుంచి తొలగించింది. దానితో దీనికి కష్టాలు రావటం ప్రారంభించాయి. నిజానికి అంతూలే ఎండ్ కంపెనీ ఒక స్వతంత్ర సంస్థ కాదు. ఇది ఇందిరా రాజీవ్ ప్రయివేట్ లిమిటెడ్‌కి అనుబంధ సంస్థ. బహుగుణ కంపెనీ యజమానులు ఒప్పుకుంటే ఆయన సంస్థ చంద్రజీత్ యాదవ్ యొక్క (విదేశీ) సంస్థతో కలవవచ్చు. ఏమో ఎవరు చెప్పలరు? చివరికి ఈ కంపెనీలన్నీ శ్రీమతి గాంధీతో కలిసిపోతాయేమో ? వాళ్ల సంస్కృతి ఒక రకమయినదే కదా ? ఈ మాట అనేది ఎవరో కాదు, బహుగుణ స్వయంగా అనేదే. ఒకరకం సంస్కృతి అంటే ఒక రకం వ్యాపారం అన్న మాట. నిజంగా రాజకీయాలు ఒక లాభసాటి వ్యాపారం. ఇందులో ఎన్నో రకాల విదేశీ ద్రవ్యం సంపాదించుకోవచ్చు– రూబల్‌లు, ఫ్రాంక్‌లు, యువాన్‌లు (సోవియట్ యూనియన్, స్విట్జర్‌లాండ్, చీనాల ద్రవ్యాలు).

మేనకాగాంధీకి ఇందులో ఎక్కడ స్థానం. పాపం, ఆమెకి స్థానం లేదనే అనుకోవాలి. కుటుంబ సంస్థలలో ఒక పద్ధతి ఉంటుంది. ఒకే కుటుంబంగా కలిసి ఉంటూ రెండు కంపెనీలు ఉండటానికి వీలులేదు. అందుకనే మేనకని బయటికి పంపించి వేశారు. కథ ఇంతటితో ముగిసినట్లా ? కానేకాదు. ఆమె ఒబ్బిడిగా, మంచి కోడలు అనిపించుకునేందుకు 1 సఫ్దర్ జంగ్ రోడ్‌కి తల వంచి తిరిగి వెళ్లిపోతే అంతా మరిచిపోయి ఆమెని క్షమించి వేస్తారు. మళ్లా ఆవిడకి ఇందిరా రాజీవ్ ప్రయివేట్ లిమిటెడ్‌లో డయిరెక్టరు పదవి ఇస్తారు. ఏమో ఎవరు చెప్పగలరు, ఆమెని జాయింట్ మేనేజింగ్ డయిరెక్టరుగా వేస్తారేమో కూడా ! తక్కిన వ్యాపారాలలో లాగే రాజకీయాలు సయితం ఒక కుటుంబానికి పరిమితం అయితే రాణిస్తుంది. ★

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
Editor : S Radhakrishna.


LIFEBUOY
for health
LIFEBUOY
SOAP
లైఫ్‌బాయ్
ఎక్కడో
ఆరోగ్యం అక్కడ
లైఫ్‌బాయ్‌తో స్నానం చేస్తే పరిశుభ్రంగా ఉంటారు
మీరు.... ఆరోగ్యమైన తాజాదనపు అనుభూతి
పొందుతారు. లైఫ్‌బాయ్‌తో జీవితం ఆరోగ్యప్రదం.
గుర్తుంచుకోండి....
లైఫ్‌బాయ్
మురికిలోని క్రిములను
వదలగొడుతుంది
LINTAS-L75-2317 TL
హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

